# లక్ష్మణ.

(సాంఘికవిషయికమగునవల.)

ఇది

శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారిచే

విరచితము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచేఁ

ప్రకటితము.

1924.

# అంకితము.



విద్యాధికృత సంఘులోపవిత్రతుల్ వేర్పర్చి వానిన్ సుహృత్
హృద్యవ్యాసములన్ జనాళిమదిలో నెక్కించి వైవాహిక
ద్వ్యుద్యోగమ్ము ననాథలోకమునకై స్థాపించె నేధన్యుఁడా
విద్యాసాగర ధర్మపారగున కర్పింతున్ దగన్ మత్కృతిన్.

ఇట్లు,

గ్రంథకర్త.

# విజ్ఞాపన.

---

నే నిదివఱకు వ్రాసిన నవలలన్నియుఁ జరిత్రాత్మకములగుటచే నేదైన సాంఘిక వచనకావ్యమును వ్రాయుమని నామిత్రులెల్లరు నాకుఁ బ్రోత్సాహ మొసఁగుచుండిరి. జాతి మత సాంఘిక విషయములలో నేను వ్రేలిడుటకు సోత్సాహుఁడ నేనైయును, తద్విషయములను వివరించుచు గ్రంథము వ్రాయ కుఁ దగినవాఁడనా యనుశంక నాయుద్యమమునకుఁ గొంతవఱకు నాటం ముఁ గల్గించెను. బాల్యవివాహములఁ గూర్చియుఁ, బునర్వివాహములఁగూ ర్చియుఁ జాటుపద్యముల వ్రాసి పత్రికలకుఁ బంపుచుండుటతక్క, అట్టిగ్రం థము వ్రాయుటలో నాకిదియే ప్రథమోద్యమము. అందుచే నిందెన్ని లోప న్నను వాని నెట్టులో సహించి, నాపక్షము వారగు నవనాగరికులు ఏతత్క ర్యవసానమునకైనఁ దలలాడింపక తప్పదుకదా? ఇంక ఛాందసులగు నాగరికులన్ననో, పూర్వాచారపిశాచావేశపరవశులై, మాపక్షము పైధ్వజ మెత్తక మానరని నేను ముద్రింపారంభపూర్వముననే నిశ్చయించుకొంటిని. ందుచే వారికి వెఱవకపోయినను, పెద్దలగుటచే వినమ్రుఁడనై, కించి దాగ్ర శాంతికై మాత్రము పూజనీయులకు నమస్కరించుచున్నాఁడను.

ఈనవలలోఁ గథానుసారముగ నిరూపకభాగముగూడఁ గొంతకలదు. నాముఖ్యమిత్రులగు శ్రీపాలనంది వేంకటసుబ్బారావు పంతులుగారు మీఁద వివరించిన నిరూపకభాగములో నాకుఁ జాలవఱకుఁ దోడ్పడి, నవలను నాచేఁ త్వరలోనే వ్రాయించిరి. కవులచే గ్రంథములు వ్రాయించి, స్వయముగ వచ్చొత్తించు నుదారభావము శ్రీ వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారికి జనించుట, మాయట్టి గ్రంథకర్తల యదృష్టమేకదా? సర్వేశ్వరుండు రికాయురైశ్వర్యముల నొసంగి చిరకాలము రక్షించుఁగాక!

విజయనగరము
16-6-1912.

ఇట్లు,
గ్రంథకర్త.

# విషయసూచిక.

చున్నట్టులేమియోచూచుచుండిరి. స్నానమునకువచ్చినబ్రాహ్మణోత్తములందఱు జారీచెంబులు చేతనూని భుజములపైఁగలఅంగవస్త్రములు నేలకుఁజీరాడుచుండఁ బరుగుపరుగున నాసమూహమునద్దకుఁ బోవుచుండిరి. క్రమక్రమముగ నచ్చటికి వేలకొలందిజనులుచేరిరి. జనులొకరినొకరు త్రోసికొనుచునాచెఱువుయొడ్డున నల్లకల్లోలమొనర్చుచుండ రాజభటులు వారిని బెదరించుచు నాకలకలమును వారించుచుండిరి ప్రతివారును "ఎంతసాహసము ? ఆహా! ఇంతటిదారుణకృత్యమొనర్చుట కెవరిచేతులాడెనోకదా ?" యని పలువిధములఁ జింతించుచుండిరి. నీలాటిరేవునకువచ్చిన స్త్రీలుకూడ నెందరోయాసమీపమునఁజేరి ముక్కుపై వ్రేలిడికొని తమవిచారాశ్చర్యములను వెల్లడించి పోవుచుండిరి. మరికొందఱీఘోరకృత్యమును గన్నులఁజూడలేమని దూరముగఁ దొలంగుచుండిరి ఇంతలో నాకస్మికముగ, "గణ గణ గణ" యని గంటవాయించినట్టు ఒకధ్వని వినవచ్చినందున నచ్చటిపురవాసులును, రాజభటులును గూడ నక్కునూరిటునటుఁజూడసాగిరి. అప్పుడు రెండుచక్రములత్రొక్కుడుబండిపైఁగూర్చుండి యతివేగమున నావంకకే వచ్చుచుండిన యొకయౌవనపురుషుఁడు వారందరికిఁ గాన్పించెను. "అదిగో డిటెక్టివ్ సబిన్స్పెక్టరుగారు వచ్చుచున్నారు వచ్చుచున్నారు" అని యచ్చటిజనులలోఁ గొందఱు మూలముగఁదొలంగుచుండిరి. రాజభటులు జనులను ప్రక్కకుఁద్రోసి త్రోవఁజేసి, యావచ్చినూతనపురుషున కెదురుగఁబోయి తోడ్కొనివచ్చిరి. తోడనేయచ్చటనున్న పోలీసు ఇన్స్పెక్టరుగా రాయనను జూచి నవ్వుచు నిట్లు ప్రసంగించెను.

"రామారావుగారూ ! ఇంతయాలస్యముగా వచ్చినారేమి ?"

"నాకిప్పుడే సంగతి తెలిసినది."

"సరే! మీచాతుర్యమంతా చూపవలసినసమయము వచ్చినదిసుమండీ! నీటిలోనున్నశవము బాగాచూచినారా?"

"చూచినాను. కత్తితోనఱికినట్లు మెడమీద పెద్దగాయమున్నది.

చీరయు రవికయు రక్తముతో తడిసిపోయినవి. ఇచ్చట మెట్లమీద రక్తముండుటచేత నీమె బలవంతముగ నిచ్చటనే నఱుకఁబడి చెఱువులోఁ ద్రోయఁబడినట్లు నాకు దోచుచున్నది."

"రామారావుగారూ! ఈహత్య యెప్పుడు జరిగియుండునో చెప్పగలరా?"

"ఇందేమిరహస్యమున్నది? రాత్రి పండ్రెండు ఒంటిగంటకు నడుమ జరిగియుండును."

"ఔను. అంతరాత్రివేళ నిచ్చట జనసంచారముండదే!"

"అందుచేతనే యీహత్య యిచ్చట జరుగుటకు కారణమైనది"

"ఈఖూనీ కైవరుదీయుటకేమైన నాధారములున్నవా?"

"కావలసినన్ని. నిన్నరాత్రి ఈచకోరాక్షియింటి కెవరెవరు వచ్చిరో దీనితల్లినడిగి మనము తెలిసికొనవలసియున్నది. దీనినుంచుకొ వారిలోనే యెవరో చకోరాక్షి నిట్లు చంపివేసిరి"

"బాగున్నది. నిన్నరాత్రివచ్చినవారెవరో కనుగొనిరావలసినదని నేనిదివరకే కొందఱుజవానులను చకోరాక్షితల్లివద్దకు బంపించితిని. వారిప్పుడేవచ్చెదరు. దీనికేమిగాని రామారావుగారూ! మెడ పూర్ణముగా నఱుకఁబడకుండుట కేమికారణము?"

"మొదట వారియుద్దేశమదియేకాని సగము సగము నఱుకుచుండ తలో దమకేమో యనుమానముతోచినందున నెవరైన జూచెదరేమో భయపడి తటాలున చెఱువులో బారవేసి పాఱిపోయియుందురు. ఆపగా-ఈ ఖూనీచేసినవారికిదియె ప్రథమప్రయత్నము. శవమును మొదట నీటిలో దూరముగ బారవేసిరికాని కెరటములతాకుడుచే నది మరలనొడ్డున కొట్టుకొనివచ్చినది."

అని రామారావుగారు ఇన్స్పెక్టరుగారితో సంభాషించుచుండ నింతలో నిరువదేండ్ల వయసుగలిగి, తగినంత పొడగరికాక కురుచయైన దృఢకాయముగల యొక యౌవనపురుషుఁడు ముందునకువచ్చి రామారావునిఁజూచి

'అయ్యా! నిన్నరాత్రి 12 గంటలకు నేను బహిర్భూమికి బోవలయునని యీప్రాంతమునకు వచ్చితిని. అప్పుడు సత్యానందరావు ఈప్రక్కనుండియే వచ్చుచుండుట నేనుచూచితిని'

'ఆలాగునా? మంచిసంగతియేచెప్పినారు. మీపేరు?'

'నాపేరు వెంకటేశము.'

'ఓహో! భీమశంకరముగారికి కాబోవు అల్లుడుగారా? సరే తెలిసినది. మీరు సత్యానందరావు నెన్నిగంటలకు జూచితిరి?'

'12 గంటలకని యిదివరకే చెప్పినాను'

'అప్పుడు వానిచేతిలో నేమైన నాయుధమున్నదా?'

'ఏమో చీకటిలో నేనాసంగతి కనిపెట్టలేను'

'వానితో మీరేమైన మాటాడినారా?'

'ఎక్కడనుండి వచ్చుచున్నావని యడిగినాను. అప్పు డతడాతురతతో నేనా? నేనా? పోలిశెట్టియింటికిబోయి నాకీయవలసిన రూపాయినడుగుటకై వెళ్ళి వచ్చుచున్నానని చెప్పెను.'

'ఔను. పాపము సత్యానందరావు బీదవాఁ డగుటచే స్కూలుజీతమిచ్చుకొనలేక నలుగురివద్ద చందావేసికొని చదువుకొనుచున్నాఁడు. పోలిశెట్టి కిప్పుడే కబురంపెదను'

అని ప్రక్కకుఁదిరిగిచూచుసరికి ఆమూలనుండి నల్లనిదీర్ఘకాయమును పెద్దబొజ్జయుఁగల యొకపురుషుఁడు చేతులుజోడించుకొని రామారావు వద్దకువచ్చి,

'బాబ్బాబు! నాకొంపతియ్యకండి. సత్తేనందం రాత్తిరి మాయింటికి రానేలేదు. ఆడు త్తిదొంగమాటసెప్పినాడు.'

'అట్లయినచో వెంకటేశముతో సత్యానందరావు చెప్పినమాట అబద్ధమేనా?'

'అబ్బెంతరం యేంటిబాబూ? తప్పకబద్ధంవే!'

ఇంతలో నింకొకఁడు రామారావుగారివద్దకువచ్చి,

'అయ్యా! రాత్రిరి బారాగంటకు సత్తేనందాన్ని నేనుసూసినాను.'

'ఎక్కడచూచినావు?'

'మాదుకాణంకాడ?'

'నీదేదుకాణం.'

'తమలపాకులదుకాణం'

'ఏమైన బలుకరించితివా?'

'యక్కడికంచొస్తున్నారుబాబూ యని యడిగేను. పోలిశెట్టికాణ్ణుంచని సెప్పినాడు.'

'అప్పు డాతఁ డెట్టివస్త్రములను ధరించుకొనెను?'

'తెల్లసాక్కు, తెల్లనికోటు, తెల్లనిపంచ.'

'నీదుకాణమునద్ద నాతఁ డెంతవరకు నిలిచెను?'

'నిలబణ్ణేగు. యెల్లిపోతుంటే సూసి యడిగినాను'

కొంతసేపునకు మఱియొకఁడు వానిచెంతకువచ్చి కరములను జోడించి,

'బాబూ! నిన్నరాత్రి సత్రురువరుగుమీఁద నేనుపడుకొని దోమలచేత నిద్రలేక కొంచెముకూర్చుండి గంజాయికాల్చుకోవాలని బుద్దిపుట్టి అగ్గిపుడకోసం యిటూ యటూ సూస్తుంటే సత్తేనందంబాబు అలా యెలిపోయినాడు.'

'అప్పు డెన్నిగంటలయియుండును.'

'బారాగంట యేసేస్తారు.'

'నీవృత్తి?'

'నీళ్లకావిళ్లు.'

'బ్రాహ్మణుఁడవేనా?'

'చిత్తం.'

'సత్యానందరావును పలుకరించితివా?'

'చిత్తం.'

'ఏమని.'

'అగ్గిపుల్లయిమ్మని అడిగినాను బాబూ.'

'ఇచ్చినాడా?'

'లేద నేశాడు.'

'అప్పు డతఁడు కట్టుకొనినబట్ట లెట్టివో చెప్పఁగలవా?'

'తెల్లసొక్కా, తెల్లకోటు, తెల్లపంచ '

రామారావుగారు మీదవివరించిన సాక్షులుచెప్పినసంగతులన్నియుఁ దనజేబులోనున్నపుస్తకములో వ్రాసికొని కొంచెముసేపు తమలో నేమియో దీర్ఘాలోచనముఁజేసి, వారందఱిచే సంతకములుచేయించి యిన్స్పెక్టరు గారినిఁజూచి,

'అయ్యా! ఇన్స్పెక్టరుగారూ! మనముసత్యానందరావుదగ్గఱకుఁబోయి మెల్లఁగ మఱికొన్నిసంగతులు గ్రహింపవలయును రండి'

'రామారావుగారూ! ఖూనీ చేసినవాఁ డింతలో దొరకునని నే ననుకొన లేదుసుమండీ.'

'ఓహో! వాఁడెవఁడో మీకుఁ దెలిసినదాయేమి?'

'సందేహ మెందుకు? నిన్నరాత్రి ఖూనీచేసినవాఁడు తప్పక సత్యానందరావే!'

ఆమాటలకు రామారావు నవ్వి 'రండిరండి మీరింకను పెరటిత్రోవలోనే యున్నారు' అని చేయిఁబట్టుకొని ఇన్స్పెక్టరుగారిని సత్యానందము నద్దకుఁ దీసికొనిపోవుచుండిరి రాజభటులుకూడ వారివెనుక బయలుదేరిరి. అట్లు కొంచెముదూరము పోవుసరికి కొందఱు జవానులు వారికెదురుపడి సలాములు చేసి 'అయ్యా! చకోరాక్షితల్లి నిన్నరాత్రి తనయింటికి సత్యానందరావు తప్ప మఱెవ్వరునురాలేదని చెప్పుచున్నది. 11 గంటలకు వచ్చినాఁడట. ఒక అరగంటసేపుమాత్రము కూర్చుండి ఏదోయుత్సవము లోనికి రమ్మని బలవంతముగఁ దీసికొనిపోయినాఁడట' అనిచెప్పిరి. వారిమాటలువిని ఇన్స్పెక్టరుగారు నవ్వుచు రామారావును పరిహసింప నారంభించిరి. కొంతసేపునకు వారందఱు సత్యానంద మున్నగృహము సమీపించిరి.

# ప్రకరణము—౨.

---

## సత్యానందరావు.

గీ. కాలగతి నొక్కొకప్పుడ ♦ కల్మషులగు
జనుల కేనియు నపకీర్తి ♦ సంభవించు;
అటు శమంతక దుర్వా ♦ దాపవాద
ఖేద బాధితుఁ డయ్యెఁ గా ♦ మాధవుండు?.

సత్యానందరావు తెలగాకులములోఁ బుట్టినవాఁడైనను, రూపురేఖలయందును, సుగుణప్రవర్తనములందును బ్రాహ్మణకుమారుఁడాయని యనిపించుకొనుచుండెను. తెలిసినవారుతప్ప, తెలియనివారెవరును వానినిఁజూచి శూద్రజాతివాఁడని పోల్చుకొనలేరు. చిన్నప్పటినుండియు బ్రాహ్మణకుమారులతోడనే యెక్కుడు సహవాసముఁ గలిగియుండుటచేత వానిమాటలుకూడ ఏసలేకుండ స్వచ్ఛముగానుండును బాల్యముననే తల్లి గతించినందున మునసబుకోర్టులో నెలకు [illegible] రూపాయిలు జీతముఁదెచ్చుకొనుచు "ముచ్చి" గాఁ బనిసేయుచుండిన వాని తండ్రి సత్యానందరావున కేకొంతయుఁ గలుగనీకుండ రెండవఫారమువరకుఁ జదువు చెప్పించి కాలముఁజేసెను అప్పటినుండియుఁ బాపమతఁడేకాకియై దిక్కులేక అన్నవస్త్రముల కెంతయో పాటుబడుచు గొప్పవారి నాశ్రయించి, జీవయాత్ర మెల్లఁగ గడుపుచుండెను. దిక్కులేనివారికి దేవుఁడే శరణ్యుఁడుకదా? సత్యానందమునకుఁ బూర్వపుణ్యవశమున నిరువురు బ్రాహ్మణకుమారులు ప్రాణమిత్రులైరి అందులో నొకఁడు మాధవరావు, రెండవయతఁడు మొదటిప్రకరణములోవచ్చిన డిటక్టివ్ పోలీసు సబ్బిన్స్పెక్టరుగారగు రామారావుగారు వీరు మువ్వురును గలసి కాలేజీలో నొక్కతరగతి కాకపోయినను, కలసి చదువుకొనుచుండిరి. వారి సాహాయ్యమున సత్యానందరావు

నకుఁ బుస్తకములఁ గొనుటయందును, తగినవస్త్రములయందును, భోజనము నందును, ఎట్టిలోపమునుగలుగలేదు. స్కూలుజీతముకూడ వారే యిచ్చు చుండిరి. కాని తరువాతఁ బట్టపరీక్షచదువుకొనుటకై మాధవరావు చెన్నపట్ట ణమునకుఁ బోవుటచేతను, రామారావు చదువు చాలించి, పోలీసులో నుద్యోగము సంపాదించుటకు వెల్లూరు ట్రైనింగునకుఁ బోవుటచేతను, మన సత్యానందమునకు మరలఁ గష్టములు వచ్చినవి; కాని యవి యెంతో కాలము నిలువలేదు. మాధవరావు చెన్నపట్టణమునకుఁ బోవునప్పుడు సత్యానందరావు నకు మామూలుగా భోజనముపెట్టుచుండవలయునని తనయింటివారితోఁ జెప్పి యేర్పాటుచేసెను. రామారావు కూడ కొందరుధనికునితోఁజెప్పి వానికి స్కూలు జీతము విషయమై యిబ్బంది లేకుండఁజేసెను. రామారావుగారు పోలీసులో నుద్యోగము సంపాదించి స్వగ్రామమునకు వచ్చినప్పటినుండియు సత్యానందమును పూర్వముకన్న నెక్కుడుగ నాదరించి పోషించుచుండిరి.

క్రిందటి ప్రకరణములో వివరించినట్లు సత్యానందరావుకూనీచేసినట్లు రుజువు వచ్చుచున్నందున, రామారావుగారు వానివిషయమై కొంతవరకు విచా రించిరి. మూర్తీభవించినసద్గుణరాశియని పేరువడసిన తనమిత్రుఁడట్టి సాహ సకృత్యముఁ జేసియుండఁడనియు, ఎవరో దుర్మార్గు లాపనిఁజేసి సత్యానంద ముపైఁ ద్రోసి వేసిరనియు, రామారావుగారు తమలో నిశ్చయించుకొనిరి ఇన్స్పె క్టరుగారితోఁ గలసి రామారావుగారు కొంతసేపునకు మాధవరావింటికి వచ్చిరి. చెన్నపట్టణములోఁబట్టపరీక్షకై చదువుచుండిన మాధవరావు వేసంగి సెలవుల గుటచే నప్పుడింటికి వచ్చియుండెను సత్యానందరావు మాధవరావింటిలోనే నివసించుచుండునని యిదివరకే వ్రాసినారము. రామారావుగా రచ్చటికిఁ బోవుస రికి మాధవరా వరుగుమీదఁ గూర్చుండి దంతధావన మొనర్చుకొనుచుండెను. అప్పుడు రామారావు వానిని సమీపించి యిట్లు ప్రసంగించెను

‘మాధవా! మన సత్యానంద మేమిచేయుచున్నాఁడు?’

‘ఇంకను లేవలేదు. పరుండియున్నాడు’

'ఇంతసేపువరకు నిద్రించియుండుట కేమి కారణము?'

'నిన్నరాత్రి ఆతఁ డెచ్చటికో పోయి రమారమి ఒంటిగంట కింటికి వచ్చెను. అందుచే ఉదయమునచే తన్ను లేపవద్దని నాతోఁ జెప్పినాడు. కాని ఇప్పుడు వానియవసర మేమున్నది?'

'ఆసంగతి తరువాతఁ జెప్పెదను. నిన్నరాత్రి సత్యానంద మింటికి వచ్చునప్పుడు కాతఁ డేటివస్త్రములను దాల్చియుండెను?'

'తెల్లని పట్టు, తెల్లనికోటు, తానుపంచ.'

'రాత్రి తా నెచ్చటికిపోయెనో నీతో చెప్పినాఁడా?'

'పోలీసుస్టేషనుద్దకు చందానిమిత్తము పోయినాఁడట'

'సరే! ఆతఁ డీ చావడిలోని గదియందే పరుండెను కాఁబోలు?'

'ఔను'

వెంటనే రామారావుగారు ఇన్స్పెక్టరుగారితో లోనఁ బ్రవేశించి, సత్యానందము పరుండిన గదియొద్దకుఁ బోయెను. గది తలుపులు లోన గడియలుపడియుండుటచేతరామారావుగారుగట్టిగ రెండుమూడు సారులు చేతితో తట్టి 'సత్యానందా! సత్యానందా!' అని బిగ్గరగఁ బిలిచిరి అట్లు నాలుగైదు సారులు పిలిచినతరువాత లోన నిద్రించుచున్నసత్యానందము మేల్కని నిద్దురకన్నులతో లేచి తలుపుతీసెను అప్పటి వాని యాకార మెట్లుండెనో చదువరులు తెలిసికొనవలసియున్నది. కడచినరాత్రి చాలసేపువరకును నిద్రలేనట్లు తెల్లవారియున్న వాని నేత్రములే చెప్పుచున్నవి. అప్పు డతఁడు తెల్లని తానుపంచయుఁ, దెల్లనిచొక్కాయియుమాత్రము ధరించియుండెను ఆచొక్కాపై నచ్చటచ్చట రక్తపుమక్కలు గానవచ్చుచుండెను కట్టుకొనినబట్టకుఁగూడనాలుగైదుచోట్ల రక్తచిహ్నములుండెను రామారావుగారును, ఇన్స్పెక్టరుగారును వానినెల్లగనిపెట్టి మెల్లఁగ గదిలోఁ బ్రవేశించిరి తోడనే గోడకొయ్యకుఁ దగిలింపఁబడిన తెల్లనికోటు వారికిఁ గాన్పించినది ఆ కోటంతయు రక్తమయమై చూచుటకు భయంకరముగ వారికిఁదోచెను. ఈసంగతు

లన్నియుఁ గనిపెట్టి రామారావు మొగము వాల్చుకొని యేమాటయు నాడక యూరక తనలో నేమో విచారించుచుండ ఇన్స్పెక్టరుగా రాతనిఁజూచి 'రహస్యములు కనిపెట్టినారా? రామారావుగారూ! ఇంక సందేహింపవలసిన పనిలేదు. ఈతఁడు మీకు మిత్రుఁడు కావచ్చును. కాని యిట్టిసమయమున మీ మిత్రవాత్సల్య మొకమూలఁ ద్రోసి రాజశాసనము ననుసరింపవలసియున్నది. వీనినింకను కొన్ని సంగతు లడుగవలసియున్నవి. వానిని నేనే స్వయముగఁ గనుఁగొనెదను' అని రహస్యముగఁ జెప్పి ఇన్స్పెక్టరుగారు సత్యానందరావుతో నిట్లు మాటాడిరి.

'అయ్యా! నిన్నరాత్రి మీ రెచ్చటికిఁ బోయినారు?'

'చందా తెచ్చుకొనుటకై పోలిశెట్టిగారింటికిఁ బోయినాను'

'అతఁడు మీచందాధనము నిచ్చెనా?'

'లేదు. 12 గంటలవరకు వానికొరకు వేచియుంటిని. అప్పు డతఁ డెచ్చటినుండియో యింటికివచ్చి రేపుదయమున వచ్చినచోఁ జందాధనము నిచ్చెదనని చెప్పి నన్నుఁ బంపివేసెను.'

'మీ రింటికి వచ్చునప్పు డేత్రోవను నడచివచ్చితిరి?'

'రామసాగర మావలియొడ్డుననుండి వచ్చితిని'

'రాజమార్గముండఁగా జనసంచారములేని ఆత్రోవను వచ్చుటకుఁ గారణమేమి?'

'నిజమేకాని, ఆప్రక్కరోడ్డు బాగుచేయించుచుండుటచేత కంకర పై నడచుట కష్టమనియు, నీమార్గముచేరువగా నుండుననియు నట్లువచ్చితిని'

'వచ్చునప్పుడు త్రోవలో మీ కెవరైనఁ గాన్పించినారా?'

'చెరువుగట్టుక్రింద వేంకటేశము కనఁబడినాడు'

'తరువాత?'

'తరువాత తమలపాకుల దుకాణదారుఁడును, మరికొంతసేపునకు

సత్తరు వరుగుమీదఁ బరుండిన యొక నీళ్లగావడి బ్రాహ్మణుఁడును నన్నుఁ బలుకరించినారు'

'పోనిండు. ఈ యూరిలోఁ జకోరాక్షియను భోగముదానిని మీ రెరుగుదురా?"

'ఎఱుఁగుదును?'

'ఎట్లెఱుగుదురు? అదెంత కాలమునుండి మీ ప్రాపకమున నున్నది?'

'అట్టి సంబంధ మేమియు దానికిని నాకును లేదు. రామారావుగారి వివాహమునకు దాని మేళము చెప్పించిరి. అప్పుడు చకోరాక్షిని నేను చూచితిని'

'నిన్నరాత్రి మీరు చకోరాక్షియింటికిఁ బోయినట్లు తెలియుచున్నదే?'

'అది ఎట్టి యబద్ధము. ఈ యనుమానము మీకెందుకుఁగలిగెనదో నాకుఁదెలియదు'

'సరే కాని మీబట్టలనిండ రక్తముండుట కేమికారణము? మీరు రాత్రి దొడిగికొని కోయ్యకుఁ దగిలించుకొనినకోటు నొకసారి చూచుకొనుఁడు'

సత్యానందరావు తన బట్టలనిండ రక్తముండుటఁజూచి నిర్ఘాంతపడి ఏమియును మాటాడలేక కొంతసేపువరకుఁ జిత్రప్రతిమవలె నట్టులే యుండిపోయెను అది కనిపెట్టి ఇన్స్పెక్టరుగారు

'అయ్యా! భయమువలదు. నిజముచెప్పినచో మీ కెట్టిహానియును రాదు. మీరు మా రామారావుగారికి మిత్రులగుటచేతను, విద్యార్థులగుటచేతను ఇన్ని ప్రశ్నలడిగినానుకాని, మరియొకరైనచో మారు మాటాడకుండ వెంటనే తీసికొనిపోయి 'లాకప్' లోఁ గూర్చుండఁబెట్టియుందును. కావున నిజముచెప్పుఁడు.'

'అయ్యా! పంచభూతములుసాక్షిగ—'

'అబ్బా! ప్రమాణము లెందుకండీ? పోలీసువారియొద్ద ప్రమాణములు పనికివచ్చునా?'

'నాబట్టల కీరక్త మెట్లువచ్చినదో నాకుఁ దెలియదు. నన్ను మీరేమి చేసినను చేయవచ్చును'

'సరే! అట్లయిన మీతో మాటాడవలసిన పని నాకులేదు. రామారావు గారూ! మీరు చెప్పవలసిన దింకేమైన నున్నదా?'

'లేకేమి? కావలసినన్ని సంగతు లున్నవి. ప్రస్తుతము మీరీతనిని ఎరస్టులో నుంచవచ్చును. కాని ఖూనీచేసినవాఁడు మాత్రము సత్యానందరావు కాఁడు'

'కాక మఱెవరు?'

'తొందరయేలఁ గకు బయలుపడక మానునా?'

'అన్నా! మీమిత్రవాత్సల్య మింకను విడువకున్నారుకదా!?'

అని పలికి ఇన్స్పెక్టరుగారు వెంటనే సత్యానందరావుని స్టేషనులోనికిఁ దీసికొనిపోయిరి. తనకిట్టి యకారణమైనయపనిందఁ గల్గెనని సత్యానందరావు మితిలేని దుఃఖమునొందుచుండెను వాని దీనావస్థఁ జూచి మాధవరావును, రామారావును పొందినవిచార మింతయని వర్ణింపలేము.

---

# ప్రకరణము—3.

## సీత—లక్ష్మణ.

'సీతా! నీవన్నమాట నిజము. న్యాయాన్యాయములను విచారించుటకు దైవమొకఁడున్నాఁడు కదా? మనము దుఃఖించినందువలన నేమిలాభమున్నది?'

'లక్ష్మణా! వానికింతటి యుపద్రవము సంభవించునని నేను కలనైన నెఱుంగను సుమా? అట్టి నిష్కల్మషచిత్తునకు, సద్గుణరాశికీకష్టము రాదగినది కాదు.'

'నిజము నిజము. ఎప్పుడును మంచివారికే యాపదలువచ్చుచుండును అయినను ధర్మమున కెన్నఁడు నపజయము ముండదుకదా? సత్యానందరావునకు సర్వేశ్వరుఁడు శుభముఁ గల్గింపకపోఁడను ధైర్యము నాకున్నది.'

'లక్ష్మణా! నీవు నమ్మవుగాని నిన్నటినుండియు నాహృదయేశ్వరునకు నిద్రాహారములులేవు. నాచాతుర్యమంతయుఁ జూపి యెట్లైన సత్యానందమును విడిపించితిరెదనని ఆయన కంకణముఁ గట్టుకొనియున్నారు'

'సీతా! ఇంకఁ గావలసిన దేమున్నది? రామారావన్నయ్యగారికి మూఁడులోకములలో నసాధ్యమైన కార్యములేదని నానమ్మకము. అన్నయ్యగారు కొంచెము శ్రద్ధవహించినచో వానికేమియు నాపదరాదు'

'ఇంతకును మఱియొకమాటవిను. ఎవరో దుర్మార్గులీపన్నుగడఁబన్నిరి; కాని పాపము సత్యానంద మంతటిదారుణకృత్య మొనర్చెనన్న ఎవరు నమ్మెదరు? వానిని పోలీసుస్టేషనునకుఁ దీసికొనిపోవుచున్నప్పుడు చూచిన వారిలోఁ గంటఁ దడిపెట్టనివారు లేరట'

'చిన్నప్పటినుండియు నతఁడు మన యెదుటనే పెరుగుచున్నందునఁ

పాప మతఁడు మనలనే నమ్ముకొనియున్నాఁడు. సీతా! ఈవిషయమై నీవు నీ మగనితో నొక్కి చెప్పవలయునుసుమా!'

'సరే! ఆమాట నీవు నాకుఁ జెప్పవలయునా? దీనికేమిగాని-లక్ష్మణా! నేనొకమాటడిగెదను కోపగింపవుకద?'

'కోపమెందుకు? అడుగు. నాకుదెలిసినసంగతి తప్పక చెప్పెదను'

'సత్యానందరావుపై నీ యపనింద మోపినవారిలో మొదటివాఁడు నీకుఁ గాఁబోవు మగఁడగు వేంకటేశమట. నిజమేనా?'

'సీతా! నాదురదృష్టమిట్లుండుటచేత నేఁడు మీయందఱిచేనిట్లు అడిగించుకొనవలసివచ్చినది? వదినా! నీకొకరహస్యము జెప్పుచున్నాను విను. పెండ్లిచేసికొనవలయునని నాకు లేశమైన నభిలాషలేదు. కాని నాతల్లిదండ్రులు నట్టి—'

'వేంకటేశమును బెండ్లియాడుట ఇష్టములేదా? లేకసంసారమే—'

'అబ్బా! ఎందు కీసంగతులు? సీతా నామనసు కలతపెట్టకుము. ఈసంగతి నాకెందుకు జ్ఞాపకముఁదెచ్చితివి? ఇంటిలోనున్నంతసేపు మాతల్లి ఈవిషయమే ప్రసంగించుచుండుటచేత నేనామాటలు వినలేక నీతో వినోదముగఁ గాలముఁ గడుపవలయునని యిచ్చటికి వచ్చినాను. నీవుకూడ నాసంగతియే తలపెట్టిన నే నెచ్చటికిఁ బోఁగలను?'

'లక్ష్మణా! నిశ్చయముగ నీయవస్థ విచారింపఁదగినదే! వేంకటేశము వట్టి మూర్ఖుఁడు. అట్టివానికిచ్చి నిన్నుఁబెండ్లిసేయుట నీ దురదృష్టముకాని వేరేమున్నది?

ఆమాటలకు లక్ష్మణ కన్నీరుఁగార్చుచు,

'వదినా! మాతండ్రిగారీసంబంధము నిశ్చయముచేసినారు. తప్పించుట కెన్నివిధములఁ బ్రయత్నించినను నాకు శక్యముకాలేదు. ఇంక నేను నూయియో గోయియో చూచుకొనవలయును.'

‘లక్షణా! మాధవరావుపై నీ కనురాగ మున్నదను సంగతినే నెఱుఁగుదును. ఈసంబంధముఁ దప్పించి నిన్ను మాధవరావునకిచ్చి వివాహముఁ జేయుఁడని మీయన్నగారు భీమశంకరముగారితో నెంతో దూరము చెప్పినారట. కాని మేనరికముఁ దప్పవనియు, వేంకటేశము పండ్రెండువందలు కన్యాశుల్కము నిచ్చుననియుఁ జెప్పి మీతండ్రి గట్టిపంతముఁ బట్టియున్నాఁడట’

‘సీతా! నీవు నన్ను బరిహాసమాడకుము. నా మొఱలు వినుటకు నీవుతప్ప నింకెవ్వరును లేరు అందుచేతనే నాయుద్దేశమును నీయెదుటమాత్రము వెల్లడించుచున్నాను చిన్నప్పటినుండియు నొక్కచోటనె కలిసి మెలిసియుండుటచేతనో, వాని విద్యామహిమచేతనో నాహృదయము మాధవరావు నాకర్షించినది కాని నాగ్రహచార మెట్లున్నదో చూచితివా? నాజీవనమంతయు దుఃఖభాజన మొనర్పవలయునని నాతల్లిదండ్రులు దీక్షవహించియున్నారు. వదినా! ఈగండము దాటుటకు నీవేదైన నాధారముఁ జూపలేవా? నీవుగూడ నేను శత్రురాలనైనచో దుర్భరమైన యీ గృహక్లేశప్రాణమును విడిచి మీయందఱికిని సంతోషముఁ గల్గించెదను, కాని నే నాయమూర్ఖునిఁ బెండ్లాడి యిహలోకసౌఖ్యముల ననుభవింపఁజాలను.’

‘లక్షణా! నన్నేమిచేయుమనెదవు? మీతల్లి చదువులేనిమూర్ఖురాలు. మీతండ్రి చదువుకొనినమూర్ఖుఁడు. ఎందఱెన్ని విధములఁ బోధించినను వారిచెవి కెక్కకున్నవి పాపము మాధవరావు నీపైని—’

‘అబ్బా! వదినా! ఆ మహాత్ముని పేరు నాయెదుట నుగ్గడించి, నామనసును మరింత కలతపెట్టకుము. అట్టి గుణరూపవిద్యావంతునకు నేను చరణదాసినగుటకైనఁ దగను. అందుచేతనే భగవంతుఁడు మాసంధానమున కిట్టి యవరోధమును గల్గించెను మాధవరావునకు నాపైనిఁగల యనురాగమును నీవు చెప్పనక్కఱలేదు కాని యీ నిర్భాగ్యురాలికొఱకు గంపెడాశతో నున్న

యతఁడు మాతండ్రి తలంపు విన్నచో నెంత దుఃఖించునోయని మాత్రము విచారించుచున్నాను '

అని యొకనాఁ డుదయమునఁ దొమ్మిదిగంటలకు సీతయు లక్ష్మణయు సీత మందిరమునఁ జావడిలోఁ గూర్చుండి సంభాషించుచుండిరి. మీది సంభాషణవలన నీ యిరువురు నెవరో మా చదువరులకుఁ దెలిసియుండవచ్చును. సీత రామారావు గారిభార్య. లక్ష్మణ యామెకనుంగు చెలికత్తె. బాల్యమునుండియు నీ యిరువురును గవర్నమెంటు బాలికాపాఠశాలయందు కలసి చదువుకొనుచుండిరి. ప్రతితరగతియందును నీ యిరువురును తోటిబాలికలందరికన్న నెక్కుడు తెలివితేటలతోఁ బ్రకాశించుచు, సంగీతమునందును, సాహిత్యమునందును, కుట్టుపనులందును, పరీక్షాధికారుల వలన నెన్నియో బంగారు పతకములు బహుమానము లొందిరి. ఆంగ్ల భాష చక్కఁగ వ్రాయుటయందును చదువుటయందును వారిరువురును కడు జాణలగుటయే కాక, భారత భాగవతాది గ్రంథములు గూడఁ జదివి నిరర్గళముగ నొకరికి బోధింపఁగల నేర్పరులు. ఇరువురునుగలసి మూడవఫారము వరకుఁ జదువుకొని రనుమాటయే కాని, యాంగ్లేయ భాషలోఁ దరగతికిమించిన జ్ఞానముకలవారని చెప్పవచ్చును. వయసునందు లక్ష్మణకన్న సీత మూఁడేండ్లు పెద్దది లక్ష్మణ కిప్పుడు పండ్రెండవయేఁడు నడచుచున్నది. వారిరువురును మూఁడవఫారము ప్యాసయిన తరువాత నా పాఠశాలయందంతకన్న నెక్కుడు తరగతులు లేనందున సీతయు లక్ష్మణయుఁ జదువు చాలింపవలసివచ్చెను. స్త్రీల కున్నతవిద్య చెన్నపట్టణములలోఁ దక్క సాధారణముగ మఱెక్కడను లేదుకదా? గవర్నమెంటువారు ప్రతిపట్టణమునందు నట్టి యేర్పాటుచేసియుండిన యెడలఁ బాపము మన సీతా లక్ష్మణ లింకను తమవిద్య నభివృద్ధిఁ జేసికొనియుందురు. అయినను వారంతలోఁ దమ చదువుఁ జాలింపలేదు. ప్రతిదినమును లక్ష్మణ సీత యింటికిఁ బోయి యచ్చట నామెతోఁ గలసి చదువుకొనుచుండెను. అట్లు వారెన్నియో గ్రంథములు మనయాంధ్రమునఁ బరిశీలించిరి. సీతకు వివాహమై

కాపురమునకు వచ్చిన తరువాత నాబాలికలస్నేహము మరింత యధికమైనదని చెప్పవచ్చును. లక్షణయింటికిఁ బ్రక్కనే సీత యత్తవారిల్లుకలదు. అందుచే లక్షణసాధారణముగ నెప్పుడును సీత యింటిలోనే యుండుచుండెను.

సీతారాములవలె సీతయు రామారావును ఒండొరులపై నమితమైన యనురాగము వహించి, 'ఈ దంపతు లెంతటి పుణ్యశాలురో' యని తమ్ము నెల్లరు మెచ్చునట్లు ప్రవర్తించుచుండిరి. రామారావుగా రప్పుడప్పుడు సీతను లక్షణను గూర్చుండఁబెట్టి వారిరువురిచే నింగ్లీషుపుస్తకములు చదివించుచుండిరి క్రమక్రమముగ రామారావుగారి సహాయ్యమువలన వారిరువురును ఇంగ్లీషుతో స్పష్టముగ మాటాడుటయుఁ జదువుటయు వ్రాయుటయుజక్కఁగ నేర్చిరి ఆదంపతుల పరస్పరానురాగమును జూచి పాపము మనలక్షణ మూర్ఖులగు తన తలిదండ్రులవలన నట్టి భాగ్యము తనకీ జన్మమునలేదుకదా యని యప్పుడప్పుడు తనలోఁ దానె దుఃఖించుచుండును. తనతండ్రి వెంకటేశము నొక ద్విపాదపశువుమెడకుఁ దన్నుఁగట్ట నిశ్చయించినందున నానాటికి మన లక్షణకువివాహవాంఛ తగ్గి సంసారముపై వైరాగ్యభావ మంకురింప నారంభించెను.

ఆనాడట్లు సీతయు లక్షణయుఁ దమలోఁ దాముసంభాషించుచుండఁగాఁ గొంతసేపున కెవరో వీథితలుపులు త్రోసి వచ్చుచున్నట్లు చెప్పుల చప్పుడు వినఁబడినందున లక్షణ ముందుకుఁబోయి చూచి 'రామారా వన్నయ్యగారువచ్చినారు. మన సంభాషణ మింకఁ జాలింతము' అని మెల్లఁగఁ బలికెను. ఇంతలో రామారావుగారు చావడిలోనికి రాఁగానే సీతలేచి నిలువఁబడి భర్తయిచ్చిన పాగాయును కోటును అందుకొని బట్టల కొయ్యకుఁ దగిలించెను. ఆయాసమంతయు వెలిపుచ్చుచు రామారావుగా రచ్చటనున్న కుర్చీపైఁగూర్చుండి లక్షణనుజూచి 'అమ్మాయీ! నీ భోజనమైనదా' యని యడి

గెను. తన భోజన మిప్పుడే యైనదని లక్ష్మణ బదులుచెప్పి వానితో నిట్లు సంభాషించెను.

'అన్నయ్యగారూ! సత్యానందముసంగతి యేమైనది?'

'లక్ష్మణా! ఇప్పటి కేమియును గాలేదు. ఏమి గ్రహచారమోకాని యొకనాటికన్న నొకనాడు వాని నేరము స్థిరమగుచున్నది. నాశక్తివంచన లేక వాని విషయమై పాటుబడుచున్నాను.'

'అట్లు లనెదరేమి? మరలఁ గ్రొత్తసంగతు లేమైనఁదెలిసినవాయేమి?'

'నిన్నటి విచారణలో మఱికొన్నిసంగతులు తెలిసినవి. తనరెండవ కూతుని సత్యానందము వరించినాడనియు, అందుకుఁ దన పెద్దకూతు నిర్బంధముఁ గల్గించుచుండుటచేత నామెను సత్యానందము బలవంతముగఁ జంపెననియుఁ జకోరాక్షి తల్లి చెప్పుచున్నది.'

'అన్నయ్యగారూ! విచారణలో సత్యానందమేమిచెప్పుచున్నాఁడు?'

'సరియైన ప్రత్యుత్తర మేమియు నీయఁడు. అదియే పెద్దకష్టముగ నున్నది. ఏసంగతియడిగినను నాకేమియుఁదెలియదు. నన్నేమియు నడుగవలదు. మీయిష్టమువచ్చినట్లు చేయవచ్చును' అని ప్రత్యుత్తర మిచ్చుచుండును. చకోరాక్షి. చెల్లెలిపైఁ దనకు మనసున్నట్లు కోర్టువారియెదుట నొప్పుకొనెను. అందుచే కేసు మఱింతబలమైనది.'

'ఔను. నిజమైనసంగతి యెట్లు కాదనఁగలఁడు? చకోరాక్షిచెల్లెలైన తిలోత్తమకూడ సత్యానందముపైఁ జాలకాలమునుండి మనసుకలిగియున్నది. తన కులవృత్తివిడిచి ఆమె సత్యానందమును పెండ్లిచేసుకొనెదనని యప్పుడప్పుడు నాతోఁ జెప్పుచుండెను.'

'లక్ష్మణా! పూర్వమువలెఁ దిలోత్తమ మనయింటికి రావడము మానివేసినదేమి? నీకును, సీతకును, ఆమెసహాధ్యాయినిగదా?'

'నిజమే కాని, ఆమె సత్యానందమును వరించిన దనుసంగతి కనిపెట్టి

చకోరాక్షియు, దాని తల్లియుఁ దిలోత్తమను మనయింటికి రాకుండఁ జేసిరి.

'లక్ష్మణా! నీవు చెప్పినసంగతి నిజమేకదా.'

'అబద్ధమాడుటకు నాకేమి యవసరము?'

'అట్లులైనచోఁ దిలోత్తమ తనప్రియుని చెరలోనుండి విడిపించుటయందు నాకుఁ గొంచెము సాహాయ్యముఁ జేయఁగలదేమో?''

'తప్పక చేయును. నేను చేయించెదను. సత్యానందమన్న నామెకుఁ బ్రాణము. తిలోత్తమ మనయింటికి వచ్చినప్పుడు సత్యానందముతో రహస్యముగ మాటాడుచుండుట నే ననేకమారులు చూచితిని. నేనే కాదు. మీసీతయుఁ గనిపెట్టినది. ఇంత వివాదమేల? తనకు సత్యానందముపైఁ బూర్ణమైన యనురాగ మున్నదని తిలోత్తమయే పెక్కుమారులు మాతోఁ జెప్పుచుండెను.'

'వాహ్వా! లక్ష్మణా! ముఖ్యములగు రహస్యములు నాకెఱింగించి మహోపకార మొనర్చితివి. ఇంతవఱకును సత్యానందమును విడిపింపఁగలనో లేనోయని నాకు సందేహ ముండుచుండెను గాని యిప్పుడు ధైర్యముగలిగినది. సత్యానందము బంధవిముక్తుఁడైనచో నిదంతయు నీవిశేషమే సుమా?'

'అన్నయ్యగారూ! మీరు నన్నిట్లు శ్లాఘింపవలదు. వయసున మీకన్నఁ జాల చిన్నదానను. అందులో నాడుదానను. అయినను మతియొక యుపాయముఁ జెప్పెదను క్షమించెదరా?'

'అమ్మాయీ! క్షమింపవలయునా? అతిసంతోషమున నీ యుపాయమంగీకరించెదను'

'సరే! తిలోత్తమవలన మీ రేమిసాహాయ్యముఁగోరెదరో మొదట జెప్పుఁడు'

'కోర్టులో మనపక్షమున సాక్ష్యముఁ జెప్పినఁ జాలును'

'అదియే కాదు. అంతకన్న నెక్కుడుసాహాయ్యముఁ జేయఁగలదు. చకోరాక్షికి విటులు వ్రాసిన యుత్తరములన్నియుఁ దెప్పించి మీ కిచ్చెదను. వానిని మీరు పరిశీలించి—'

'లక్ష్మణా ! నీయుపాయ మద్వితీయమైనదే కాని ఆయుత్తరములన్నియుఁ జకోరాక్షి యుంచినదో పారవేసినదో యని సంశయించుచున్నాను'

'ఆ సంశయము మీకక్కఱలేదు. తిలోత్తమ మనయింటికిఁ జదువుకొనుటకు వచ్చుచుండినదినములలో నొకనాఁడు వేశ్యావృత్తి కూడదని యొక యుపన్యాసము వ్రాసి మాయొదుటఁ జదివినది. అప్పుడు ప్రసంగవశమునఁ దనయక్క విటులు వ్రాసినయుత్తరము లన్నియు భద్రముగ దాచియుంచినదని తిలోత్తమ మాతోఁజెప్పినది. నేను తిలోత్తమకుఁ గబురంపి ఆయుత్తరములు తెప్పించి మీకిచ్చెదను. అందువలనఁగొన్నిరహస్యములు మనకుఁ దెలియఁగలవు.'

'అబ్బా! తిలోత్తమ యంతటి యుత్తమకన్యయని నేనెఱుఁగను సుమా! దీని కేమిగాని లక్ష్మణా! నీ సాహాయ్యమువలన సత్యానందము తప్పక జయమొందగలఁ డని నేను చెప్పఁగలను. నీకు నేనేమి ప్రత్యుపకారమొనర్పఁగలనో తెలియకున్నది'

'అన్నయ్యగారూ! క్షమింపుఁడు. నాకేమి యుపకారముకావలయునో ఆయుపకారము భగవంతుఁడే చేయఁజాలకపోయెను. ఇంక మానవమాత్రులకది సాధ్యమగునా?'

'అమ్మాయీ! విచారింపకు. నీయుద్దేశము నేను గ్రహించితిని. ఇదివరకనేకపర్యాయములు మీ తండ్రితోఁ జెప్పినాను; కాని యతఁ డీసంబంధమును దప్పింపనని కంకణముఁ గట్టుకొనినాఁడట. ఇంతతో విడువక యింకను బ్రయత్నించిచూచెదను. అతఁడు నామాట వినకున్నచో నేవిధముగానైన వాని నల్లరులలోనికి దింపి యీవివాహమునకు భంగముఁ గల్గించెదను. లక్ష్మణా! చెప్ప మరచితిని! ఏకారణముననో కాని వేంకటేశము ఈకేసులో సత్యానందమునకు విరోధముగఁ జాలపటుకుఁ బనిసేయుచున్నాఁడుసుమీ!'

అని పలుక లక్ష్మణ యేమియును మారాడక మొగమువంచుకొని యూరకుండెను. తరువాత రామారావుగారు సంభాషణమును జాలించి 'సీతా!

స్నానమునకుఁ బోవుదముపద. వంట లైనదా?' అని భార్య నడిగిరి. రామారావుగారు నూతనమతావలంబకులును, సంఘసంస్కర్తలును, ఆంగ్లేయభాషాపరిచితులు నగుటచేత భార్యను మొదటినుండియుఁ బేరుపెట్టి పిలుచుటయే వాడుక. అందుచే భార్యపేరుచెప్పునని భర్తను, భర్తపేరు చెప్పునని భార్యను బంధువులు పరిహాస మాడుట కా దంపతులయెడ వీలులేకపోయినది.

భర్తను స్నానమునకు లెమ్మనిచెప్పి సీత వంటయింటిలోనికిఁ బోయెను. రామారావుగారు కుర్చీపైనుండి లేచి 'లక్షణా! నీవుకూడ భోజనమునకు రమ్ము. అదిగో మీవదినపట్టుచీర దండెముపైనున్నది. లేలే!' అని బలవంతపెట్టిరి కాని లక్షణ తానప్పుడే భోజన మొనర్చుటచేత నాకలి లేదనిచెప్పి యచ్చట మేజాబల్లపైనున్న భాగవతమును దీసి యాచావడిలో నొంటరిగఁ జదువుకొనుచుఁ గూర్చుండెను. వెంటనే రామారావుగారు వీధితలుపులు గడియవేసి పెరటిలోనికిఁ బోయిరి.



# ప్రకరణము—4.

—

## ప్రమాణము.

గీ. భూతపతి చిత్తసంభూతు ♦ భూతిఁ జేసి
మించి రతిగళసూత్రముఁ ♦ ద్రుంచెఁ గాని
చిర పరస్పర ప్రేమైక ♦ చిత్తులైన
ప్రియుల యనురాగబంధమ్ముఁ ♦ ద్రెంపఁ గలఁడె?

లక్ష్మణ చెప్పిన యభిప్రాయములకు రామారావుగా రమందానందము వహించి లోలోన నామె నెంతయో కొనియాడిరి. లక్ష్మణ చావడిలో నొంటరిగఁ గూర్చుండి భాగవతమును విప్పి చూచుచుండెను. కాని యప్పు డామె మనసు పుస్తకమునందు లేదు. తనతండ్రి నిశ్చయించిన వివాహసంబంధ మెట్టులైనఁ దప్పించి తనకు మేలొనర్చెదనని రామారావుగారు పలికినపలుకులు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు లక్ష్మణ తనలో దీర్ఘాలోచన మొనర్చుచుండెను. ఎంతదూర మాలోచించినను ఆమె మనసునకు ధైర్యము కలుగలేదు. తన తండ్రి పెద్ద త్వాష్ట్రిమువంటివాఁడు. అతనిమనసుఁ ద్రిప్పఁగలుగుట లోకము తల్లక్రిందుచేయుటయే యని లక్ష్మణ యభిప్రాయము. ఈవిచారముచేత నిద్రాహారములు సరిగాలేక యామె నిరంతరమును బెంగఁగొని శుష్కించుచుండెను

'ఆహా! సర్వేశ్వరుఁడు నన్నింతకాలమును బెంచి పెద్దదానినిఁజేసి తుద కొక మహాసముద్రములోఁ బడవేయ నెంచెనుకదా? కడకు నా యౌవనమును విద్యయు నొకమూర్ఖునకు ధారవోసి దుఃఖభాజనమైన సంసారమును గడపవలసివచ్చినది ఛీ! కుమార్తెల కష్టసుఖము లరయని తల్లిదండ్రులు? అబ్బా! ఇన్నిమాటలెందుకు? నాకింకే సౌఖ్యములు నక్కఱలేదు. నేను బ్రహ్మ

చర్యావ్రత మవలంబించి నా జీవితమంతయుఁ బరోపకారమున వెచ్చించె దను.'

అని లక్షణ తనలో మాటిమాటికి ననుకొనుచుఁ దనలోఁ బలువిధముల వితర్కింపఁజొచ్చెను. ఇంతలో నెవరో వీధితలుపు తట్టినట్లు లాకస్మికముగఁ దనకు వినఁబడినందున లక్షణ స్వగత విచారమును చాలించివెంటనే లేచి యావచ్చినవారెవరో యని వీధిగుమ్మమునద్దకేగి తలుపులు తెఱచెను. తోడనే యామెకంటికి కెవరుకాన్పించిరోకాని లక్షణ చిఱునవ్వునవ్వి తటాలున దనముద్దుమొగమును క్రిందికి వంచుకొనెను. అందుచే నా వచ్చినవాఁడు మాధవరావని చదువరులు పోల్చుకొనియుందురు. మాధవరావు గుమ్మము దాటి లోనికివచ్చి చిఱునవ్వునవ్వుచు 'లక్షణా! రామారా వేమిచేయుచున్నాఁ' డని యడిగెను. భోజనముఁ జేయుచున్నారని లక్షణ బదులుచెప్పి చేరువనున్న గోడకు జారగిలి మొగము వంచుకొని బొటకెనవ్రేలితో నేలపై వ్రాయుచు నిలిచియుండెను. మాధవరా వా మెకు సమీపముననఁగలకుర్చీమీదఁ గూర్చుండి లక్షణతో నిట్లు సంభాషింపఁ దొడఁగెను.

'లక్షణా! రామారావు భోజనమునకువెళ్లి యెంతసేపైనది?'

'ఇప్పుడే స్నానమునకు వెళ్లినారు. ఇంకను భోజనము నారంభించి యుండరు.'

'సరే! ఇచ్చటఁ గూర్చుండి నీ వేమిచేయుచున్నావు?'

'ఏమియును లేదు. భాగవతము (చదువుకొనుచున్నాను.)'

'ఎందుచేతనోకాని నీమొగము నేఁడు సంతోషకరముగా లేదు. కారణమేమో నేను వినవచ్చునా?'

'సంతోషముకాక నాకేమి విచారమున్నది? ప్రాపంచిక సౌఖ్యముల నభిలషించువారికిఁగదా విచారసంతోషములు? వానితో సంబంధములేనివారు నిత్యమును బ్రహ్మానంద భరితులే!'

'లక్ష్మణా! నీకు వేదాంతములోఁగూడఁ బ్రవేశ మున్నదని నే నిది వరకెఱుఁగనుసుమా! దీని కేమిగాని నీ కింత వైరాగ్యము కుదురుట కేమికారణము?'

'భగవంతుఁడే కారణము. నా పూర్వజన్మకర్మఫలమే కారణము. నా కిహలోక సౌఖ్యములపై నంత వాంఛలేదు.'

'ఔను. అంత వాంఛ లేదనఁగాఁ గొంత వాంఛ యున్నదనుమాట కదా? నీ కింక వివాహమైనఁ గాలేదే అప్పుడే వైరాగ్యమా?'

'దుఃఖకరమైన బ్రతుకుకన్న బ్రహ్మచర్యవ్రతమే సుఖదాయకమని నా యుద్దేశము.''

'లక్ష్మణా! నీమాటలు నా కర్థము కాలేదు. నీ బ్రతుకేవిధమున దుఃఖకరము? నీతండ్రి భీమశంకరము గొప్ప యుద్యోగములో నున్నందున నీ కన్న వస్త్రములకు లోపము లేదుకదా? అందుకుఁ దోడు నీవు విద్యావతివి. ఏవిధముగ నాలోచించినను, నీ కేలోపమును నాకుఁ గానరాలేదు. నీవు బ్రహ్మచారిణివై వివాహమాడుట మానివేసెదవా యేమి?'

'మీరు నిజము గ్రహించినవారు ఎట్లులైననే నీవివాహమును దప్పించుకొనుటకై వైరాగ్య మవలంబించినాను '

లక్ష్మణా! ఇచ్చట నెవ్వరునులేరు. నీవు మొగమోటమును విడిచి స్పష్టముగ మాటాడుము. నీకు వివాహమునం దింత విరక్తి పుట్టుటకుఁ గారణము నాకింకను తెలియదు. నీవు సన్యాసినివైనచో నిన్నుఁ బెండ్లాడవలయునని నాటనుండియు నూరక యువ్విళ్లూరుచున్నవాని కేమి ప్రత్యుత్తరమిచ్చెదవు?'

'ఏమి ప్రత్యుత్తర మిచ్చెదనా? ఈ నిర్భాగ్యురాలిపైఁ గల యనురాగబంధనమును బలవంతముగనైనఁ ద్రెంపుకొని నన్నుఁ క్షమింపుఁడని వినయపూర్వకముగఁ బ్రార్థించెదను.'

'వెఱ్ఱిదానా! నీవు ప్రార్థించినంతమాత్రమున నాయనురాగబంధనము తెగునదికాదు. నీవు సన్యసించినచో నీతోఁగూడ సన్యసింపవలసినదే!'

'ఆర్యా! కన్నియలకు వివాహవిషయముల స్వాతంత్ర్య మీయకున్నచో నిట్టి కష్టములే వచ్చుచుండును. నే నేమిచేయఁగలను? నన్నొక మూర్ఖునకుఁ గట్టివెట్టి నాతలిదండ్రులు తెగనికత్తిని నాగొంతుకఁ దెగఁగోయ సిద్ధముగనున్నారు. ఈసంగతి మీరు వినియే యుందురని తలంచెదను.'

'లక్షణా! నీచేఁ జెప్పింపవలయునని యింతవరకు నిట్లుమాటాడితిని; గాని నీసంగతి నాకు తెలియకకాదు. నిన్ను వెంకటేశమునకిచ్చుటకు నిశ్చయమైనదని నేనిదివరకే యెఱుంగుదును.'

'ధనాశచేత నాతండ్రి యింతయీడు వచ్చినదాక నాకు వివాహము జేయలేదు. జ్ఞానము రాకమున్న, బాల్యముననే నాకుఁ బెండ్లిచేసియుండినచో నా కీదుఃఖములేక యుండును.'

'లక్షణా! అదిమాత్రమేమిసౌఖ్యము? ఇప్పుడు వివాహ పూర్వమున దుఃఖించుచుంటివి. అప్పుడు వివాహానంతరమున దుఃఖించెదవు? ఎట్టులైనను సౌఖ్యము సున్నయే కదా? బుర్రపగలఁగొట్టుకొనుటకు కెరాయియైననేమి?'

'అన్నివిధములచేత నా హృదయము కల్లోలమగుచున్నందున నొక్కొక్కప్పుడు ప్రాణములకుఁ దెగించి, బలవన్మరణమునకు సిద్ధపడుచుండును. కాని సర్వేశ్వరున కించుకైన జాలి జనించునేమో యని యాశపడి మరల-'

'వద్దు వద్దు. లక్షణా! నీవెప్పుడు నట్టి సాహసకృత్యమునకుఁ గడఁగకుము. ఈ దుఃఖము మన కిరువురకును సమానమే. గ్రహచారవశమువలన నట్టి దుస్థితి తటస్థించినయెడల మన మిరువురమును గలసియే యీ లోకమును విడిచిపోవుదము.'

'సర్వేశ్వరుఁడు మీకట్టి కష్ట మెన్నఁడును గల్గింపకుండుఁ గాక! లోకమంతయు నాయొక్కతెతోడనే లేదు. నేను గాకున్నను, నా తలఁపుమించిన కన్యలెందరో మీకు లభించెదరు.'

'ఈ వేసంగి సెలవులలో నేను చెన్నపట్టణమునుండి వచ్చెదనని యెఱిఁగి మాతండ్రిగారీదినములలో నాకొక సంబంధము నిశ్చయముఁ జేసి

నారు. కాని నేను బి. ఏ. పరీక్షప్యాసయినపాక వివాహముఁ జేసికొననని మిషవెట్టి తప్పించుకొంటిని. నాతండ్రి విద్యాధికుం డగుటచేతఁ గష్టసుఖము లాలోచించి నే నెట్లు చెప్పిన నట్లులే యంగీకరించును.'

'వివాహవిషయములో మీయుద్దేశము మీతండ్రిగారెఱుంగుదురా?'

'ఎఱుంగుదురు. మొన్న నే తెలిసినది. మనమిరువురమును వియ్యంకుల మగుదమని మాతండ్రి మీతండ్రికొక యుత్తరముగూడఁ వ్రాసెను; కాని యాతఁడు ప్రత్యుత్తరమే యీయలేదట.'

'ఔను. ఆయుత్తరము మాతండ్రిగారు చదువుచుండఁగా నేనుఁ గూడఁ జూచినాను. ఆ యుత్తరమునుజూచి కోపమునిగిపోయినట్టు లాయన యెంతయో విసుగుకొనినారు. అప్పుడు మూర్ఖజనచిత్తమును గూర్చి భర్తృహరిచెప్పిన యీపద్యము నాకు జ్ఞప్తికివచ్చినది '

'చ. మకర ముఖాంతరస్థ మగు ♦ మానికముఁ బెకలింపవచ్చుఁ, బా
యక చలదూర్మికానికర ♦ మైన మహోదధి దాటవచ్చు, మ
స్తకమునఁ బూవుదండవలె ♦ సర్పము నైన భరింపవచ్చు, మ
చ్చికఘటియింప మూర్ఖజన ♦ చిత్తముఁ దేల్ప నసాధ్య మేరికిన్.'

'లక్షణా! దీని కేమిగాని ముఖ్యమైనసంగతి నిన్నడుగఁ దలఁచి మఱచిపోయినాను నీవు నా కొక్కవరము నొసంగవలయును.'

'అది వరముకాదు. మీయాజ్ఞకు నేను బద్ధురాల నయ్యెదను. అదే దియో సెలవిండు '

'చెప్పెదనుగాని నామాట వృథాచేయఁగూడదుసుమా!'

'దైవాజ్ఞ నతిక్రమింపఁగలనా?'

'అట్లయినవినుమ. నేను కొలఁదిదినములలో నే చెన్నపట్టణమునకు మరలఁ బోవుచున్నాను. సెలవులు కావచ్చినవి. నీవని నట్లుమీతండ్రి మూర్ఖచిత్తుఁడు గావుననిన్ను వేంకటేశమునకు వివాహమొనర్పక తీరఁడు. అట్టిసమయమందు దుఃఖాతిశయమున నీవాత్మహత్యఁజేసికొన కుందునట్లు నాయెడఁ బ్రమాణముఁజేయవలెను.

అని మాధవరావనుగ. లక్షణ కన్నీరుగార్చుచు మోము వంచుకొని వానికేమియుఁ బ్రత్యుత్తరమీయక నిలచియుండెను. అప్పుడు మాధవరావా మెనుమరలజూచి 'లక్షణా! కన్నీరుగార్చుట ధైర్యవంతులకు లక్షణముగాదు. నీవుచదువుకొనిన చదువంతయు నాపత్సమయముల యందే వినియోగింప వలయును. కావున నీవన్నమాటఁదప్పకుండ నాచేతిలోఁజెయివైచి ప్రమాణముఁ జేయుము' అనిమాధవరావు కుర్చీపై నుండిలేచి ఆమెచేయిఁబట్టుకొని బలవంతమున నామెచేఁ బ్రమాణముజేయించెను. కొంతసేపునకు రామారావును సీతయుఁగూడ భోజనముఁజేసి యచ్చటికివచ్చిరి. వారందరును జాలసేపు వరకు నీవిషయమునుగూర్చియే యచ్చటఁదమలో సంభాషించుకొనిరి.

---

# ప్రకరణము—౮.

---

## తిలోత్తమ.

"ఉ. నీతిహానికిన్, సుంతయును ♦ నిక్కము మంచునకైనతే, దహ
ఖ్యాతికిరాజధాని, కుల♦గౌరవమాపొరిగూరికంట,! ఛీ!
జాతులలోన నీచమగు ♦ జాతి యిదేకద వేశ్యజాతి? యీ
బూతులజాతిలోన ననుఁ ♦ బుట్టఁగఁ జేసితివే జనార్దనా!

ఉ. వారక తల్లియున్ గులము ♦ బాధలు నన్గులవృత్తిఁ బూనుమం
చూరక బాధపెట్ట, నెటు♦లో సహియించితి నిన్ని నాళ్లు, నా
చారముఁబట్టి నన్ను వ్యభి♦చారిణిఁ జేయక మానరింక నె
ట్లోరుచుదాన? నెట్టిదశ ♦ యున్నదొ ముందున నందనందనా?

ఉ. పున్నమ చంద్రునేలు మొగ♦మున్ గలచక్కని వాఁడెయయ్యుఁ దా
నెన్నఁడుఁ గల్వకంటి? నా♦కింతయుఁ జూపఁడు నిష్కళంకుఁ డ
న్నన్న! సహింపలేక విధి! ♦ అన్యతనస్తను నాదునాథు నా
పున్నెపుమూట నాయమృత ♦ పున్నిధి ద్రోసితె కాఱుచీకటిన్?"

అయ్యో! ఎంత సరిపుచ్చుకొనెదమన్నను నాహృదయాందోళనము తగ్గకున్నది. పూర్వజన్మమున నెన్నిపాపములఁ జేసితినోకాని పాపరూపమనఁ బరగునీవేశ్యాకులమునజనించి సీతయులక్షణయు మొదలగునాయనుంగుచెలిమికత్తెలలో మొగమెత్తుకొని తిరుగఁజాలకున్నాను. కులవృత్తిలోనికి నన్నుఁ బ్రవేశపెట్టవలయునని బ్రతియున్నంతకాలమును నాయక్క నన్నుఁ బీడించుచుండెను. దుర్విటులసహవాసముననేకదా యామె కట్టిబలవన్మరణము సంభవించినది? ఏదుర్మార్గులామెను తుదముట్టించిరో తెలియదు. తెలిసినను ఏమి లాభమున్నది? జాతియునీతియుఁబాటింపక ధనాశచే నీచులతోసహవాసముఁ

జేయుట హానికరమని నేనెన్నోమారు లామెకుబోధించితిని.......ఛీ! కన్ను లార నిట్టి ఘోరకృత్యములఁజూచుచు నే నీవేశ్యావృత్తి నెట్టులవలంబింపఁగ లను? కులమునారిపోరు భరించుట నాకు దుర్భరముగనున్నది ప్రతిక్షణమును నాముదుసలితల్లి నాయెముకలు కటకటకొఱికి వేయుచున్నది వీరందఱినొప్పిం చికదా నేను వివాహమాడవలయును? నాతల్లి తొంబదియేండ్లతొక్కెనను, ఏమగవాఁడు నామెకు సాటిరాడు. కులమువారినిఁ బిలిపించి యిదివరకనేక మారు లామె తగువుపెట్టినది. కాని దైవవశమున నెట్టులో తప్పించుకొనివచ్చి తిని. నాయక్క కడ తేరినందున ధనార్జనమునకు నేనుదక్క వేరాధారములేదు. కావున నాతల్లి పూర్వమువలె మాటలతో నూరకుండదు. నాకరచరణములు బంధించియైనను నన్నే నీమునకో జతఁగూర్పకమానదు. హా! సర్వేశ్వరా! సర్వ లోకాధారా! దీనజనరక్షణా! శరణు! శరణు! పురాకృత కర్మవశమున నధమ జాతియందు జనించినను, బాల్యమునుండియు విద్య నేర్చుకొనుచు నుత్తమ కులజాతలగు కన్యకలతో సహవాసముఁజేసి, నిర్మలమైన నాయంతరాత్మ యందు వ్యభిచారవాంఛ నణుమాత్రమైన వహింపక నేనమలభావమున సంచ రించుచుంటినో లేదో నీవేసాక్షివికదా? అస్థిరమైన ధనమునకుఁగాని, క్షణభం గురమగు సౌఖ్యమునకుఁగాని మనసీయక, అందరునుజూచుచుండ నేనొక మహాపురుషుని బెండ్లిఁజేసికొని మాజాతివారికందఱికి నొకనీతిపాఠమును బో ధించి, వారి దుర్వృత్తుల మాన్పించి సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయుటయే నాముఖ్యోద్దేశమనుటకు నీవేసాక్షివికదా? ఇట్లు స్వార్థపరత్వ మణుమాత్ర మైన లేక సదా పరోపకారాయత్తచిత్తనైనన న్నొక్క అకురాని కష్టములఁ బడఁద్రోయకుము. ఎట్లాలైన నన్ని విపదబ్ధినుండి తప్పించి నాకోరికలనెరవేర్చి దేశాభివృద్ధికొఱకు నాచేఁ గొంతపనిజేయింపుము. లేకున్నచో నన్ని యిహలోకమునఁ గానరాకుండఁజేయుము. అంతియేకాని పంచభూతములు సాక్షిగ నా ప్రాణములైనఁద్యజించెదనుగాని, త్రినేత్రుఁడువచ్చి బోధించినను నేనీ నీచకులవృత్తినిఁ గన్నెత్తియైనఁజూడను. ఇయ్యది త్రికరణశుద్ధిగ

యాథార్థ్యము. ఇయ్యదియే నాపూనిక. నాతల్లిని నేను లక్షింపను. ఆమె నన్నే మిచేయఁగలదు? నాకులమువారితో నాకేమిసంబంధమున్నది. ? నేను వేశ్యనుగాను ఇంతకును వేశ్యకొకజాతియున్నదా? ఏజాతిస్త్రీయైనను, వ్యభిచారిణీ వృత్తినవలంబించినచో నదియే వేశ్యయని నాయభిప్రాయము ఏజాతిస్త్రీయైనను, సతీధర్మముల ననుసరించి ప్రవర్తించినచో నామెయే పతివ్రత. ఆమెయే యుత్తమకులసంజాత. స్త్రీకైనను నీతినిఁబట్టి గౌరవమువచ్చునుగాని జాతివలనఁగాఁగూడదా? కావున నాకు వీరందరితో నేమియుసంబంధములేదు నాతోడిసనాడు.

ఆహా! నామనోహరుఁడు చెరలో నెట్లులున్నవాఁడోకదా? ఆసుందరాంగుని మరల నేనెన్నఁడు చూడగలను? చిన్ననాటనుండియు విద్యాభ్యాసమున సీతాలక్షణలతోఁ బాటు నన్నేమహనీయుఁడు ప్రోత్సాహపరుచుచుండెనో, అప్పుడప్పుడు సతీధర్మములనెల్ల నాకు బోధించుచు, ఏకలావిదుఁడు నాజ్ఞానమునకు మూలకారకుఁడయ్యెనో, కలుషపూరితమగు కులాచారజారిణీ ప్రచారమున నన్నుఁబడనీయకుండ, వైవాహిక వాంఛాబీజమును నాహృదయక్షేత్రమున నాటి ఏసుగుణాకరుఁడు నన్నుద్ధరించెనో, నామనోధనము నపహరించి, యేసుందరుఁడు నన్నుఁ దనచరణదాసిగఁ జేసికొనెనో, అట్టినిరంతర విద్యానంద భరితచిత్తుఁడగు మాసత్యానందుఁడు కారాగృహ విముక్తుఁడై మరల నెన్నఁడైన నాకంటఁబడునా? ఓ సత్యానందా! నీకుఁ బదివేలువందనములు. నన్నుక్షమింపుము. ఆపత్సముద్రములో నడుగంటియున్న నీకీ నిర్భాగ్యురాలెట్టిసాహాయ్యము నొనర్పఁజాలకున్నది. అయ్యో! నీఋణము నేనుతీర్చుకొనలేను ఒక్కనాఁడు నిన్నుఁ జూడకున్నచో నూరక యాందోళనమొందు నాడెందమిప్పుడు కఠినపాషాణమై కటకటా! నీదీనావస్థనుజూచియెట్లుసహించియున్నదో తెలియదు. నా జీవితకాలమంతయు నీతోడనే గడుపవలయునని మొదటినుండియు గంపెడాశతోనుంటిని; గాని నే నిట్టినిర్భాగ్యురాలి నగుదునని యనుకొనలేదు. మనోహరా! మనోహరకరస్పర్శచే ముకుళితభావమును

విడిచి వికసితవదనయగు పద్మినీకాంతవలె నీసుందరముఖారవిందసందర్శనము ననాఁడెందు మెన్నండైన బ్రహ్మానందమొందుదునా? నీచరణసేవయే నే నాధారముఁ జేసికొని తల్లితోడను బాంధవగణముతోడను, వైరముఁ దెచ్చుకొని వ్యాఘ్రసమూహమున భీతకురంగమువలె శత్రుజనమధ్యమునఁ గాలముఁబుచ్చుచుంటిని. పరమదయాళుండగు సర్వేశ్వరుఁడు నన్నుఁ గారాగృహవిముక్తునిఁ జేసి నాకుఁ బతిభిక్ష పెట్టునో లేదో? లేనియెడల నాకుమరణమే శరణము'

అనియొకనాఁడు తిలోత్తమ తనగదిలో నొంటరిగఁ గూర్చుండి సత్యానందరావు ఛాయాప్రతిమను తనయొడిలో నిడికొని పరిపరివిధముల విలపింపఁ జొచ్చెను. ఆనాఁడామె బలవంతముగఁ జంపఁబడి రామసాగరమునఁ ద్రోయఁబడిన చకోరాక్షికీమె చెల్లెలు. జాతికీమె వేశ్యయైనను, నీతిప్రవర్తనమున నుత్తమకన్యకయని చదువరు లీమెస్వభావమును గ్రహించియుందురు. సుగుణోత్తమయగుతిలోత్తమ కిప్పటికిఁ బదారేండ్లకన్న నెక్కుడు ప్రాయముండియుండదు. బాల్యమునుండియు నీమె సీతాలక్షుణలతో నధికమైన మైత్రిఁ జేసివారితోఁ బాటు విద్యాభ్యాసమొనర్చుచుండెను. రూపలావణ్యగుణవిద్యలయందీమె వారికెంతమాత్రము నీడుదీయదు. సీతయు లక్షుణయుఁ దిలోత్తమనుతమ ప్రాణమువలెఁ జూచుకొనుచుండిరి. ప్రతిదినమును మధ్యాహ్నసమయమునందుఁ దిలోత్తమవారియొద్ద నేగ్రంథకాలక్షేపమొనర్చుచుండుట వాడుక. సత్యానందరావప్పుడప్పుడు రామారావింటికిఁ బోవుచుండుటచేఁ దిలోత్తమను తఱుచుగఁ జూచుచుండుట వానికిఁ దటస్థించుచుండెను. ఇంతియేకాక రామారావుగారి యింటిలో వారి కిరువురకును ఏకాంతముగఁ బరస్పరసందర్శనము గలుగుచుండుటవలనఁ దిలోత్తమయు సత్యానందరావును విద్యావిషయమునఁ బ్రసంగించుకొనుచువచ్చిరి. ఆప్రసంగములలో నేవారిగుణరూపవిద్యాప్రభావములు మనసుల కెక్కినందున నొండొరుల వరించుకొని యనురాగమును వహించిరి. సాధారణముగ వేశ్యలకందఱకిని గంతపారములగు జావళీలు మొదలగు శృంగారకీర్తనలయందు మన తిలోత్తమకు లేశమైనఁ బ్రవేశము

లేదు. అంతమాత్రమున నామె సంగీత మెఱుంగదని చదువరులు భావింపరాదు. త్యాగరాయకీర్తనలును, అధ్యాత్మరామాయణముకీర్తనలును, ఆమెయొద్దనే సీతాలక్షుణ లిరువురు నేర్చుకొనిరి. వేశ్యావృత్తి విడిచి సత్యానందమును వివాహమాడవలయునని మొదటినుండియుఁ బూర్ణమైన యభిలాష వహించియుండుటచేఁ దిలోత్తమ వేశ్యకురావలసిన నాట్యము మొదలగువిద్య లేమియు నేర్చుకొనలేదు. ఇంతియకాక ఆమెను జూచినవారు వేశ్యాకన్యక యని పోల్చుకొనుటకూడ దుర్లభము. ఆమెను గన్యాత్వమునుండి తప్పించుటకై వానితల్లి గొప్పసంబంధములనుమాటాడి యుంచెనుగాని తిలోత్తమ యేదో యొకవంకఁ జెప్పి తప్పించుకొనుచువచ్చెను. కడకుఁ దనప్రాణములు విసిగినందున నామెతల్లిపాపము తిలోత్తమను కఠినశిక్షల నలయింపఁజొచ్చెను. ధీరగుణచిత్తయగు తిలోత్తమ వానికన్నిటికి నోర్చి తనను సత్యానందమును గూర్పుమని భగవంతుని నిత్యము ప్రార్థించుచుండెను.

తనప్రియుఁ డకారణముగఁ గారాగారమునఁ బడినప్పటినుండియుఁ దిలోత్తమకు నిద్రాహారములులేవు వానినెట్టులైన బంధవిముక్తునిఁజేసి రక్షింపవలయునని రామారావుగారినిఁ బ్రార్థించుటకుఁ దిలోత్తమ రెండుమూడుసారులు ప్రయాణమయ్యెను; గాని మరల నెందుచేతనో సంశయించి యూరకుండెను.

ఆనాఁ డట్లు తిలోత్తమ యొంటరిగఁ గూర్చుండితనలో విచారించుచుండ నింతలో నెవరోతన్నుఁ బిల్చినట్లు వీథిగుమ్మములోనుండి యామె కొక కేక వినిపించెను. తోడనే తిలోత్తమ లేచి చావడిలోనికిఁబోయి చూచుసరికచ్చట ద్వారముకడ నొకదాసినిలచియుండెను. తిలోత్తమను జూచినతోడనే యాదాసి తనకోకకొంగున ముడివేసికొనిన కాగితమును విప్పి యామె కందిచ్చెను. తిలోత్తమ యాతురతతో నాయుత్తరమువిప్పి యిట్లుచదువఁ దొడఁగెను.

"ప్రాణమిత్రురాలగు తిలోత్తమకు—

చెలియా!

నీ హృదయేశ్వరుఁడగు సత్యానందరావు దుష్టులుపన్నిన మాయల వలనఁ జెయిలోఁబడినాఁడనుసంగతి నీకుఁ గ్రొత్తకాదు. పరిచయమాత్రముననే వాని దురవస్థకు మేమెంతయో విచారించుచుండ, మనసారఁగోరి వరించినవాని వగుటచే నీదుఃఖమునకు మితియుండదనుసంగతి నేనెఱుఁగుదును; కాని యిట్టి సమయమున నూరక విచారించి మనము చేయునదేమియునులేదు. వాని నెట్లులైన నాపదలోనుండి తొలఁగించుటకై మనము మన సాధ్యమైనంతవరకుఁ బ్రయత్నించుట కర్తవ్యము ఈవిషయములో రామారావుగారు శక్తివంచనలేక పాటుబడుచున్నారు. సర్వేశ్వరుని యనుగ్రహముచేతను, నీనిర్మలవర్తనము వలనను నీ మనోహరుఁడగు సత్యానందరావునకుఁ ద్వరలోనే శుభముగలుగుఁ గాక!

మిత్రునికై యహర్నిశముఁ బాటుపడుచుండిన మనరామారావుగారికి నీవుకొంత తోడ్పడవలసియున్నది. హత్యఁజేసిన వారు చకోరాక్షి విటులలో నివారేకాని తదితరులుకారు. విటులు వ్రాసిన యుత్తరములన్నియుఁ జకోరాక్షి భద్రముగ నుంచినదని నీవొకమారు నాతోఁ జెప్పినావు. కావున నాయుత్తరములన్నియుఁ గైకొని నీవొకసారి రామారావుగారివద్దకు రావలసియున్నది. ఆయన నీతోఁ గొన్నిసంగతులనుగూర్చి మాటాడవలసియున్నదని చెప్పినారు. మరువక సమయముఁ జూచుకొని తప్పక రావలయును. వచ్చునప్పుడు నీయొద్దనున్న నామనుచరిత్రమును, పారిజాతాపహరణమును దీసికొని రావలయును.

ఇట్లు నీ మిత్రురాలు

లక్షణ"

ఆయుత్తరమంతయుఁ జూచినతరువాత తిలోత్తమ యపరిమితానంద భరితచిత్తయయ్యెను. ఆయుత్తరము నెవ్వరును చూడకుండ నామె వెంటనే చించి పారవేసెను. ఆనాటిరాత్రి భోజనముఁజేసి తన ముదుసలితల్లి నిద్రించి నతరువాతఁ దిలోత్తమ మెల్లఁగలేచి యితరులు పోల్చుకొనకుండునట్లు ఆపాదమస్తకము ముసుఁగు వేసికొని రహస్యముగ రామారావుగారియింటికి వచ్చెను. నాటిరాత్రి తిలోత్తమయు రామారావును ఏకాంతస్థలమునఁ గూర్చుండి చకోరాక్షికి విటులు వ్రాసిన యుత్తరములకట్ట విప్పి యొక్కొక్కటి తమలోఁ జదువ నారంభించిరి. కడ కాయుత్తరములన్నిఁటిలో రెండుత్తరములుఁతక్కఁ దక్కిన వేమియు వారికిఁ బనికివచ్చినవి కావు. తిలోత్తమయు రామారావుగారును నాటిరాత్రి పండ్రెండుగంటలవరకు నేమేమో మెల్లఁగ సంభాషించుకొనిరి.

---

# ప్రకరణము.—6

---

## నిశ్చయమైనది.

ఉ. 'బంధువులెల్లఁ గృష్ణునకు ♦ బాలిక నిచ్చెదమంచు శేముషీ
సింధువులై విచారములు ♦ సేయఁగ వారలనడ్డపెట్టి దు
స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ ♦ జాలవిరోధముఁ జేసి మత్తపు
ష్పంధయవేణి నిత్తు శిశు ♦ పాలునకంచుఁ దలంచె నంధుఁడై.'

పోతన.

భీమశంకరముగారిప్పుడే భోజనముఁజేసి చావడిలోఁగల చాపుడు కుర్చీమీదఁ గూర్చుండి వీవనతో విసరికొనుచు గోడమీదనున్న చిత్రపటములను జూచుచుండిరి. మంగలివాఁడు సమీపముననే నిలువఁబడి తములపాకులను జుట్టి ఆయన కొక్కొక్కటి యందిచ్చుచుండెను. ఆయనవయసు దాదాపుగ నలువదిసంవత్సరములకు మించియుండదు. కొంచెము పొడగరియే కాని శరీరమున కందుకుఁదగిన లావుమాత్రములేదు. లౌక్యజీవనముఁగలవారైనను, ఆయన శ్రోత్రియధర్మాసక్తులగుటచేతఁ దలపై గోష్పాదమంత జుట్టునుంచుకొని మీసములను దీయించివేసిరి. సర్కారులో నెలకు అరువది రూపాయిలు వేతనముఁగల యుద్యోగమునందుఁ బనిసేయుచుండుటచే భీమశంకరముగారు ధాతారామపురములో నందఱికిని గౌరవపాత్రులైరి. సంసారమును క్లుప్తముగ జరుపుకొనుట యెవ్వరైన భీమశంకరముగారివద్దనే నేర్చుకొనవలయును. పరులనుండి తనకు రావలసిన విత్తములో నొకకాసైన నాయన విడువఁడు. ఒక్కనాఁడైనను బట్టెడన్న మొకబ్రాహ్మణునకుఁ బెట్టియుండఁడు. అందుచే నాయన లోభియని మాత్రము చదువరులు భావింపవలదు. ఒకరికిఁ బెట్టకున్నను భీమశంకరముగారు సంసారసౌఖ్యములన్నియు ననుభవించుచుండిరి. భోజనవిషయములో నాయన మిక్కిలి

సుకుమారుఁడగుటచే శుభ్రమైన పదార్థముల నండించుకొని తినుచుండెను. ఏదైనఁ బిండినంతఁ జేయవలసివచ్చినప్పుడు నేయియేకాని మానె పనికి రాదు. భార్యకు బెండ్లినాఁడు పెట్టిన నగలుతప్ప తరువాత నేమియుఁ జేయింపలేదు. కాని యిటీవల నెల్లబేరములో లాభము వచ్చిన రెండువందల రూపాయిలను బెట్టి బంగారపు టొడ్డాణముఁ జేయించి భార్యకిచ్చిరి. మీఁది సంగతులనుబట్టి భీమశంకరముగారి కన్నవస్త్రములకు లేశమును లోపము లేదని సారాంశము తేలుచున్నదికదా?

భీమశంకరముగారి సంతానములోఁ బ్రస్తుతము మన కథాభాగమునకు నాయికయైన లక్ష్మణతప్పఁ దక్కినవారితో మన కవసరములేదు. లక్ష్మణయే యీయన పెద్దకుమార్తె. రెండవకుమార్తె కింకను పెండ్లియీడు రానందున మన కథలో నామెను జేర్పవలసిన పనిలేదు. గుణరూపలావణ్యములయందు లక్ష్మణ యప్రతిమానయగుటచే నాసంబంధమును జేసికొనవలయునని యెందరో భీమశంకరముగారి నడిగిరి; కాని ఆయన పండ్రెండువందలు కన్యాశుల్క మడుగుచుండుటచేత నడిగినవారెల్ల మొగములు ముడుచుకొనుచువచ్చిరి. వచ్చిన సంబంధములు తిరిగిపోవుచున్నకొలఁదిని భీమశంకరముగారికిఁ గన్యాశుల్కగ్రహణదీక్షయందుఁ బంత మధికమగుచుండెను. అందుచేతనే దాదాపుగఁ బండ్రెండేండ్లయీడు వచ్చువరకును మన లక్ష్మణ యవివాహితయైయుండి పోవుటకుఁ గారణమైనది. తగినయీడు వచ్చువరకును లక్ష్మణకు వివాహముఁ జేయకుండుటచేత భీమశంకరముగారు సంఘసంస్కర్తలని యెవ్వరనుకొనెదరు? ఆయన శుద్ధఛాందసులు. పట్టణవాసులైనను, అగ్రహారపు బ్రాహ్మణులకన్నఁ బూర్వాచారపరాయణులు. లక్ష్మణకుఁ బెండ్లియీడు తప్పిపోవుచున్నదనియుఁ ద్వరలో నెవరికైన ముడిపెట్టకున్నఁ గులములో వెలివేసెదరనియు భార్యయును, బంధువులును, అప్పుడప్పుడు భీమశంకరముగారినిఁ దొందర బెట్టుచుండిరి. కడను భీమశంకరముగారు తన మేనల్లుఁడగు వేంకటేశము పండ్రెండువందలు నిచ్చుట కంగీకరించినందున వానికిచ్చి వివాహముఁ జేయుటకు నిశ్చయించిరి.

పాపము మనలక్షణకు వేంకటేశమును బెండ్లాడుట లేశము నిష్టము లేదు. ఆమె హృదయము మాధవరావునందు లగ్నమైనదని మన మిదివరకనే కొమారులు తెలిసికొంటిమి. సిగ్గునలనఁ దలిదండ్రులతో నేమి చెప్పుటకును వీలులేక, చేష్టలవలనను, మాటలవలనను, తన హృదయాభిప్రాయమును వారికి వెల్లడించుచుండెను; కాని యందువలన నామె కేమియు లాభము గలుగలేదు. లక్షణ దీనావస్థ కెందఱో జాలిపడి యట్టి యుత్తమకన్యకను అల్పజ్ఞుఁడగు వేంకటేశమునకుఁ గట్టఁబెట్టుట న్యాయముకాదని భీమశంకరముగారికిబో ధించుచువచ్చిరి. కాని విపరీతమైన ధనాశ యాయన చిత్తమును త్రిప్పవ య్యె. అన్నవస్త్రములకుఁ గొరంతయుఁ గొఱంత లేకయున్నను, ఇంతటి ధనాశ వహించుటచేతనే భీమశంకరముగారి కాయూరిలో గౌరవము నానా టికి క్షీణించుచుండెను.

ఆనాఁడు భీమశంకరముగారు చావడిలోఁ గూర్చుండియుండఁగా నింతలో నొక పురుషుఁడు వచ్చి యాయనయెదుట నిలువఁబడెను. భీమశం కరముగా రాతనిఁజూచి చెంతనున్న బల్లపైఁ గూర్చుండుమని చెప్పి యిట్లు మాటాడిరి.

'ఏఁవిరా! వేంకటేశా! పొద్దున్నే రమ్మని కబురంపిస్తే యెందుకువచ్చా వుకావు?'

'కలక్టరుగారిదగ్గరకు వెళ్లవలసిన పనివుంటే వెళ్లేను.'

'నీకీనెల్లో యేఁవైనా ప్రమోషనవుతుందా! లేక యింకా యీపది హేనురాళ్లేనా?'

'ఔతుందండీ! మా హెడ్డుక్లర్కుగారు నాగురించి మొన్ననే సిఫార్సుచేశారు. గుమస్తాలందరిలోకీ నాదస్తూరి చాలాబాగుంటుందని కల క్టరుగారు సంతోషించారట. రెండుమూడురోజుల్లో ప్రమోషను కార్డరు వస్తుంది'

'బుద్ధిగావుండు. దుండాభాయిజట్టులో తిరుగుతూ వుంటావని అనేకమార్లు విన్నాను. రాత్రిళ్లింట్లో పడుకోనట ఎందుచేత?'

'ఏఁవిచెయ్యమన్నారు? హెడ్‌క్లర్కుగారికి ఆఫీసువర్కు హెచ్చుగా వుండడంచేత యింటికే తెచ్చుకొని రాత్రిళ్లు కూడా పనిచేస్తున్నారు. నన్ను కూడా కొంచెం సాహాయ్యం చెయ్యమని పిలిస్తే వెళుతున్నాను. పన్నెండు గంటలదాకా రాసుకొని యింటికి రావడంభయంచేత అక్కడే పడుకుంటున్నాను'

'అలాగైతే సంతోషంఁవే! అంతేకాని యక్కర్లేని జట్టీల్లోకి దిగకు. మొన్న చకోరాక్షీకేసులో నీవెందుకు సంబంధంకలిగించుకొన్నావు?'

'నాకేమీ సంబంధంలేదండీ! సత్యానందాన్ని ఆవేళరాత్రి పన్నెండు గంటలకు చూశాననిమాత్రం చెప్పాను'

''ఆమాటేచాలు పీకపట్టుకోడానికి! ఏఖర్మం ఎరగనినువ్వుకూడా వాళ్లతో సమంగా కోర్టకెక్కాలాలేదా? అనవసరంగా నీకెందుకీచిక్కు?'

'బాగుంది. ఎక్కినంతమాత్రంలో యేఁవిటవుతుంది? నాకెంతమట్టుకు తెలుసునో అంతమట్టుకు సాక్ష్యంచెప్తాను. చూసింది చెప్పడానికేఁవికష్టం?'

'సరేకాని పెళ్ళి యెప్పుడుచేసుకోడానికి నిశ్చయించావు? అందుకే నీకబురుపంపించాను. పిల్లనింకెంతోకాలం వుంచడానికి వీల్లేదు.'

'ఎప్పుడు నిశ్చయంచేస్తే అప్పుడే. నా అభ్యంతరంలేదు'

'ఈ వచ్చే చైత్రమాసంలో పెట్టించేతునా?'

'పెట్టించండి'

'అంటే-యింకా యిరవైరోజులేగడువుందన్నమాట. నువ్వు తూగగలవా?'

'ఆహా! ఇంతకూ నేనేఁవి బెడద పెట్టుకోను. ఏదోసంసారపక్షంగా చేసుకుందాం'

అదే మంచిమాట. మీతండ్రి చచ్చిపోయాడు. సంసారభారం నీమీదపడ్డాది. ఇకనైనా బుద్ధితెచ్చుకో. కార్యానికి సొమ్ము జాగ్రత్తచేశావా?'

'ప్రస్తుతం నాదగ్గర వెయ్యిరూపాయీలు సిద్ధంగావున్నాయి తక్కింది నాలుగైదురోజుల్లో జతపెట్టగలను. ఆభయం మీకక్కర్లేదు.'

'పన్నెండువందలకూ ఒకదమ్మిడీతక్కువైనా మీయత్తగారొప్పుకోదుసుమా'

'లేదులేదు. నాకింకా మూడువందలు సిస్తురావలసివుంది. మీరు లగ్గం పెట్టించండి.'

ఇట్లు మాటాడుచుండఁగాఁ జావడిలోనున్న గడియారము టంగుటంగునఁ బదునొకండుగంటలు కొట్టెను తోడనే భీమశంకరముగారు కచేరీకి వేళయైనదని కుర్చీమీదనుండిలేచిరి వేంకటేశము మామగారివద్ద సెలవుపుచ్చుకొని తనలో నేమో దీర్ఘాలోచనము సేయుచు నింటికి బయలుదేరెను వేంకటేశముతోఁ జదువరుల కిదివరకుఁ గొంత పరిచయము గలిగినది కాని వానిఁగూర్చి యింకను గొన్నిసంగతులు తెలియవలసియున్నవి. వాని తండ్రి యొక వకీలువద్ద గుమస్తాగాఁ బనిఁజేసి వేలకొలఁది ధనము నార్జించి చనిపోయెను. అప్పటికి వేంకటేశము రెండవఫారముఁ జదువుచు మొదటినుండియు దుస్సహవాసముఁ గలిగియున్నవాఁడగుటచేఁ దండ్రి చనిపోయినందున స్వతంత్రుఁడై తల్లిని లక్ష్యపెట్టక అంతతోఁ జదువుఁ జాలించెను. చదువుఁ జాలించినప్పటినుండియుఁ గ్రమక్రమముగ నన్నివ్యసనములలోనికిదిగి పరిపూర్ణపాండిత్యమును సంపాదించెను. రాత్రివేళలయందేకాని పగటివేళలయం దెన్నఁడును నిషాచేయుట వాడుకలేదు. తస్కరణవిద్యయందంత చతురుఁడని చెప్పలేముగాని ప్రవేశముమాత్రములేకపోలేదు. అన్నిటికన్న నొక్క విద్యలోమాత్రము వేంకటేశము మిక్కిలి ఘనుఁడు ఆడినమాట నాడకుండ గంటలకొలఁది నబద్ధముగఁ జెప్పుటయం దాతనికి కాతఁడే సాటి. తనకెట్టియుద్యోగమును లేకున్నను, కలక్టరు కచేరిలో నుద్యోగము

లోనున్నట్లు లంపటితోఁ జెప్పుచుండెను. వానివ్యాపారము మాత్రము పనియును, తీరుపాటులేక నిరంతరము వీథులవెంటఁ దిరుగు శునకవ్యాపారమే! ఇంతియేకాక యుక్తాయుక్త విచక్షణ వానికిఁ గలలోనైన లేదు. పలువురొక్కసారిఁగూడి తన్నుఁ బ్రోత్సాహపరిచినచో నెట్టిసాహసకృత్యమునకైన వెనుదీయఁడు పరులు నవ్వెదరను లజ్జయు, నొరులు తన్ను నిందించెదరను అనుమానమును లేనివారి నెవ్వరు జయింపఁగలరు? సిగ్గువిడిచినవాఁడు త్రిలోకములను జయింపవచ్చునుగదా? సకలదుర్గుణధురీణునకు, అట్టిదురాచారునకుఁ జక్కని బంగారు బొమ్మయగు తనకూతునంటఁగట్టుటకు భీమశంకరముగారెట్లు సాహసించిరో తెలియదు. ఎంత చదువుకొనిన నేమి? ఎట్టియుద్యోగములో నున్న నేమి? ధనమును, ఉద్యోగమును కీర్తికిఁ గారణములుకావు. విద్యావంతుఁడైనంత మాత్రమునఁ గూడ గౌరవముగల్గుట దుర్ఘటము. లోకములోఁ జదువుకొనిన మూర్ఖులుకూడఁ గొందఱుకలరు. అందుకుఁ బ్రత్యక్షప్రమాణము మన భీమశంకరముగారేకదా? మూర్ఖులగు తలిదండ్రుల కడుపునఁబుట్టి మనలక్ష్మణ దురదృష్టవంతురాలైనది. ఆమె దుఃఖమును జల్లార్చి యోదార్పువా రెవ్వరునులేరు. కన్నతల్లి దండ్రులే శత్రువులైన యెడల నింక నాపద్బాంధవులెవ్వరు? అయినను, ఆశ్రితజనరక్షణుఁడగు సర్వేశ్వరుఁడులేఁడా? ఏపాపము నెఱుఁగని నిర్మలహృదయయగు మనలక్ష్మణ కోరిక నెరవేర్పకుండునా? ఆనాడు భీమశంకరముగారు వేంకటేశముతో మాటాడిన మాటలన్నియుఁ దలుపుచాటుననుండి లక్ష్మణ వినుచునే యుండెను.



# ప్ర క ర ణ ము—7.

## ప్రా మి స రీ నో టు.

'మృత్యువు సమీపించుచున్నది. ఇంక నిరువదిదినములే గడవున్నదట. ఈగండము గడచునను నిబ్బరము నాకుఁగలుగకున్నది. అయ్యో! యెన్నిపాపములఁజేసి యీపాడుజన్మ మెత్తితినో కదా? ఎందఱికన్యకలనో దుఃఖపెట్టి, యెన్నివివాహములనో పడఁగొట్టి యెందఱిదంపతులకో వియోగదుఃఖముఁ గల్గించినందున భగవంతుఁడు నన్ని దుస్సహరసంతాపమునఁ బడఁద్రోసి యీ యసందర్భ వివాహము నాకొనఁగూర్చెను. లేకున్నచో లోకములో నిందఱు కన్యకలుండ దైవము నాయందేపగవహించునా? ఎందఱో కన్నియలు మన సారవరించిన సుందరపురుషులను వివాహమాడి సకలసౌఖ్యముల నోలలాడు చుండిరి; కాని నాపాపమే యిట్లు బ్రద్దలై పోయినది. హా! వేంకటేశా! నీవు నాకెక్కడ దాపరించితివి? దుర్గుణధురీణుండవగు నిన్ను నే నెట్లుచేపట్టఁ గలను? నిరంతరవారకాంతాలోలుండవగు నీకు వివాహ మెందుకు? నన్నుఁ బెండ్లాడి పురాకృతసంబంధమైన శత్రుత్వమును సాధించుకొన నెంచితివా? నా మనోధనమును మాధవరావున కర్పించితినని నీవెఱిఁగియుసిగ్గులేక నన్నెట్లు పెండ్లాడఁజూచుచుంటివి? నీకుఁ బౌరుషములేదా? నిన్ను వరింపని కాంతను నీవు కన్నెత్తియైనఁ జూడవచ్చునా? ఛీ! నిన్ననవలసిన పనిలేదు. నీయట్టి మూర్ఖునితో సంబంధముఁ గల్పుకొనుచున్న మాతండ్రిననవలయుఁగాక. నలు వదియేండ్లవయసు వచ్చినను, బిడ్డలతండ్రియైనను యుక్తాయుక్త విచక్షణజ్ఞా నము లేదు ఈ సంబంధము కూడదనితనకు బోధించినవారితో వేంకటేశ మునకే యిచ్చెదననిపంతముఁ బట్టియున్నవాఁడట. పౌరుషములేని యీ పంత మెందుకు? కన్నకూతురు గొంతుకఁ దెగఁగోయుటకా! ఛీ! తండ్రీ! నీవు నాకింకఁ దండ్రివికావు. నీయుద్యమము నీచమని నిన్ను నిందింపనివారులేరు.

లోకములో నింత రవ్వపడుట నీకు న్యాయముకాదు. మాధవుఁడు నీ కన్నుల కెట్టులగపడుచుండెను? వేంకటేశముపాటి చక్కఁదనము వానికి లేదా? నీకన్నులకు గ్రుడ్డియా? గుణరూపవిద్యాప్రభావములలో మీ వేంకటేశము మా మాధవుని కాలిగోరునకైనఁ బోలునా? గురునిందాదోషము నాకుఁ గల్గినఁ గల్గుఁగాక! నీయట్టిమూర్ఖుఁడు పురుషులలో నెచ్చటనులేడు. నీ వాడుదానికన్న జ్ఞానహీనుఁడవైతివి.'

అని లక్షణ యానాఁడు తెలుపుచాటుననుండి, తనతండ్రికిని వేంకటేశమునకును జరిగిన సంభాషణము విని తనలో నవ్వుకొనుచు గదిలో మంచముపైఁ బరుండెను. అప్పటినుండియు నామె మనసు పూర్వముకన్న నెక్కుడుగఁ గలతఁజెందుచుండెను. తదేకధ్యానముననే మునిఁగి సర్వమునుమరచి యూరకవిచారించుచు నామె భోజనమునకైనలేవలేదు. రెండుమూడుసారులు తల్లి భోజనమునకు రమ్మని పిలిచినదికాని, వినఁబడకయో, పలుకుట కిష్టము లేకయోకాని మాఱాడక యూరకుండెను. దీర్ఘాలోచనమున నెన్నియోసంగతులు తనలోఁదలపోయుచు లక్షణ కొంతసేపునకుఁ గన్నులుమూసి మెల్లఁగ నిద్రించెను.

గాఢనిద్రానిమగ్నయైన లక్షణను మేల్కొలిపి మరల నామెమనసు దీర్ఘవిచారమునఁ గలతపెట్టుటమాని, మనము వేంకటేశమువెంటఁ గొంత దూరము పోవలసియున్నది. మామగారివద్ద సెలవుఁగైకొని వేంకటేశము తనలో నేమో దీర్ఘాలోచన మొనర్చుచుఁ బోవుచుండెను. కొంతదూరము పోయినతరువాత నాతఁడు బజారునకుసమీపమునఁగల యొకచిన్నవీథిలోఁ బ్రవేశించెను. ఆ వీథిలో దాదాపుగ నూరిండ్లకన్న నెక్కువ యుండి యుండవు. అన్నియుఁ బెంకుటిండ్లేయైనను, ఒక్క మేడమాత్ర మీ వీథికి వన్నెఁ గలిగించుచుండెను. దానివైఖరిచూడ, పట్టణములోనికెల్ల నదియే పెద్దభవనమని చెప్పవచ్చును. రానురాను వేంకటేశమామేడను సమీపించి, మెట్లెక్కి చావిడిలోనికిఁబోయి యచ్చట నొక కుర్చీమీదఁగూర్చుండెను. అప్పుడొక

దాని యొక్క పసిబిడ్డ నెత్తుకొని లోపలినుండి చావడిలోనికి వచ్చుచుండ వేంక టేశము వానినిఁజూచి 'ఓసే! అప్పీ! మోహనరావుగారేం చేస్తున్నారే? ఇం ట్లోవున్నారా' అని యడిగెను. 'బాబూ ఇప్పుడే వొచ్చినారు. వణ్ణం బోం చేస్తున్నారు' అనివెంటనే యా దానిజదులు చెప్పెను. వేంకటేశముపావుగంట కాలమునటకు నచ్చటఁ గూర్చుండి ప్రక్కగదిలో మాటలసందడి వినఁబడి నందున మోహనరావుగారూ! మోహనరావుగారూ! అని గట్టిగ రెండుమారులు పిల్చెను తోడనే లోపలినుండి 'యస్ కమింగ్!' అని ప్రత్యుత్తరము వచ్చె ను. ఆమాటలు మోహనరావుగారి పలుటచేతనే కాఁబోలు వేంకటేశము నవ్వుచు వానికొఱకెదురు చూచుచుండెను. కొన్నినిముసములకుఁ గట్టుకొనిన పొత్తిపంచతోఁ దడిచేతులు తుడుచుకొనుచు, సగము సగము తిరుగుచున్న గిరజాలును, తెల్లనిశరీరచ్ఛాయయును, నూగుమీసములును గల యొక పురుషుఁ డులోపలినుండి చావడిలోనికివచ్చి వేంకటేశమునకుఁ బ్రక్కనింకొకయాస నముపైఁ గూర్చుండి వానితో నిట్లు ప్రసంగింపఁదొడఁగెను.

'వేంకటేశముగారా? చాలారోజులనుండి దర్శనాలులేవు. పిల్లా పిచి కా అంతా బాగా?'

'ఇంకా పిల్లా పిచికాయెవళ్లూలేరు మీదయయుంటే ఇకముందేమో?'

'అయినా చెప్పారుకుమా ! పెళ్లయితేనే పిల్లలుండాలని శాస్త్రం వుం దనుకొన్నారా యేఁవిటి? అలాఅక్కర్లేదు'

'మోహనరావుగారూ! మీహాస్యం నాకు కొత్తకాదు. యుక్తుల్లో మిమ్మెవళ్లూ గెలవలేరు'

'అమగోచూశాం! మీకప్పుడే కోపంవచ్చింది నాకుతెలుసును'

'అబ్బెబ్బే! కోపంకూడానా? మీరుఫ్రెండ్సు కాబట్టి హాస్యం ఆడతారు కాని పైవాళ్లంటారా యేఁవిటి?'

'మీకుద్యోగం అయిందని విన్నాను. ఏయాఫీసులో?'

'జమీందారుగారివద్ద ప్రవేటు శెక్రిటరీగా ప్రవేశించాను'

'దటీజ్ ఆల్ రైట్. జీతఁవెంత?'

'ఫస్టుఫుటింగు ముప్పైరూపాయిలు'

'అయితే కోట్లేరన్నమాట డాప్! శాలెప్పుడుచేస్తారు?'

'జీతం దొరకింతరవాత'

'ఒస్సీ ఈపాటిదానికి జీతందొరకాల్టయ్యా? మీతండ్రి వేలకొలదీ ఆర్జించిపోశాడు. తియ్యండి పదిరూపాయలు'

'అలాగే! ఇంతేకదా? వేలా? పందలా? మీదయయుంటేకొద్దిరోజుల్లోనే శుభవార్తవింటారు. అప్పుడు పదికాదు యాభైరూపాయిలు బాల్చేస్తాను'

'ఏఁవిటండో? ఇంకాచెప్పరు'

'భీమశఁకరంగారి కుమార్తెను నాకివ్వడానికి నిశ్చయం అయింది'

'వాహ్వా! వాహ్వా!మీఁదృష్టంతులేవండీ! ఆపిల్ల చాలాబుద్ధిమంతురాలని విన్నాను. చదువుకుందికూడానట'

'ఆహా! అమరంలో పద్యాలన్నీ కంఠతావచ్చును. కాదంబరిలోని పాటలన్నీ ప్రశస్తముగా పాడుతుంది'

'సంగీతంకూడా చెప్పించారా యేఁవిటి?'

'మరేఁవిటనుకున్నారు ? ఒకటా ! అన్నీ దగ్గిరుండిచెప్పించాను'

'ఈడొచ్చిన పిల్లే! సంతోషఁవైన సంగతేచెప్పారు'

'మీతో చెప్పకుండానా ? మీసహాయ్యం లేంది యేదీకాదే?'

'నాసహాయ్యం ఎందుకు ? చెప్పండి చేతనైతే చేస్తాను'

'బుద్ధిపుట్టాలికాని మీకుచేతకాం నొకటుందాయేఁవిటి? కొంచెం రహస్యంగా మాటాడాలి'

'భయంలేదు ఇక్కడెవళ్లూలేరు చెప్పండి'

'మీరేఁవనుకుంటారో అని అనుమానిస్తున్నాను'

'పిచ్చిమాని చెప్పవయ్యా! భయంలేదు'

'అయితే వినండి. నేనేపాటి ఆ స్త్రీపరుణ్ణో మీ రెరుగుదురు కదా?

'ఆహా! మీకేమి కొదవ? మహారాజులు'

'మా మామగారు చైత్రమాసంలో వివాహం నిశ్చయించారు. ప్రస్తుతం నావద్ద వెయ్యిరూపాయీలున్నాయి కాని మరి మూడువందలవసరంగా వుంది. మీ రేలాగైనా భర్తీచేయించారంటే'

'గట్టిచిక్కు తెచ్చారే! నిన్న మధ్యాహ్నమే నాదగ్గిరవున్న లెక్కంతా మా అత్తగారిచేతి కిచ్చేశాను. మళ్లా అడిగితే ఆవిడ దెబ్బలాడుతుంది'

'నాకు పది హేమువందలు నిస్తులు రావలసివున్నాయండీ! ఇంత వేగిరంగా లగ్నం పెడతారని నేననుకోలేదు. లేకపోతే మూడువందలు నాకో క్ష్యమా?'

'నే నెరగనండీ మీసంగతి? కాని నన్నేమిచెయ్యమన్నారు చెప్పండి నిన్నపొద్దున్నడిగుంటే యిచ్చేయుందును.'

'నాకేం తెలుసును యిలావస్తుందని? ఇప్పుడే మామగారు లగ్నం నిశ్చయించారు. మీరేలాగైనా సర్దుబాటుచేస్తే నాలుగు రోజుల్లో మీ సొమ్ము వడ్డీతో కూడా పువ్వుల్లో పెట్టియిస్తాను'

'సరి. యిస్తారటండీ! ఆ భయం నాకులేదు. కాని'

'మరి కానీగీనీ అనకండి. ఇదుగో మరోరహస్యం. మూడువందల యాభైరూపాయిలకు నోటురాశిస్తాను. మీరు మూడువందలు మాత్రం నాకిప్పించండి అవసరానికిచ్చినందుకు ఆ యాభైన్నీ మీకులాభం. మరిమాటాడక లెండి కలంకాయితం తెప్పిస్తే ఇప్పుడే నోటురాసివ్యవహారం పరిష్కరించుకొందాం.'

'ఆవిడ యేమంటుందోయని భయంగావుంది.'

'ఏమంటుందండీ? యేమీఅందు. మీరులెండి'

'ఏంచేస్తాను? మీమాట తోసివేయలేను ఉండండియిప్పుడే లోపటికివెళ్లివస్తాను'

అని మోహనరావుగారు కుర్చీమీదనుండిలేచి లోనికివెళ్లి పదినిముషములు పోయినతరువాతఁ గలమును, కాగితమును, సిరాబుడ్డియుఁ బట్టుకొని మరలఁ జావడిలోనికి వచ్చి 'చూశారా! వేంకటేశంగారూ! ఆడవాళ్లతో అన్నీతంటాలే!'

'ఏఁవీ? ఏఁవన్నారేఁవిటి?'

'ఏఁవీలేదూ! సొమ్మడుగుతే అక్కర్లేని ప్రశ్నలన్నీ వేస్తారు. ఎందుకోసఁవని అడిగినారు కాని నేం చెప్పలేదు. చూశారా! మీరు ప్రాణస్నేహితులని యిస్తున్నాను. వారంరోజుల్లో తిరిగి నాసొమ్ము యివ్వకపోతే యింట్లోనాపరువుండదు. తరువాత మీయిష్టం'

'అబ్బే! వారంరోజు లెందుకండీ? ఇవాళేంవారం? సోంవారఁవా? మంగళవారం—బుధవారం—లక్ష్మీంవారంనాడు సాయింత్రానికి మీకక్కర్లేదన్నా గుమ్మల్లోరూపాయిలు పోశేసివెళిపోతాను.'

వేంకటేశమునకుఁ గలమును కాగితమునిచ్చి మోహనరావుగారు నోటు వ్రాయుమని చెప్పిరి. అధికవడ్డీకి సొమ్మునితరులకు ఋణము నిచ్చుచుండుటయే మోహనరావుగారివృత్తి. ఎంతటి ప్రాణస్నేహితుఁడైనను వాయిదానాటికి సొమ్ముఁజెల్లింపకున్నచో నాయన మొగమోట ముంచుకొనక ఋణస్థులను కోర్టుకెక్కింపకమానరు. ఇంతియేకాక 'సొమ్మిస్తారా! దావాతెమ్మన్నారా?' అని ఋణస్థు లెంతటి తగుమనుష్యులైనను, నౌఖరులచే నడిగించుచుండుట వారికభ్యాసము. మోహనరావుగారిసంగతి తెలిసినతరువాత నాయనతో నెట్టిసంబంధమును గల్గించుకొనుటకును నలువురు వెనుదీయుచుండిరి. మొదట వీరికాపురమెచ్చటనో మనకు దెలియదు; కాని, వివాహమైనతరువాత నత్తవారింటనే చదువుకొనుచునుండిపోయిరి. మామగారు కాలము చేసినందునను, అత్తగారికి మగసంతానము లేనందునను, మోహనరావు అత్తింటనన్నిసౌఖ్యములు ననుభవించుచుండెను. అత్తవారు ధనికులగుటచేతఁ గోరినబట్టలును, కోరినతిండియు, వలసినంతధనమును వీనికి సమృద్ధిగలభించుచుండెను. అప్పటి

నుండియే యీయనగిరజాలు పెంచుట కారంభించి సుగంధతైలములు రాయుచుఁ బూర్వముకన్న నిగనిగలాడుచుండిరి. కాని మధుపానసేవమాత్రము వీనిస్వరూపమును మార్చి కొన్నిదినములకు విరూపునిఁజేసెను. కాలేజీలో వీరు ప్రవేశపరీక్షఁ జదువుకొనిరి కాని అది దాటుట వారికి శక్యము కాలేదు. ఆఱుసంవత్సరములవరకు యూనివర్సిటీపరిక్షకుఁగట్టి కార్యము లేకపోయినందున విసిగి చదువుమానివేసిరి. కాని అత్తవారిల్లు మాత్రము మానలేదు. ఈ విషయములో మోహనరావుగారినిఁ బలువురు నిందించిరి కాని ఆయన లక్ష్య పెట్టలేదు. పురుషున కత్తింటి కాపురము లజ్జాకరమని తలంపకపోవుటయే కాక, తమకుఁ గల్గిన దైశ్వర్యమునకుఁ దామే మెచ్చుకొనుచు, నిరుపేదలను జూచి వారిద్రవ్యహీనతను మోహనరావుగా రాక్షేపించుచుండుట వాడుక. కాని వారు తినుచున్నయన్నము స్వార్జితవిత్తమో, పరధనమో, పరసనము కన్నహీనమైన స్త్రీధనమో యాలోచింపరు కాఁబోలు ?

ఆనాఁడు మోహనరావుగారు వేంకటేశముచేత 350 రూ॥ లకు నోటు వ్రాయించి 300 రూ॥లు మాత్రమే యిచ్చి సాక్షిసంతకములు చేయించి ఆ నోటును బుచ్చుకొనిరి. వేంకటేశము సొమ్ముతోనింటికి బయలుదేరెను.



# ప్రకరణము—8.

## భయంకరమైనరాత్రి.

అర్ధరాత్రము కావచ్చినది. పోలీసుస్టేషనులో పహరావాఁడిప్పుడే పన్నెండుగంటలుకొట్టినాడు. అమావాస్యకుఁజేరువదినమగుటచేత నాటిరాత్రి ఆనగరమునందంతట నంధకారము దట్టముగ వ్యాపించియుండెను. ధాతారామపట్టణమంతయు హాయిగ నిద్రించుచుండెను. ఎటుచూచినను మనుష్యసంచారము లేకపోవుటచే వీథులన్నియు భయంకరముగఁ దోచుచుండెను. వేసవికాలమగుటచేత నచ్చటచ్చట నరుగులపైఁ గొందఱును, ద్వారములకడ్డముగ మంచములువేసికొని కొందఱును నిద్రించుచుండిరి. పరమసుఖామోదకరుఁడగుశీతలమలయానిలుఁడు నగరమునందెల్లకడల స్వేచ్ఛగా విహరించుచుండెను. మితిమీరినకష్టములను భరింపఁజాలక ప్రాణములకుఁ దెగించి సాహసకృత్యము లొనర్చుకొనువారు తనకుఁ గన్నబిడ్డలగుటచే వారి రహస్యకృత్యములు పరులకంటఁబడకుండ నాటిరాత్రి యంధకారరాక్షసి నిజస్వరూపమును వహించినది. గాఢనిద్రాపరవశులై పడియున్నవారి గుఱ్ఱుధ్వని తప్పఁ బట్టణమున నెచ్చటఁ జూచినను మరియొకవిధమైన ధ్వని లేదు. నిద్రమత్తుచేతనో లేక మరేకారణముననో కాని నడచునప్పు డిటునటు నొరుగుచు, నొకొక్కప్పుడు నేలపైఁ దిరుగఁబడి మరల లేచుచు విటకాండ్రు మార్గమధ్యమున నొకరినొకరుకలిసికొని, తమ వ్యవహారములనుగూర్చి సంభాషించుచుఁ గడకు సిగపట్లలోనికిదిగి, యొండొరులగ్రుద్దుకొని కేకలువేయుచుఁ దెల్లవారువరకును సందడి సేయుచుండుట ప్రతిదినము నాచారమై యుండెనుకాని,ఆనాఁడుమాత్ర మామహానీయు లేకారణముచేతనో యెచ్చటను కానరారయ్యె. ఆందుచేతనే వీథియరుగులపైఁ బరుండినవారు తమనిత్యశివరాత్రివ్రతమును విడిచి, యారాత్రి నిద్రాభంగము లేక హాయిగాఁ బరుండఁగలి

గిరి. వర్తకులెల్లరు రాత్రి పదిగంటలు కాకమునుపే తమయంగళ్లు మూసికొని యిండ్లకుఁబోవుట వాడుకయైనను, పెద్దబజారునకుఁ జివ్వరనున్న సారా యిదుకాణమువాఁడుమాత్రము రెండుఝాములుతిరిగి పట్టణమంతయు మాటు మడుగువరకు నంగడిఁ దెఱచికొనియే యుండుచుండెను. కాని నాటిరాత్రి బేరమెక్కుడైనందున సరుకు త్వరలోఁ జెల్లిపోయెనుగాఁబోలు ? వాఁడు కూడ దుకాణముఁ గట్టి పెందలికడనే యింటికిఁ బోయెను.

నిర్మలనీలాంబరమున వజ్రపుఁ దునుకలవలె నెల్లకడల ధగధగ మెఱయు చుండిన నక్షత్రగణము నప్పుడు చూచినవారు ఈశ్వరునిసృష్టివైచిత్ర్యమును కొనియాడకమానరు. ఉల్లసద్విద్యుల్లతాంకురములవలె నంధకారమున నందందు సంచరించు మిణుగురుపురుగులకాంతిదక్క నగరమున నెచ్చటను దీపములు లేవు. నగరరక్షణార్థమై రాత్రులయందు గస్తీతిరుగు రాజభటులుకూడ ననుల్లంఘనీయమైన నిద్రాదేవియాజ్ఞ శిరసావహించి మెల్లఁగ నరుగులపై రహస్యముగ శరీరములువాల్చిరి పగలంతయు నెట్టికష్టము లనుభవించినను, రాత్రి వేళలయందు గన్నతల్లికన్న నెక్కుడుగ నాదరించి జీవకోటి నంతటిని సుఖపెట్టునది నిద్రయేకదా? ఏసౌఖ్యమునకైనఁ బరిమితి యున్నదికాని నిద్రాసౌఖ్యమున కింత పరిమాణమని యెవ్వరు చెప్పఁగలరు? ఎట్టిసంపదలేకున్నను గాలముఁ గడుపవచ్చునుకాని నిద్రాసంపద లేకయే జీవింపఁగల ధీరుఁడెవఁడు? కారణకారణుండగు పరమేశ్వరుఁడు అస్థిరమగు ధనమునందుమాత్రము మానవకోటి నొండొరులకు వ్యత్యాసముఁ గల్గించెను గాని, నిద్రాధనముమాత్రము లేకయే పంచియిచ్చెననుట కెవ్వరు కాదనువారు? నిద్రయేకదా యమిత సౌఖ్యదాయకము ? మనోగతవిచారనివారణోపాయము? సకలజీవసముదాయసమార్జితస్థిరతరైశ్వర్యము? సర్వశరీరసమారోగ్యకరపరమౌషధము?

అట్టి భయంకరమైన యర్ధరాత్రమున నెచ్చటనుండియో యొక మనుష్యవిగ్రహము బయలుదేరి, రాజమార్గమునుండి పోవుచుండెను. అంధకారము దట్టముగ వ్యాపించియుండుటచే నావచ్చువా రెవరో పోల్చుకొనుట మనకుఁ

గష్టమైనను, కాళ్లనందియలు చప్పుడగుచుండుటచే స్త్రీయని స్పష్టమగుచున్నది. ఆమె యెవ్వరో, అంతరాత్రివేళ నొంటరిగ బయలుదేరుట కేమి కారణమో మనకుఁ దెలియదు. శత్రువులు వెంటఁదరుమునట్లు, ఆమె భయముచేఁ దొందర తొందరగ నడుగులు వేయుచుఁ బోవుచుండెను. స్త్రీయయ్యు, సహజమైన భయము లేశమును జెందక, అంతరాత్రివేళ నొంటరిగ బయలుదేరుటచే, నామె కేదియో యాపద సంభవించినందునఁ బ్రాణములకుఁ దెగించి యేదైన సాహసముఁ జేసికొనుటకుఁ బోవుచుండెనని మనము గ్రహింపవచ్చును. ఒరులెవరైనఁ జూచినచోఁ దన్నుఁ బోల్చుకొనఁ జాలకుండుటకుఁ గాఁబోలు నామె యాపాదమస్తకము నల్లని మేలిముసుంగుఁ దాల్చి పోవుచుండెను. ఎచ్చటనైనఁ జీమచిటుక్కుమన్నచోఁ ద్రుళ్లిపడుచు నిట్టునట్టుఁజూచుచు నామె యతివేగమున నడచి పోవుచుండెను. అట్లు పోయిపోయి మార్గమునఁగల వీథులన్నియు దాటిదాటి యామె రామసాగరమును సమీపించెను. తోడనే ప్రక్కనున్న రోడ్డుపైనుండి యెవ్వరో నడచిపోవుచున్నట్లులామె కనుమానముతోఁచినందున నాకాంత చెరువుఒడ్డునకున్న రామలింగేశ్వరుని యాలయములోనికిఁ దటాలునఁబోయి యచ్చట నొకమూలఁ గొంతెవనను దాగియుండెను. అప్పుడు నిజముగ నామార్గమున నెవ్వరైనఁ బోవుచుండిరో, లేక వట్టియనుమాన మామెమనసునకుఁ బొడకట్టినదో మనకుఁ దెలియదు.

ఆలయములోఁ దూరిన తరువాత నామె "ఓ రామలింగేశ్వరా! ఇంతకాలమువరకును నీకు నాపై ననుగ్రహము కలుఁగునేమోయని వేచియుంటిని గాని నీవు కఠినచిత్తుఁడవైతివి. నీయాజ్ఞానుసారముగ నేఁడు దుర్భరమైన యీశరీరమును విడిచి నీయం దైక్యమయ్యెదను. నావియోగదుఃఖమున నామనోహరున కెట్టికష్టములును గలుగకుండ రక్షింపుము. బ్రతికియుండి నేనీకష్టములను భరింపఁజాలను." అని తనలో నీశ్వరునిఁ బ్రార్థించి కొంచెముసేపునకు మెల్లఁగ మరల నాలయమునుండి యీవలకు వచ్చుచుండెను. అప్పు

డు మంటపముపైఁ జల్లగాలిలోఁ బరుండిన పూజారి నిద్దురలో నేమో పలువరించినందున నామె త్రుళ్ళిపడి తటాలున మరల లోనికిఁ బోయెను. ఇట్లు రెండుమూడుసారు లామె యుద్యమమునకు భంగము కల్గినందున నాకాంత యాలయములోఁ గొంతసేపు నిలిచి భీతిల్లుచు నెట్టకేల కీవలికి వచ్చెను. ఈసారి మాత్ర మామె కట్టి యాటంకమును గలుగలేదు. తనవెనుక నెవరో వచ్చుచున్నట్టులు కాలిచప్పు డగుటచేతనో లేక యనుమానముచేతనో కాని యప్పు డప్పుడు వెనుకకుఁ దిరిగి చూచుచుండెను. ఆచీకటిలో నామెకంటి కెవ్వరును గానరాలేదు. క్రమక్రమముగ నా స్త్రీ చెరువు ఒడ్డునకువచ్చి మెట్లుదిగి నీటియొద్దకుఁబోయి యచ్చట దన మేలిముసుఁగుఁ దీసి పారవైచి పైటకొంగుతో నడుముఁ గట్టిగ బిగించుకొని 'జేపరమేశ్వరా' యని నీటిలోనికి దుమికి ప్రాణత్యాగ మొనర్చుకొనుటకు సిద్ధపడుసరికి, తటాలున వెనుకనుండి యెవఁడో యొకపురుషుఁడువచ్చి యామె చేయిఁ గట్టిగఁ బట్టుకొని యొడ్డునకు లాగివైచి "నీవెవ్వరు? ఇట్టిపనిఁ జేయుట కేమికారణము?' అని బిగ్గరగ గద్దించి యడిగెను.

'మీరెవ్వరు? నాతో మీకేమి యవసరమున్నది?'

'నే నెవ్వఁడనో తరువాతఁ జెప్పెదను. నీ బలవన్మరణమునకుఁ గారణమేమో నా కెఱిఁగింపుము.'

'అయ్యో! నే నాడుదానను. దుఃఖభాజనమైన బ్రతుకు బ్రతుకనేరక ప్రాణత్యాగ మొనర్చుకొనవలయునని యిట్లు వచ్చినాను.'

'నీవు బ్రాహ్మణ స్త్రీవా?'

'కాను. వేశ్యను. నా పేరు తిలోత్తమ'

'ఓహో! తిలోత్తమా! నీవా? చీకటిలోఁ బోల్చుకొనఁజాలక పోయితిని. ఇంతసాహస మొనర్చుటకుఁ గారణమేమి? చెప్పు చెప్పు!"

అని యాపురుషుఁడు తన జేబులోనున్న యగ్గిపెట్టెను దీసి వెలిఁ

గించి వెలుతురున నామె మొగముఁ జూచెను. తిలోత్తమ యా పురుషునిఁ బోల్చి

'ఆర్యా! నమస్కారము. తమరని యెఱుఁగను. నన్ను క్షమింప వలయును'

'తిలోత్తమా! చెప్పు! చెప్పు! ఏమిజరిగినది?'

'నిన్న మధ్యాహ్నము నుండియు మాతల్లి నన్నొకగదిలోఁ బడవైచి తాళము వేసి యుంచెను. కులమువారందరును మాయింటికి వచ్చి గవాక్షము నుండి నన్నుఁ జూచి కన్నెఱికమున కంగీకరింపుమని నాకు బోధింపఁ జొచ్చిరి. మాతల్లి మరల నే డెవ్వనినో రావించిన న్నల్లర పెట్టునని నే నప్పుడే నిశ్చయించుకొంటిని. నే ననుకొనినట్టులే రాత్రి ౮ గంటలకుఁ జలువ జేసిన వస్త్రములఁ దాల్చి వయ్యారముతో మహానుభావుఁడైన వేంకటేశము మాయింటికి వచ్చి—'

'వేంకటేశమా? వేంకటేశమేనా?'

'అవును. ఆమూర్ఖుఁడే! మా తల్లికి ఏబది రూపాయీలిచ్చెను. తోడనే యామె వానిని గౌరవించి నే నున్న గదితలుపులు తీసి అంగీకరింపకున్నచో వీపు చెక్కలు చేసెదనని భయపెట్టి వానిని నా గదిలోఁ బ్రవేశపెట్టెను అప్పుడు వేంకటేశము నన్ను ముట్టుకొనుటకు దగ్గరకు వచ్చెను. కాని నీకు బ్రతుకుపై నాశ లేనిచో రమ్మని నిర్భయముగఁ బలికితిని. తోడనే యాతఁడు భయపడి దూరముగఁ దొలఁగి పోయెను.'

'తిలోత్తమా! వేంకటేశముధైర్యము నాకుఁ గ్రొత్తకాదు. తరువాత?'

'నే నెంతకు నంగీకరింప కుండుటచే మా తల్లి పెద్దకేకలువేసి అల్లరి. చేయ నారంభించెను. మా కులస్థు లందరును వచ్చి నాకు నీతులు నేర్ప నారంభించిరి కాని నేను వారి నెవ్వరిని లక్షింపక వీలైనయెడల నెట్టులైనఁ దప్పించుకొని పారిపోవుదు మని ప్రయత్నించుచుంటిని. కాని దురాగ్రహచిత్తయగు నా తల్లి నన్నొక స్తంభమునకు విరిచికట్టి- ఇదిగో! నా

వీపు పైతట్లు చూచినారా? నన్ను గొడ్డును బాదినట్లు బాద నారంభించెను. నేటితో నా కాయువు చెల్లినదని యప్పుడే యనుకొంటిని.'

'తిలోత్తమా! ఎంతపనిఁజేసితివి? ఇట్లు జరుగునని నీకుఁదెలిసినది కదా? నాకు ముందుగఁ గబురంపలేకబోతివా? సరే! తరువాత?'

'కొంతసేపునకు వేంకటేశము విసుగుఁజెంది తన యింటికిఁబోయెను. మా కులస్థులలోఁ గొందరు మెల్లఁగ నాకట్లు విప్పి నన్ను బుజ్జగింప నారంభించిరి. నేను వారికిఁదగిన ప్రత్యుత్తరము లిచ్చుచు, నాకస్మికముగ మాయింటిలోని దీపము నూదివేసి యచ్చటి గుంపులోఁ జొరఁబడి యా చీకటిలో నేనుఁగూడఁ దగవుఁ దీర్చుటకువచ్చినవారివలెనే కేకలువేయ నారంభించితిని. తిలోత్తమయేదియేదని వారందరు నిటునటు వెదకఁజొచ్చిరి. వారితో నేనుఁ గూడ వెదకునట్లు నటించి మెల్లఁగ నెవ్వరును జూడకుండ మాపెరటిలోఁబడి గోడదాటి ప్రక్కసందులోనుండి రాజమార్గమునకు వచ్చి యచ్చటనుండి యిట్లు పారిపోవచ్చితిని. మీ రడ్డగింప కున్నచో నేడు నేను దుఃఖాతిశయమున నీకొలనిలోఁబడి ప్రాణములు విడిచియుందును.'

'తిలోత్తమా! నాతోఁ జెప్పకుండ నీ వింతటిసాహస మెన్నఁడును జేయకుము. పద పద. ఇంక నిచ్చట నుండఁగూడదు.''

'మన మెత్రోవను బోవుదము? నాకొరకు వెదకుచు నెవరైన మనల నడ్డగింతురేమో?'

'నేనుండఁగ నీకేమిభయము?'

అని వారిరువురును గలసి యెచ్చటికో బయలుదేరిరి.

# ప్రకరణము—9.

## రిపోర్టు.

“ఎన్నిజన్మములకును నేనురామారావు ఋణమునుదీర్చుకొనలేను. అట్టి మహనీయునితో మైత్రిగలుగుట నాపురాకృతపుణ్యమని తలంచెదను ఆహా! తలఁచుకొనినప్పుడెల్ల గుండె బ్రద్దలగును. నాకెట్టి యపనింద కలిగినది? ఆహత్యయందు నేను లేశమైన సంబంధము గల్గించుకొనినయెడల నేమో యనుకొనవచ్చును. ఏపాపము నెఱుఁగని నాకిట్టిదుర్దశ భగవంతుఁ డేలకల్గించెనో తెలియదు. ఈ విషయములో నిక్కముగ సర్వేశ్వరుఁడు పక్షపాతము వహించెనని నేననకమానను. హా! ఆశ్రితాపన్నబిరుదాంకా? నీ శ్రితాపన్నబిరుద మిదియే కాఁబోలు? తల్లిదండ్రులులేని యేకాకినిఁ జేసినది చాలక, పట్టెడన్నమునకై పరులపంచలఁ జేర్చినదిచాలక, యాచింపరానివారినిఁ జేఁజాచి యాచించియు నడుగరానివారినడిగి, పట్టరానివారి పాదములఁబట్టి జీవించునట్లు నన్నొక నిర్భాగ్యునిఁజేసినదిచాలక; కట్టా! హతవిధీ! ఈ కారాగారవాసముఁ గూడఁ గడకొనఁగూర్చితివికదా? మేలు! మేలు! ఇంకనైన నాపైఁగలపగతీరినదో లేదో? లేనియెడల నా ప్రాణములింకఁ గష్టపెట్టక సాధ్యమగునంత త్వరలో నన్నీలోకమునుండి కొనిపొమ్ము. బలవన్మరణయోగ ముండుటచేతనే కాఁబోలు నన్నీకారాగృహమునఁ జేర్చితివి? దుర్భరమైన యీ జీవనముకన్న మరణము నా కమిత సంతోషకరమే కాని, ఏ పాపము నెరుఁగని నాపైఁబడిన యీ యపనిందకు మాత్రము వగచుచున్నాను. స్త్రీవధఁ జేసిన పాపాత్ముఁడని జను లాచంద్రతారార్కము నన్ను నిందింపక మానరు. ఎన్నివిధముల నాలోచించినను, ఈ యపనిందఁ దప్పించుకొనుటకు నాకెట్టియుపాయమును గానరాలేదు. దయార్ద్రహృదయుఁడగు రామారావు మాత్రము నావిషయమున నిద్రాహారములు లేక పనిసేయుచున్నాఁడు. కాని యీ మహాసముద్రమునుండి దరిఁజేరు ధైర్యము నాకు లేశమును గలుగకున్నది.

హా! తిలోత్తమా! మనకిరువురకునుగల ఋణానుబంధ మింతతో ముగించినది. నిన్ను మరల నీ జన్మములోఁ జూడఁగల ననునాశ లేదు. ఇంకనైన నీవు పశ్చాత్తాపమొంది యీనిర్భాగ్యునిపై నాశ విడిచి నీత్రోవ నీవు జూచుకొనుము. నేను బంధవిముక్తుఁడనగుదు నన్నమాట కలలోనివార్త. నిద్రాహారములులేక నే నీ చెరలోనే శుష్కించి శుష్కించి ప్రాణములు విడిచెదను. లేదా విచారణలో నురిశిక్ష దైవమే వ్రాసియున్నాడు. ఎటులైనను నాకుఁ జావు దప్పదు. అయ్యో సుందరీ! నీ వెంత దురదృష్టవంతురాలవు? అందుచేతనే యీనిర్భాగ్యునిపై నీకు మోహము జనించినది! కులస్త్రీయందుఁ బ్రవేశింపక తల్లితోడను బంధువులతోడను వైరముఁ దెచ్చుకొని యెవ్వని నీవు నమ్ముకొంటివో ఆ దుర్మార్గుఁడగు సత్యానందుఁడు తెగనికత్తిని నీగొంతుకఁ దెగఁగోసి నిన్ను దిక్కులేనిదాని నొనర్చినాడు. అయ్యో! మనోహరీ! నీవు నాకొఱకెంత యేడ్చుచుంటివోకదా? నీయునురంతయు నాకుఁ దగులకుండునా? నీవు గూడ నావలెనే యెట్టి యిడుమలయం దడుగంటియుంటివో తెలియదు"

అని సత్యానందరావు ఒకనాడు చెరలో ననేకవిధముల విచారించుచుండఁ గేశవరావు వానికి ధైర్యము గరుపఁదొడంగెను. కేశవరా వెవఁడో మనకుఁ దెలియదు. కాని తాను సత్యానందమునకు బంధువుఁడననియు, చెరలో నున్నంతవఱకువాని సంరక్షణకు తనకు సెల విప్పింపవలయుననియుఁ గేశవరావు రామారావుగారినిఁ బ్రార్థింప, ఆయన యంగీకరించి వాని కనుజ్ఞ నిచ్చిరి. కేశవుఁడు నిరంతరమును సత్యానందమును నోదార్చుచు వాని ననేకవిధములఁ గాపాడుచుండెను. ఆనాడు కేశవుఁడు, సత్యానందము వగచుటఁ జూచి యిట్లు ప్రసంగించెను.

'ఆర్యా! ఆపదలు కాపురములుసేయవు. కష్టకాలమున ధైర్యము వహించుట పురుషలక్షణము. మీరు విద్యావంతులగుటచే మీకుఁ జెప్పుపాటి వాఁడను గాను'

'కేశవా! నీవన్నది నిజమేకాని, నావిద్యయు నాధైర్యము నేమైపోయి నవో తెలియదు. నేనింకఁ బూర్వపు సత్యానందమునుగాను, నాకీలోకముతో నెట్టిసంబంధమును లేదు.'

'అయ్యా! కష్టము రాక నిరంతరమును సుఖమే యనుభవించువా రెవ్వరున్నారు? ఇంతకు మీకు రవంతయుఁ బ్రాణభయము లేదని రామారావుగారు నిర్భయముగఁ జెప్పుచున్నారు. మీరుయుక్తాయుక్తము లాలోచింపక యిట్లు వగచుట ధర్మమా?'

'ప్రాణభయమున్నను లేకున్నను, నాకింక నిహలోక సౌఖ్యములపై వాంఛలేదు. దైవానుగ్రహమున నాకీ యపనింద యెట్లులైనఁ దప్పినచో బంధవిముక్తుఁడనైన తరువాత నేను సన్యసించెదను.'

'సన్యసించెదరా?'

'కాక యీ బ్రతుకున నేమి లాభమున్నది? దీని కేమికాని కేశవా? నా మనసులో నొకకోరిక యున్నది. అది నీవే తీర్పవలయును.'

'సాధ్యమైనంత వరకుఁ బ్రయత్నించెదను సెలవిండు.'

'బాలకా! చిన్ననాటనుండియు నాయందే మనసు కలిగి, నన్నే తన దైవముగ భావించుచు, నా కారణమునఁ దన కులమువారితో వైరముఁ దెచ్చుకొని నన్నే దృఢముగ నమ్ముకొనియున్న గుణోత్తమయగు మాతిలోత్తమ నొకసారి చూడవలయునని యున్నది.'

'అయ్యా! సన్యాసాశ్రమము స్వీకరించుచు మీకుఁ దిలోత్తమ యేల?'

'అటుకా దటుకాదు. నే నామెతోఁ గడసారిమాటలఁ గొన్ని చెప్పవలసియున్నది. నేను నూత నాశ్రమమును స్వీకరించుట కామె యనుజ్ఞ నొందవలసియున్నదికదా?'

'ఆమె కిష్టము లేనిచో సన్యసించుట మానివేసెదరా?'

'ఏమో? ఏమిచెప్పఁగలను? నాకు సెలవిమ్మని యామె ననేకవిధములఁ బ్రార్థించి కడకొప్పించెదను.'

'అదేమిమాట? ఎంతకు నామె యొప్పకున్నచో మీరేమిచేసెదరో సెలవిండు.'

'ఏమిచేయఁగలను? అంత పంతము వహించినచోఁ జెప్పకయే యెచ్చటికైనఁ బారిపోయెదను.'

'ఆహా! సత్యానందా! నీ వెంత కఠినహృదయుఁడవు? ఇంతవరకును నీపై నాకు గౌరవభావ ముండెనుకాని యిప్పు డది తొలంగినది. మానప్రాణములు మీకు ధారవోసి మీకారణమున నందరితో వైరముఁదెచ్చుకొని నీవే దిక్కని నమ్ముకొనియున్నకన్యకను నిర్దయుఁడవై విడిచి పారిపోయెదవా? నీ కిట్టి దుర్బుద్ధి యేల పుట్టినది? నీ యుద్దేశము తిలోత్తమ విన్నచో నామె యిప్పుడే ప్రాణత్యాగ మొనర్చుకొనును.................'

'ఆఁ-ఆఁ-కేశవా! నే నేమంటిని? తిలోత్తమను విడిచి పారిపోయెదననియే యంటినా? అయ్యో! యెంతదుర్బుద్ధిపుట్టినది? ఇంతపాపాత్ముఁడ నగుటచేతనే దైవము నాకీ దురవస్థఁ గలిగించెను. కేశవా! నిన్ను బ్రతిమాలుకొనెదను. నీవుమాత్ర మీ సంగతి నెన్నఁడును తిలోత్తమతోఁ జెప్పకుము. నే నామెను విడిచి పోవునంతటిమూర్ఖుఁడనుకాను. మనసు చంచల మగుచుండుటచే నేమోయంటిని నా జీవితకాలములో నామెను విడిచి బ్రతుకఁగలనా? ఆమెను జూచు భాగ్యము నాకుఁ గలుగకున్నచో దన్నామస్మరణమాత్రముననే యానందించుచుందును. ఓ కన్యాలలామా! తిలోత్తమా? నా యపరాధము లన్నియు క్షమింపుము. నేను నిరంతరము నీసేవకుఁడను. నీ యాజ్ఞకు బద్ధుఁడనై మెలంగెదను.'

'అయ్యో! అదుగో! ఎందుకొరకో కాని రామారావుగారును వెంకటేశము నిచ్చటకు వచ్చుచున్నారు'

అని పలుక నింతలో నేదోకాగితమును చదువుచు వేంకటేశమును వెంట నిడికొని రామారావుగారు స్టేషనులోనికివచ్చి యచ్చట మేజాబల్లవద్ద నొకకుర్చీపైఁ గూర్చుండిరి. వేంకటేశము వానియెదుటనే ప్రక్కను నిలువఁబడి

యుండెను. చేతిలోని కాగితమును చదువుట పూర్తియైన తరువాత రామారావుగారు వేంకటేశమును జూచి యిట్లు మాటాడిరి.

'అయ్యా! వెంకటేశముగారూ! ఈ రిపోర్టు తిలోత్తమతల్లియే వ్రాసినదా? మీరువ్రాసినారా?'

'దస్తూగీగాదే దానిపేరుపెట్టి నేనేరాశాను'

'తిలోత్తమ యెప్పటినుండి కనఁబడలేదు?'

'మొన్నటిరాత్రి నుండి కనఁబడలేదు'

'రాత్రి యెన్నిగంటలవరకు నింట్లో యున్నది?'

'పదకొండు గంటల్దాకావున్నాది. తరవాత యెక్కడికో పారిపోయింది.'

'మీరుగదిలో నున్నప్పుడు తిలోత్తమ మీచెంతనేయున్నదా?'

'లేదు. లేదు. అప్పుడు నాచెంతలేదు. ఆఁ-ఆఁ-కాదండోయి-నిన్నరాత్రి నేను తిలోత్తమయింటికి వేళ్లేలేదు'

'అబద్ధమాడకండీ! మీరు పెద్దమనుష్యులు. కావున నొప్పుకొండి'

'చిత్తం వెళ్లేనండి'

'శబాస్. ఇప్పుడు మిమ్ము మెచ్చుకొంటిని. అబద్ధమాడిన నేమి లాభము? ఇదివరకుఁ జలోరాక్షికిని మీకును ఎంత కాలమునుండి పరిచయముండెను?'

'ఇదిగో! చూశారా! ఈలాంటిమాటలు మీ రడిగితే మా మాఁవగారు కోప్పడతారు'

'నాపైనా? మీపైనా ఆక్షేపము?'

'లేదండీ! యీసంగతు లాయనకి తెలిశాయంటే నన్ను చీవాట్లు పెడతారు. సంబంధం తప్పిపోతుంది.'

రామారావుగారు తమకు జనించిన యాగ్రహమును అణఁచుకొని రెండుమూడు సారులు శిరముఁ బంకించి వేంకటేశము ప్రక్క రెప్ప వాల్పకుండఁ గొంతవరకుఁ జూచి,

'సరే! ఇంక మిమ్మేమియు నడుగనులెండి. ఈ కాగితముపై సంతకముఁ జేసి మీరు పోవచ్చును. తిలోత్తమ యెచ్చటికిఁ బారిపోయినదో వెదకించెదనని దానితల్లితోఁ జెప్పెదరా? కులవృత్తి కంగీకరింపకున్నదని దానిని మీరందరుఁ గలిసి చంపివేస్తిరేమోయని నాకనుమానముగా నున్నది.'

'రాఁవ-రాఁవ! చకోరాక్షి చచ్చిపోయిందనే అమారికే నెత్తీ నోరూ కొట్టుకొని యేడుస్తూ వుందండీ.'

'సరే! మీ రింక దయచేయవచ్చును.'

అని వేంకటేశము నంపి రామారావుగారేమియో ఆలోచించుచు నట్లనే కూర్చుండిరి.

---

# ప్రకరణము—10.

---

## నేడు నేను పెండ్లికూతునయ్యెదను.

ముహూర్తము సమీపించుచున్నందున భీమశంకరముగారు తమయింట వివాహప్రయత్నములు దినదినముఁ జేయించుచుండిరి. ఉప్పాడచాపులు, కర్పూరపు పేడలు, ఆరంగనక్కలు, అత్తరువు పన్నీరు మొదలగు పెండ్లిసామానులు తాము స్వయముగా బజారునకుఁబోయి ప్రశస్తమైన రకముఁ గొని తెచ్చుచుండిరి. ఇంటికంతటికిని వెల్లవేయించి గుమ్మములకుఁ బసుపుఁ గుంకుమను నలంది భీమశంకరముగారి భార్య ప్రతిద్వారమునకు మామిడాకుల తోరణముఁ గట్టించెను. భీమశంకరముగారు తమ యింటిముందర పందిరి వేయించి రంగురంగుల కాగితములతో నా పందిరి నలంకరించిరి. ముహూర్తమింకను వారిపుదినము లుండగనే బంధువు లెల్లరు శుభలేఖలఁజూచి భీమశంకరముగారి యింటికి వచ్చిరి. బాలికలతోడను బాలురతోడను వృద్ధులతోడను నిండి యాదినములలో పంతులుగారి యిల్లు కల కల లాడుచుండెను. భీమశంకరముగారు తమ చేతిక్రిందఁ బనిసేయుచున్న యుద్యోగస్థుల యిండ్లపెరళ్లలోనున్న కూరగాయలు బలవంతముగఁ దెప్పించి తమయింటఁ బెండ్లికొఱకు నిలువఁజేయుచుండిరి. ఈయకున్నచో ఆఫీసులో నేదో వంకఁబెట్టి తమ్ము బాధింతురనిభయపడి ప్రతివారును పంతులుగారికిఁ గోరినవి సమర్పించుకొనుచుండిరి. గ్రామములలోని రైతులకుఁ గబురంపి తమచేత నొక కాసైనఁ గర్చు కాకుండ భీమశంకరముగారు వలసినంత వంటచెఱుకు దెప్పించుకొనిరి. 'బుక్కా' - 'బర్గుండ' - 'ఊదువత్తులు' - గంధపుఁ జెక్కలు - అగరువత్తులు మొదలగు పెండ్లివస్తువు లన్నియుఁ బంతులుగారు సిద్ధముగ నుంపించిరి. ఆయన భార్య కార్యముపట్ల మగనికన్న నెక్కుడు చతురతఁగలదగుటచే 'అప్పడాలు' - 'వడియాలు' - 'పచ్చళ్లు' - 'ఊరగాయలు' మొదలగు తినుబడి సామగ్రి

నంతటి నదివరకేసిద్ధముఁ జేయించి యుంపించెను. పంచాంగము కట్టలు చంకల యం దిడుకొని పౌరోహితులు ప్రతిదినమును పంతులుగారియింటికివచ్చుచుఁ బోవుచుండిరి. వంటబ్రాహ్మణులు, నీళ్లకావడిబ్రాహ్మణులును తమకేమైన బేరము వచ్చునేమో యనియంగవస్త్రములు తలకుఁ జుట్టుకొని రెండుపూటలును భీమశంకరముగారి దర్శనముఁ జేసి పోవుచుండిరి. పంతులుగారుమంగళవాంద్రను బిలిపించి 'బాజా' వాయించుటకై కొంతవరకు వారితో బేరమాడి 'బయానా' యిచ్చి పంపివేసిరి అప్పుడు భీమశంకరముగారి భార్యనట్టింటిలోనుండిచావడి లోనికి వచ్చి 'ఔనా! యేంచేస్తున్నారు? రేపు లక్ష్మింవారం పిల్లని పెళ్లికూతుర్ని చెయ్యాలి. బాజాంవాళ్లని తెల్లారుఝామునవమ్మని చెప్పేరా లేదా?' అని పంతులుగారి నడిగెను. పంతులుగారు వెంటనే తల నూచి 'ఆఁ-ఆఁ-చెప్పేను. పొద్దున్నే పిల్లని పెళ్లికూతుర్ని చెయ్య.' అని ప్రత్యుత్తర మిచ్చిరి.

వ్రాయుటకును, చదువుటకును గూడ మనకు మిక్కిలి సంతోషకరమైనను ప్రస్తుతము మన లక్షణ యవస్థ యెట్లుండెనో వ్రాయక తప్పదుకదా? రాహుగ్రహగ్రస్త రాకానిశా కరబింబము పగిది నా సుందరి ముద్దుమొగము కళలు తొలంగి వాడి మనోగత విచార మంతటినిఁ జూపరులకుఁ దెలియఁ జేయుచుండెను. తన యింటికి వచ్చిన బంధువు లెవ్వరితోడను జనువుగ మాటాడక, ఆ బాలిక కన్నీరుఁగార్చుచు నిరంతరముఁ దన గదిలో నొంటరిగఁ గూర్చుండి పట్టరాని దుఃఖమున నూరక వెక్కి వెక్కి యేడ్చుచుండెను. శరణాగత రక్షణుఁడగు నా సర్వేశ్వరునకే దయ లేనప్పుడు పాప మా బాలిక నోదార్చువా రెవరు? ఎందరెన్ని విధముల బోధించినను మూర్ఖహృదయులైన తల్లిదండ్రులు తాము పట్టిన పంతము మానలేదు. ముహూర్తము సమీపించుచున్న కొలదిని ఆమె హృదయాందోళనము సముద్ర తరంగములవలె నుప్పొంగి మరింత దుఃఖపెట్ట నారంభించెను. మరునా డుదయమునఁ దన్నుఁ బెండ్లికూతునిఁ జేసెదరని తెలిసిన తోడనే తొలినాడు

లక్షణ తన ప్రాణసమానయగు సీతతోఁగూడ మాటాడుట మాని తన కిట్టి సంకటముఁ గల్గించిన భగవంతు నూరక నిందించుచు పూర్వముకన్నఁ దనలో రోదన మొనర్పఁ దొడఁగెను. ఆనాటిరాత్రి భోజనమునకు రమ్మని తల్లి యెంతపిల్చినను, ఆమె తన కాకలి లేదని చెప్పి భుజించుట మానివేసి యె వ్వరితోడను మాటాడక ముసుఁగు వేసికొని పరుండెను. భీమశంకరముగారు కూడ రెండు మూడుసారులు వచ్చి 'అమ్మా! లక్షణా! ఆకలేకపోతే మజ్జిగాఅన్నం కొంచెం తిని పడుకుందుగాని లే! పంతం మాని! రేపు నిన్ను పెళ్లికూతుర్ని చేస్తారు. పొద్దెక్కెందాకా వంట కాదు. తరవాత నీ యిష్టం.' అని బలవంతపెట్టిరి కాని, లక్షణ ఆయనకుఁ బ్రత్యుత్తరమే యీయలేదు. వచ్చిన బంధువులలో లక్షణ వదినలు భీమశంకరముగారినిఁ జూచి 'మామయ్యా! రేపు పెళ్లికూతుర్ని చేస్తారన్న సంతోషంచేత లక్షణకు కడుపు నిండిపోయింది. మరెందుకు భోంచేస్తుంది? మా వెంకటేశం అన్నయ్యని ఎప్పుడు చూస్తాను? ఎప్పుడుపెళ్లావతాను అని లక్షణ తొందరపడుతూంది'అనిచెప్పి లక్షణను పరిహాస మాడఁదొడఁగిరి. 'పిల్లికిఁ జెలగాటమును, ఎలుకకుఁ బ్రాణసంకటము' నన నిట్టిదియేకదా? లక్షణ యలుకకుఁ గారణము కొంతవరకు నామె తల్లిదండ్రులు మాత్ర మెఱుఁగుదురు కాని వచ్చిన బంధువులలో నెవ్వరికిని దెలియదు.

పాపమా నాటిరాత్రి మనలక్షణ ఆకలిబాధచేతను, అంతకన్నఁ బది రెట్లధికముగ వేదించుచున్నమితిలేని దుఃఖబాధచేతను, కన్నులు మూసుకొనియే పరుండినను లేశమైననిద్రలేక తనభారమంతయు నీశ్వరునిపైవైచి, మాటిమాటికినిఁ దన తల్లిదండ్రుల మూర్ఖతను దగచుచు, మాధవరావును దలఁచుకొని పొంగి పొంగి వచ్చుచుండిన దుఃఖభారము నాపుకొనలేక వెక్కి వెక్కి యేడ్చుచు, ఏవిధముచేతనైన నీగండమునుదప్పింప నిలవేల్పుల నెల్ల ర వేశ్వరుగఁ బ్రార్థించుచు నిముసమొక మహాయుగమువలె గడపెను. ఇంతలోఁదెల్లవారుఝామైనది. దుఃఖాతిశయముచేతనో లేక కొంచెము నిద్దురవ

చ్చుటచేతనో లక్షణకన్నులుమూసి శయనించెను. కాని పాపమెంతోసేపు నిద్రించుటకామెకు వీలులేకపోయినది, 'లక్షణా! లే! లే తెల్లవారుజాఁ వైంది. తలంట నీళ్లుపోస్తాను లే! ఆలస్యం చెయ్యకు' అనియామె వీపుపైఁ దట్టుచు నెవరోపిల్చినందున లక్షణ త్రుళ్ళిపడిలేచి యిటునటుఁజూచెను. అప్పుడు మంచముపద్దనొక పాతచీరెయు, నూనెగిన్నెయు, నలుగుపిండిగల పళ్లెరమును పట్టుకొని యొక స్త్రీ నిలిచి యుండుటఁజూచి లక్షణలేచియామెతో నిట్లు సంభాషించెను.

'అమ్మా! లేచెదనుగాని ఒక్కసారి నీవిచ్చటఁ గూర్చుండి నామాటలకు సమాధానముఁ జెప్పుము.'

'ఏఁవి సమాధానం చెప్పాలి? చెప్పు.'

'అమ్మా! కేకలు వేయకుము. మనబంధువులెల్లరు నిద్రించుచుండుటచే నీతోరహస్యముగ మాటాడనెంచితిని. తల్లీ నన్నింతకాలమును బెంచి కడకు వెంకటేశమునకా యిచ్చిపెండ్లిఁజేసెదవు? నవమాసములు నన్నుఁగని పెంచి పెద్దఁజేసి యట్టిమూర్ఖునకుఁ గట్టిపెట్టుటకిన్న బలవంతముగ నొకపాడునూతిలోఁద్రోసిన సంతసించియుందునే' 'ఛీ! నోరుముయ్యి? ఎవరైనావింటే నవ్విపోతారు. ఓగాయిత్తం మాటలాడకు. వెంకటేశం పుచ్చిపోయాడనుకున్నావా యేఁవిటి? బంగారంలాంటిసంబంధం. ఇదేఁ విటమ్మా!యింటావంటా యెక్కడాలేదు. దిక్కుమాలిన చదువుచదివి మాపీకలుమీదికి తెచ్చావు దీనికేనా సమాధానం చెప్ప మన్నావు? బాగుంది లే లే'

'అమ్మా! నీవిట్లుకోపగించుకొనిన నాకేదిదిక్కు? నే నెవ్వరితోఁ జెప్పుకొందును? నన్ను దిక్కులేనిదానినిఁ జేయకుము. నీపాదములు పట్టుకొనెదను. నన్నురక్షింపుము. మాతండ్రిగారితోఁజెప్పియెట్టులైన నీవివాహమును నిలిపివేయింపుము. తల్లీ! పోనిమ్ము నాకువివాహమక్కరలేదు. కులములో మీకు వెలిగాకుండ సన్యాసినినై యెచ్చటికైనఁబోయి, హరినామ స్మరణఁ జేసికొనుచు జీవించెదను. అంతియె కాని అబ్బా! నే నానీచునిఁ బెండ్లాడ

లేను. అమ్మా! నన్నుఁ గన్నప్పుడు నీవొందిన దుర్భర ప్రసవవేదనకన్న నన్నుఁ గాపాడుట నీకుఁ గష్టము కాదు. నన్నూరక యేడిపింపకుము. నీకుమార్తె యింత రోదనము నొనర్చుచుండ నీకు శ్రేయస్కరము గాదు. నాయేడుపు వినినచోఁ గఠినపాషాణమైనఁ గరుఁగును. కన్నతల్లివయ్యు నీకు జాలిజనింపకున్నది అమ్మా! నేను మీకేమైన యపరాధముఁ జేసితినా? చేసినయెడల నందుకు మఱియొకశిక్ష సేయరాదా? ఈవివాహము నాసౌఖ్యముకొఱకే కదా? నాకిష్టములేని వానికి నన్నుఁ బెండ్లిఁజేసిన నాకు బలవన్మరణముతప్ప వేరేమి సౌఖ్యముండును? తల్లీ! నీకు వేయినమస్కారములు! నీహృదయమును కొంచెము మరల్చుకొనుము. నీకన్నకుమార్తె కష్టసుఖములఁ గొంచె మాలోచింపుము. పాపిష్టిసిగ్గుచే మీతో స్పష్టముగఁ జెప్పలేక యిదివర కనేక పర్యాయములు నాయభిప్రాయము మీకు వెల్లడించితిని; కాని మీరు లక్ష్యపెట్టలేదు. అమ్మా! నీకు జాలిపుట్టినచో నిప్పుడైన నేమిమించిపోయినది? నీ మాట యన్నచో మాతండ్రి శిరమున ధరియించును తల్లీ నీకుమార్తెనుకానే? నీవు నాకుఁ దల్లివికదా? నీ చేతులతో నన్నుఁ బలవంతముగఁ జంపివేయుదువా? నే నిట్లు రోదనము సేయుచుండుట నీకు సంతోషమా? నిద్రాహారములు లేక నే నిట్లుదుఃఖించుచుండ నీవుకాక నన్నెవ్వ రోదార్చెదరు తల్లీ? అయ్యో! కటికివానికిఁ బశువునమ్మునట్లు నన్నుఁ బండ్రెండుసందల కొకమూర్ఖునకా యమ్మెదవు? నీవు తొమ్మిది నెలలుమోసి కన్నకుమార్తెకన్న నీ కాధనమా యెక్కువ? తల్లీ! పోనిమ్ము. నీవు సెలవిచ్చినయెడల నే నెచ్చటికైన బారిపోయెదను? అందునకైన నంగీకరింపుము. అమ్మా! మాటాడవేల? నామొఱలు నీ చెవికెక్కలేదా? నేను నీకుమార్తెనుకానా? నీకును నాకును ఋణానుబంధము తీరిపోయినదా? నా సౌఖ్యములు నీ కక్కఱలేదా? నన్నీదుఃఖసముద్రమున ముంచివేయుటయే నీ యుద్దేశమా? అయ్యో! సర్వేశ్వరా! శరణు! శరణు—'

మంచం దిగుతావా? దిగవా? నోటికొచ్చినట్లూ పేల్తున్నావులే. నీకిలాంటి పోయేకాలం పుట్టిందేఁవే? చచ్చినట్లు పడుండక పెళ్లంటే ఘొల్లున

యేడుస్తారటే. మీనాన్న విన్నారంటే కమ్చీతో చెమ్డా లూడకొడ్తారు. ఇంటికొచ్చిన చుట్టాలంతా వింటే నీనోట్లో యేఁవిటి పెడతారు? దిక్కుమాలిన చదువు చదివావు. మమ్మల్నుద్ధరించడానికి! ఇంకాలేస్తావా? లేవ్వా? పోతులాగ మంచం మీఁంచి కదలవేఁ'

అని వీపుపైఁ గట్టిగ రెండు చరచి

'ఇలాతగుల్తే కాని నీకు బుద్ధిరాదు భడవా! చిన్ననోటికి పెద్దకూతలు. నీచదువు మండిపోనూ! శనిలాగ జతపడ్డావు'

అని పండ్లు పటపటఁ గొఱికి యామె లక్షణను రెక్కపట్టుకొని క్రిందికీడ్చెను. పాపము లక్షణ యూరక వెక్కివెక్కి యేడ్చుచుఁ దల్లి యొక్కత కమితాగ్రహమునొంది దుఃఖమును చాలించి యామెను రెప్పవాల్చక చూచుచు

'అమ్మా!—ఛీ! నీవు నా కింకెక్కడి యమ్మవు? నే నెక్కడి కుమార్తెను? పూర్వజన్మమునఁ జేసికొన్న పాప మనుభవించుటకై మూర్ఖులగు మీకడు పునఁ బుట్టితిని. తల్లివని నా కష్టసుఖములు నీతోఁ జెప్పితినిగాని నీవింతటి గొడ్రాలవని నే నెఱుఁగను. ఓసి దుష్టచిత్తా! నీవు నన్నేమిచేయుఁగలవు? నిర్మలమైన నా యంతరాత్మ మార్చుటకు నీకే కాదు నిన్నుఁబుట్టించిన బ్రహ్మదేవునకైన నశక్యము. నన్నొక మూర్ఖునకుఁ బెండ్లిచేసెదవా? అట్లైతే కాని మ్ము కలలోనైనఁ బాపచింతలేని యుత్తమకాంతనైనచో సర్వేశ్వరుఁడు వేంకటేశ హాతకునిబారినుండి తప్పించి యొట్లులైన నా హృదయేశ్వరునకు నన్నప్పగించుఁగాక. నన్నింత దుఃఖపెట్టిన మీయందఱికినిఁ దగిన ప్రాయశ్చిత్తము జరుగుఁగాక. ఇంకలెమ్ము. నేను సంతోషపూర్వకముగవచ్చి స్నానముఁజేసి, నేను మనసార వరించుకొనిన నామనోహరుని నాహృదయపీఠముననిల్పి వానిని స్మరించుకొనుచు నేడు నేను పెండ్లికూతు నయ్యెదను'

అని ధైర్యముగఁ బలికి లక్షణ వెంటనే మజ్జనమాడుటకుఁబోయెను. అహా! ఆమెధైర్యమును సాహసము నెంత కొనియాడఁగలము?

---

# ప్రకరణము—11.

## పెండ్లిముచ్చట.

తల్లితోఁ గలహించిన తరువాత లక్షుణ తనలో నేమి స్థిరపరచుకొనెనో కాని యప్పటినుండియు లేశమైనఁ గన్నీరుఁగార్పక చకచకలేచి యెవ్వరితోడను మాటాడక తల యంటించుకొని హాయిగా మజ్జన మాడెను. అప్పుడు సీతకూడవచ్చి యామె స్నానము సేయుచున్నంతసేపు నచ్చటనే యుండెను లక్షుణ తన మొగము వాల్చుకొని సీతను జూచి యేమో కనుసంజ్ఞలు చేయుచుండెను వారిరువురికి నప్పుడు జరిగిన సంజ్ఞల భావము వారికే తెలియవలయునుగాని యితరులు పోల్చుకొనలేరు. ఒక్కమారు మాత్రము లక్షుణ సీతనుజూచి 'సీతా! రామారావన్నయ్యగా రేమిచేయుచున్నారు.' అని మాత్ర మడిగెను. అందుకు సీత 'ఎవరో మోహనరావట అతనితో నేమో రహస్యముగ మాటాడుచున్నారు.' అని ప్రత్యుత్తర మిచ్చి యూరకుండెను. స్నానానంతరమున సహజలక్షణయగు లక్షుణ నామె తల్లి బంగారపు బొమ్మవలె నలంకరించినది. పలు విధములగు జలతారుమొగ్గలచే నలంకరింపఁబడి గులాబిరంగుగల బనారసు చీరఁగట్టి, ధగధగలాడు నల్లనిముఖమలు రైకఁదొడగి, మొలకు బంగారపుటొడ్డాణమును, మెడలోఁ గంటెయుఁ గాసులపేరునుధరించి, విశాలములై గండుతుమ్మెదల నీసడించుచు లక్ష్మీకళ లొలుకుచున్ననేత్రములకు మరింతవన్నె కలుగునట్లు సన్ననికాటుక వెట్టి, పున్నమ చంద్రునికన్న నెక్కుడుగఁ గలకలలాడు ముద్దుమోమునఁ జక్కని సిందూర తిలకమునిద్ది, కాలసర్పమువలె వెనుక మోకాళ్లవఱకును జీరాడు దీర్ఘకబరీభరంబును విరియఁబోసికొని, మూర్తీభవించిన మోహినీదేవతయో సాక్షాత్కరించిన లక్ష్మీదేవిచందమున మన లక్షుణ తన్నుఁజూచినవారి నందఱిని నిశ్చేష్టులఁ

చేసి మైమఱపుఁ గలిగించెనన్న నేమి యాశ్చర్యమున్నది? సహజ రూపలావణ్యాతిశయముచేతను, అంతకన్న నెక్కుడుగ సుగుణవిద్యాప్రభావము చేతను, మనలక్షణను వీక్షించి ఆబాలగోపాలము శాబాసనని వా రెవ్వరు? అయ్యో! మూర్ఖులగు నొక్క తలిదండ్రులకు మాత్ర మామె శత్రురాలైనది. దయాదాక్షిణ్యము లణుమాత్రమైన లేక, గొడ్డును గోసికొని బ్రతుకు కటికివాండ్రకన్నను గఠినచిత్తులై, పూర్వజన్మకర్మచే మనుష్యజన్మ మెత్తినను, పశువులకన్న జ్ఞానహీనులై మొద్దువలె నున్న యొక ద్విపాదపశువునకు, బాప మామెను కట్టిపెట్టుచున్నారు. లక్షణనుగూర్చి యెందఱెన్నివిధముల బోధించినను, పంతులుగారికది తలకెక్కలేదు. మూర్ఖుని చిత్తమును మార్చుటకుఁ దగిన సాధన మేమియో కనుఁగొన వలయునని బ్రహ్మ నేటివఱకును తలక్రిందుగఁ దపము సేయుచున్నాఁడని యొక కవీశ్వరుఁడు వ్రాసిన సంగతి యబద్ధముగాదు. ఇందుకు మనపంతులుగారే మనకుఁ బ్రత్యక్షసాక్షులు

ఆనాఁడు బంధువులెల్లరును లక్షణను పెండ్లికూతునుజేసిరి. తరువాత లక్షణ తన కిష్టదేవతయగు భవానీదేవికి సంపెంగపూవులతోఁ బూజఁజేసికొని, రాత్రి భోజనము లేనందున వెంటనే భుజించెను. ఆనాఁడు పంతులుగారు భార్యతోఁజెప్పి తమ కత్యంతప్రియమైన పిండివంటయగు 'బొబ్బట్లు' చేయించినారట. భోజనానంతరమున లక్షణ యెవ్వరితోడను మాటలాడక తిన్నగఁ దనగదిలోనికిఁబోయి గదితలుపులు లోన గడియవేసికొని యందొక ప్రక్క గోడనున్న తనహృదయప్రియుఁడగు మాధవరావు ఛాయాప్రతిమను దీసి, మంచముపైఁ గూర్చుండి దానిని తనముందిడుకొని, తన మెడలో నున్న మల్లెపూవులదండతీసి యాఛాయాప్రతిమకు వ్రేలాడఁగట్టి యించుక కన్నీరుఁగార్చుచు నిట్లు తనలో ననుకొనఁ జొచ్చెను.

'మాధవా! నేను పరాధీన నైతినని నీవు భావింపకుము. నామనోధనమును నీకే యర్పించితిని. నాయందు హక్కుఁగలవాఁడవు నీవే! నీతో సకల సౌఖ్యముల ననుభవించుభాగ్యము నాకులేకున్నను, నిరంతరమును నిన్నే

స్మరించుకొనుచు నేను బ్రదుకఁ దలంచిన కొలఁదిదినములలోఁ బరపురుషునిఁ గన్నెత్తియైనఁ జూడనని ధృఢముగానమ్ముము. ఈజన్మమున నాకంతభాగ్యములేకున్నను, ముందుజన్మమునైన నేను నీకే యిల్లాలినై నీకుఁ బరిచర్యఁ జేసెదను. అయ్యో! నన్ను వేంకటేశమునకిచ్చి మాతల్లిదండ్రులు పెండ్లిఁజేసినచో నీకెంతయాగ్రహమువచ్చునోకదా? ప్రాణేశ్వరా ! నేనేమిచేయఁగలను. నేనస్వతంత్రురాలనని నీవెఱుఁగుదువుకదా? నేనేకాదు. ఎందఱెన్ని విఘ్నములఁ బ్రయత్నించినను, ఈవివాహగండము నాకుఁ దప్పునట్లగపడదు. నన్నుక్షమింపుము. ఎంతో ఘోరమైన పాపముఁజేసి యిట్టి తల్లిదండ్రులకడుపునఁ బుట్టితిని. పూర్వజన్మశత్రుత్వము నీవిధముగ వారు నాయెడలఁ దీర్చుకొనుచుండిరి. నాచక్కఁదనమును, నావిద్యయు గంగలోఁగలిపి నన్ను మహాసముద్రమునఁ బడవేయుచున్నారు. హా! మాధవా! నీవును లక్షుణయు నింకనేకాంతముగ మాటాడుకొనుటకు వీలులేదుకదా? వీలున్నను, ఉరిత్రాడువలె మెడలో నొకమంగళసూత్రముఁ గట్టుకొని నీమొగము నే నెట్లు చూడఁగలను? పూర్వపరిచయమున సిగ్గువిడిచి నీముందరికివచ్చి నిలిచిన నీవు నన్నుఁ బలుకరించెదవో లేదో? నిన్ను నమ్మించి మోసపుచ్చినందున నప్పుడు నీకుఁగూడ నేను పగదాన నయ్యెదను. కాఁబోలు? అయ్యో! అప్పుడు నాకింక దిక్కెవ్వరు? ప్రాణేశ్వరా! నేనే పాపము నెఱుఁగని నిరపరాధినిసుమా ! నన్ను మన్నింపక తప్పదు.................అయ్యో! మాధవా! నీవు సదయహృదయుఁడవు. నేనే పాపాత్మురాలను. బలవంతముగఁ బ్రాణత్యాగ మొనర్చుకొందు నేమోయని నీవానాడు నాచేఁ బ్రమాణముఁజేయించితివి; కాని లేకున్నచో నేనిదివఱకే హాయిగ నీలోకమును విడిచియుందునుగదా ? ఈదుర్భరసంతాపదుస్థితి నాకులేకుండునుగదా? ఆపాపిష్టిప్రమాణము నాచే నేలచేయించితివి? నీకుదివ్యదృష్టియున్నది కాఁబోలు...................................'

అని యింకను లక్షుణ ఆఛాయాప్రతిమనుజూచి పలుభంగుల విలపించెను. ఇట్లు క్రమక్రమముగ వారముదినములు గడచినందున, పెండ్లిమూహూ

త్రము వచ్చినది. లక్ష్మీవారమునా డుదయము నాలుగుగంటలకు వివాహలగ్నమని, యిదివరకే సిద్ధాంతు లేర్పఱిచియుంచినందున భీమశంకరము గారు తొలినాఁడే కలసిన ప్రయత్న మంతయుఁ జేయించిరి. ఆనాటిరాత్రి కూడఁ బూర్వమువలెనే లక్షణ భోజనమొనర్చుట మానివేసి విచారించుచుఁ బరుండెను. 'అయ్యో! తెల్లవారుసరికి నేనొక నీచుని యాధీనమయ్యెదనుగదా? సర్వేశ్వరా! నాకేమిగతిఁ జూపించితివి? పెద్దపులివచ్చి మీదఁబడుచున్నను నీకు జాలిజనింపకున్న దేల? రేపుదయమునఁ బెండ్లిపీటపై నేనామూర్ఖుని ప్రక్క నెట్లుకూర్చుండఁగలను? వానికొంగునకు నాచీరకొంగు ముడివేసినచో నే నెట్లులోర్వఁగలను? ఆదుష్టుఁడు నాపాణితలము గ్రహించిన నాప్రాణము లెట్లు ధరింపఁగలను? నామెడలోఁ జేయివెట్టి యురిత్రాడువలె మంగళసూత్రము నాపాపాత్ముఁడు కట్టినప్పుడు నే నెట్లు సహింపఁగలను? తలుపులవద్దనిల్చినప్పు డాకఠినచిత్తుఁడు నన్నెత్తుకొనుట కెట్టులంగీకరింపఁగలను? మగనిపేరు చెప్పమని అమ్మలక్కలు నన్నడిగినచో నాచండాలుని నామాక్షరములు నే నెట్లులుచ్చరింపఁగలను? పూలబంతుల యాటలో నాకరుకుతురకతో నే నెట్లు సరాల్యాటలాడఁగలను? బువ్వముబంతులాడునప్పుడు నేనాయధముని యెంచ్ఛిష్ట మెట్లు భుజింపఁగలను? అయ్యయ్యో! వివాహములో నీ నీచాచారములన్నియు నాకొఱకే పుట్టినవి కాఁబోలు? హా! మాధవా నన్ను రక్షింపుము'

అని యేడ్చియేడ్చి నాటిరాత్రి లక్షణ శరీరముపై స్మృతిలేకుండ మూర్ఛపోయెను. ఇంతలోఁ దెల్లవారుజామైనది. భీమశంకరముగారి యేర్పాటు ప్రకారము మంగలివాండ్రు వచ్చి వీథియరుగులపైఁ గూర్చుండి మంగళధ్వనులు మ్రోయించుచుండిరి. బంధువులెల్లరును లేచి తమతమకార్యములయందు మగ్నులై యూరక అటునిటుఁ దిరుగుచుండిరి. పెండ్లిపురోహితుఁడగు రామావధాని లగ్నము మించిపోవుచున్నదని వారందఱినిఁ దొందరపెట్టుచుండెను. వంటబ్రాహ్మణులు కాయగూరలు మొదలగు సామగ్రి త్వరలో నందకుండనున్నవని కేకలు వేయుచుండిరి. ఒకరిమాట యొకరికిఁ బొందక వచ్చిన

స్త్రీలందఱుఁదమలోనెందుకో వాదించుకొనుచుండిరి. బ్రాహ్మణు లగ్నిహోత్రముమ సిద్ధముజేయుటకుఁ గఱ్ఱలు చాలవని విసుగుకొనుచుండిరి. ఇట్టి యల్లకల్లోలమున నాసమూహములోఁ బెండ్లికూతురు మాత్రము వారికెవ్వరికినిఁ గానరాలేదు. 'అయ్యో! పెళ్లికూతురట్టా! అమ్మాయీ! పెండ్లికూతుర్ని త్వరగా స్నానంచేయించి తీసుకొనిరా' అని రామావధానిగారు గట్టిగ కేకలువేసి పంతులుగారి భార్యతో జెప్పిరి. తోడనే యామె పరుగుపరుగున గదిలోనికిఁ బరుగెత్తి గాఢనిద్రయం దొడ లెఱుఁగక పడియున్న లక్ష్మణవీపుపై రెండుచఱచి 'ఔనే! పిల్లా! ఇదేఁవిచోద్యఁవే? ఇదంతా యెవళ్లపెళ్లనుకొన్నావే? అని చెయ్యిబట్టుకొని లేవఁదీయ నేకారణముననో లక్ష్మణ మాటాడలేక మూల్గనారంభించెను. అందుచేత ననుమానించి యామె లక్ష్మణయొంటిపైఁ జేయివైచి చూచినతోడనే నిర్ఘాంతపడి గుండెలు బాదుకొనుచు నీవలకువచ్చి పంచల చాపు లుత్తరించుచున్న భీమశంకరముగారినిఁ జూచి,

'ఏఁవండో! పిల్లసంగతి విన్నారా?'

'ఏఁవి? ఏఁవి? యేఁవైంది?'

'ఏఁవైందేఁవిటి? చలిజ్వరం బళ్లతో నచ్చినట్టొచ్చింది. చెయ్యిపెట్టడానికి శక్యంకాకుండా ఒళ్లల్లా అగ్నిహోత్రంలాగుంది.'

'అయ్యో! ఇదేఁవి గ్రహచారఁవే? పద పద'

అని భీమశంకరముగారును, ఆయన భార్యయు గదిలోనికిఁబోయిరి. లక్ష్మణ మాటయు మతిలేకుండ జ్వరాతిశయముచేఁ బడియుండెను. కుమార్తెయవస్థఁజూచి పంతులుగారు మాటాడలేక చిత్రప్రతిమవలెనట్టులే నిలిచిపోయిరి. బంధువులును పురోహితులు మొదలగువారందఱు నాసంగతి వినినతోడనే యెవరిపనులు వారుమానుకొని, లక్ష్మణ మంచముచుట్టును మూగి విచారించుచుండిరి. మంగలివాండ్రను వాయింపవద్దని పంతులుగారు సెలవిచ్చి వెంటనే వైద్యునకుఁ గబురంపిరి. ఒకచేత మందులడబ్బియు, నొకచేత చేపాటికఱ్ఱయు నందుకొని విశ్వనాథము వెంటనే భీమశంకరముగారియింటికిఁ

బోయెను. పంతులుగారు, ఆయనను మంచముదగ్గఱకుఁ దీసికొనిపోయిరి. విశ్వనాథము లక్షణచేయి పట్టుకొని నాడిపరీక్షింప నారంభించెను. అప్పుడు భీమశంకరముగారు వానినిఁ జూచి,

'విశ్వనాథంగారూ! ఒంట్లం యెలావుంది? మా గ్రహచారం యేలా వుందో చూశారా?'

'జ్వరం వుండవలసినంత తీవ్రంగావుంది. అందుకు సందేహంలేదు. అందుచేత ఇంతలో విడుస్తుందని నిష్కర్షంగాచెప్పలేను.'

'చిత్తం అయితే యిప్పు డేఁవి చికిత్స చేస్తారు?'

'ఇప్పుడేఁవీచెయ్యాలేను. సాయంకాలంవచ్చి మళ్లా చెయ్యిచూసి మందిస్తాను. వివాహానికి మరో లగ్గం పెట్టించండి. ఆటంకంవస్తే యేంచేస్తాం?'

'ఆమాటలువిని పంతులుగారిభార్య ముందుకు వచ్చి, 'విశ్వనాథంగారూ! ఒకమాత్ర పడేసి నీళ్లుపోశేస్తె యేఁవిటవుతుంది? యెలాగో కార్యం చెయ్యాలికాని ఆపేస్తాఁవా'

'అమ్మయ్యో! పిల్లని చంపేస్తారా యేఁవిటి? ఇవాళ కాకపోతే మరో నాడు పెళ్లవుతుంది కాని వుండిపోతుందటమ్మా'

అప్పుడు పంతులుగారు రామావధానిగారిని దగ్గరకుఁబిలచి,

'అవధాన్లుగారూ! మీరేఁవంటారు?'

'నేనేఁవంటాను? ఈలగ్గం తప్పిపోతే మళ్లా యింతలో మూర్తాల్లేవు. ఏప్రకారం మీకిష్టఁవో ఆప్రకారంచెయ్యండి'

'గట్టిచిక్కు వచ్చిందండీ! ఈడుతప్పినపిల్ల. ఏంకొంపమునుగుతుందో యని భయపడుతున్నాను. వారంరోజుల్లోగా యెక్కడా మూర్తం లేఁదేవి?'

'వారంరోజులుకాదు. ఇరవైరోజులవరకు మరి వీల్లేదు. నేనొక యుపాయం చెప్తాను. అట్లా చేస్తారా?'

'చెప్పండి మీసెల వెలాగో అలాగే చేస్తాను'

'ఈవాళరాత్రి తొమ్మిదిగంటల ఇరవైయైదు మినిట్లకు ఒకమూర్తం వుంది. నామాటవిని యేకరాత్రివివాహం చేయించేస్తే—'

'అది బాగుందండీ! మంచివుపాయం చెప్పారు. కాని రాత్రికి కూడా పూష్టం తగ్గకపోతే?'

'ఏఁవిటి భ్రష్టాండం చేస్తారు? పసుపునీళ్లు జల్లితే ఒకపక్షంగా స్నానంచేసినట్టే'

'ఔను. కాని పిల్ల పెళ్లిపీటమీద కూచోగల్దాయని—'

'కూచోలేకపోతే పక్కనే పడుకుంటుంది మీకెందుకూ ఏలాగో వోలాగు క్రియ జరిపించేస్తాను కదూ!'

సిద్ధాంతిగారు చెప్పినరీతిగ నాటిరాత్రి ఏకరాత్రి వివాహముచేయుటకు పంతులుగారు నిశ్చయించిరి ప్రతిక్షణమును పంతులుగారు కుమార్తె చేయిఁజూచుచు వచ్చిరి. కాని పట్టినజ్వరము పట్టినట్టులేయుండెను. సాయంకాలము నాలుగుగంటలసమాత్రము రవంత తగ్గినట్లు కనఁబడినందునపంతులుగారు వైద్యునిఁ బిలిపించి మరలఁ జేయిచూపించిరి. విశ్వనాధము డబ్బిలోని యొకమాత్రతీసి అల్లపురసము ననుపానముగాఁజేసి యామాత్ర లక్షణచేమింగించిరి. వైద్యుఁడు చెప్పినట్లు పంతులుగారిభార్య కొంచెము మిరియాలచారు నన్నమునుపిసిగి లక్షణకుఁబెట్టెను; గాని లక్షణవెంటనే రెండుమూఁడుసారు వమనముఁ జేసికొని తెలివిలేకుండ మరలఁ బడిపోయెను అంతజ్వరమున్నను కఠినచిత్తులగు పంతులుగారు నాటిరాత్రి వివాహము తప్పింపలేదు. ఒడలెఱుఁగకపడియున్న లక్షణను బలవంతముగ వేంకటేశ్వరస్వామివారి యాలయములోనికి మోసికొనిపోయి పెండ్లిపీటపైఁ బరుండబెట్టించి వివాహామారంభించిరి లేశమైన శరీరముపై స్మృతిలేక పడియున్న లక్షణమెడలో వేంకటేశము నాటిరాత్రి మంగళసూత్రముగట్టెను.సదస్యమును శేషహోమమును ముగించుసరికిఁ దెల్లవారినది. వివాహము పూర్తియైనతరువాత భీమశంకరముగారు బంధువులతో నాలయములోనుండి యింటికిబయలుదేరిరి. పెండ్లికొడుకగు వేంకటేశము పసుపుబట్టలతో మామగారియింటికి వచ్చుసరికి, అచ్చట కోర్టుబంట్రోతులు నిలువఁబడియుండి వేంకటేశము వచ్చినతోడనే వానినిఁ బట్టుకొని 'అయ్యా! మీకు ఎరస్టువారంటు వచ్చింది కోర్టుకు దయచెయ్యండి'. అని వానిచేయిఁబట్టుకొని నిర్బంధింపసాగిరి.

# ప్రకరణము—12.

---

## శుభవార్త.

వెండి బిళ్ళలుగల రెట్టుని షవాలీలు మెడలో వైచికొని కోర్టు బంట్రోతులు వేంకటేశమును చేయిబట్టుకొని లాగుచుండ నా పెండ్లికొడుకు వారినిఁ గసరుచుఁ దనశూరత్వ మచ్చట వెల్లడింప నారంభించెను. క్రమక్రమముగ నా ఘర్షణ యెక్కుడైనందున దారిఁబోవు వారందఱు నచ్చట గుమిఁగూడ నారంభించిరి. లింగముఁ గట్టినతోడనే పిడుగుపడినట్లు, ఈ యసందర్భపు వివాహముఁ జేసినతక్షణముననే భీమశంకరముగారికి దగిన ప్రాయశ్చిత్త మారంభించినదని చూచినవారెల్ల నవ్వుకొనుచుఁ దమలో గుసగుసలాడుకొనుచుండిరి. తనకు ఎరస్టువారంటు వచ్చినందుకుఁ గారణ మేమో యిప్పటికిని వేంకటేశమునకుఁ దెలియదు. పెండ్లికి వచ్చిన బంధువులెల్లరు [illegible] కొడుకునకు సంభవించినగతిఁ జూచి తల్లడపడ నారంభించిరి. కొంత[illegible]నకుఁ బంతులుగారు లోపలినుండి వచ్చి యా యల్లకల్లోలమును జూచి, తత్తరపడి యా సమూహములోఁ జొరఁబడి బంట్రోతును జూచి,

'ఎవరోయిమీరు? సంగతేఁవిటో చెప్పండి? మావాఁ డేఁవిచేశాడు?'

'అయ్యా! మోహనరావుపంతులోరికి ఈబాబు 350 రూ॥ ఇయ్యాలట. ఎంతడిగినా యియ్యకపోతే యెరెస్టువారెంటుచేయించినారు. కోర్టువారి యాగ్గెప్పకారం మాఁవొచ్చినాం. కోర్టుకు రమ్మంటే యీయయ్య దమాయిస్తున్నాఁడు'

'వాడికేఁవి తెల్లుసునోయి కుఱ్ఱవాడు. సరే మీరుపదండి నేనుకూడా కోర్టుకువచ్చి జామీనుపడి విడిపిస్తాను.'

'సి త్తం. ఈపెళ్లికొడుకునుగూడా తీసుకోరావాల. యిడిసిపెట్టిరెళ్లి పోడానికి మాకీల్లేదు.'

'అలాగేవస్తాడోయి. ఇదేఁవిటి ? ఎప్పుడూ కోర్టుమొఖంయెరగని వాడికి చెప్పినట్టు చెప్తున్నావు?'

అని పంతులుగారు పైకి నిబ్బరముగ మాటలాడుచు లోన వల్లుఁడు చేసిన ప్రతాపమున కూరక విచారించుచు, విసుగుకొనుచు, నింటిలోనికిఁ బోయి కైనుచితవ స్త్రములఁదాల్చి వేంకటేశమును వెంటనిడికొని తిన్నగ నా బంట్రోతులతోఁ గోర్టునకేగి, అచ్చట వేంకటేశమునకుఁ దాను జామీనుపడి నట్లు సంతకముజేసి, అల్లుని విడిపించి యింటికిఁదీసికొనివచ్చిరి. ఇంటికి వచ్చినతరువాత పంతులుగారు సుగుణాభిరాముఁడగు వేంకటేశమునుపిలిచి, మొగముఁ జిట్లించుకొనుచు,

'ఏఁవిరా? వేంకటేశా! మోహన్రావుదగ్గిర మూడువందలయాభై రూపా యిలు నువ్వెందుకుపుచ్చుకొన్నావు?'

'నన్నేఁవిచెయ్యమన్నారు ? బలవంతముగా నాకంటకట్టాడు. వద్దు వద్దని యెంతచెప్పినా విన్నాడుకాడు.'

'ఉట్టినే నీకంతసొ మ్మెందుకిస్తాడు? ఏఁవిటి జరిగిందో సరీగాచెప్పు. యిలాంటి కుక్క జట్టీలు తెచ్చుకోవద్దని నీకెన్నిమాట్లుచెప్పాను?'

'ఆవేళపొద్దున్న వివాహసంబంధం గురించి మీరూ నేను మాటాడు కొన్న తరువాత నేనింటికి నాఖర్నాని పోతుంటే మోహన్రావు నన్నుపిల్చాడు ఎందుకో అనుకొని నేను వెళ్లాను. అప్పుడు నన్ను కూర్చోపెట్టి పెళ్లి సంగతులన్నిఅడిగితేచెప్పాను. సందర్భానుసారంగా వెయ్యిరూపాయిలు నా వద్దవున్నాయనిన్నీ, యింకా రెండువందలు చాలవనిన్నీ నేను చెప్పేసరికి గబుక్కున నాతడు గదిలోనికిపోయి 350 రూ॥లు లెక్కపెట్టి తెచ్చి పుచ్చుకోవాలని బలవంతంపెట్టాడు. ఆఖరలేదయ్యా నాలుగు రోజుల్లో

నానిస్తుసొమ్ము నాకుదొరుకుతుందని యెంతచెప్పినా వినకుండా బలవంతంగా నాచేత ముక్కరాయించుకొని ఆసొమ్ము నాకంటకట్టేడు.'

'సరే! పద. మోహన్రావు యెలాంటిపెద్దమనిషో కనుక్కుంటాను.'

'అని మొగము ముడుచుకొని భీమశంకరంగారు తటాలునలేచి మోహనరావుగారింటికి బయలుదేరిరి. వేంకటేశముకూడ నాయనవెంటనే మౌనముధరించి బయలుదేరెను. పంతులుగారు పోవుసరికి మోహనరావుగారు చావడిలోఁ గూర్చుండి యేదోపుస్తకముఁ జదువుకొనుచుండిరి. భీమశంకరముగారినిఁ జూచినతోడనే మోహనరావు తటాలున కుర్చీమీదనుండిలేచి చేతులు జోడించి 'ఏఁవండోపంతులుగారు? నమోన్నమః. ఏఁవిలాదయచేశారు? రండికూర్చోండి. అదుగో! పెళ్లికొడుక్కూడా వచ్చాడే? ఏఁవి నాఅదృష్టం?' అని నవ్వుచుఁ బలుకపంతులుగారచ్చట కుర్చీమీదఁ గూర్చుండి'

'మోహనరావుగారూ! మీదర్శనానికి రావలసివచ్చే వచ్చాను. మీహుకుం మమ్మిలాగరప్పించింది.'

'అబ్బబ్బా! అలాసెలవివ్వడంధర్మంవా? మీరు పెద్దలుమావల్ల యేఁమే నాలోపాలోపాలుంటే క్షమించాలి.'

'మోహనరావుగారూ! మీరుకూడా కూచోండి కొంచెంమాటాడాలి'

'చిత్తం చిత్తం సెలవివ్వండి.'

'మావాడు మీకివ్వవలసినసొమ్మెంత?'

'మూడువందలయాభై రూపాయిలు'

'ఎన్నాళ్లకిందటయిచ్చారు?'

'నేటికి రమారమి యిరవైరోజులవుతుంది.'

'ఎందుకోసం యిచ్చారు?'

'పెళ్లిచేసుకుంటాననిన్నీ మూడువందలరూపాయిలు చాలవనిన్నీ శిస్తులురాగానే నాలుగు రోజుల్లో యిచ్చేస్తాననిన్నీ నన్ను బలవంతంపెడితే నేనిచ్చాను.'

'మీరే బలవంతంగా సొమ్ము కట్టిపెట్టారనిచెప్తున్నాడే'

ఆమాటలకు మోహనరావుగారు నవ్వి

'ఏమండోయి వేంకటేశంగారూ! మాటాడరేఁవి? యీలా నావేపు చూడండి. నేను బలవంతంగా మీకు సొమ్ము కట్టిపెట్టేనని మీమాఁవగారితో చెప్పారా? ఎంతసాహసమయ్యా? ఆవేళ మీరు నన్ను బతిమాలుకున్నదంతా మరిచిపోయారేఁవిటి?'

అని పంతులుగారినిఁజూచి

'పంతులుగారూ? ఈమాత్రంలో అబద్ధంఆడడం నాకేఁవి జరుగురు? ఎవళ్లేనా బలవంతంపెట్టి ఋణంపుచ్చుకోమ్మంటారా? మీరే ఆలోచించండి. ఇది కాక మూడువందలు ఋణం యిస్తే మూడువందలయాభైకి ముక్క రాసిస్తానని అవసరంకొద్దీ నన్ను బలవంతంపెడితే నేనిచ్చాను. పోనీయండి. నేనే బలవంతంపెట్టి సొమ్మిచ్చాననేకట్టండి. మూడువందలు రూపాయిలు పుచ్చుకొని మూడువందలయాభై రూపాయిలకెలా ముక్క రాసిస్తాడు?'

అదివిని పంతులుగారాశ్చర్యపడి తమ ముద్దులయల్లుని సుగుణములకు సంతసించి

'వేంకటేశా! నీవుపుచ్చుకొన్నసొమ్ము మూడువందలేనా?'

అనియడుగ వేంకటేశము మాటాడక మౌనముద్రవహించి యూరకుండెను. అప్పుడు పంతులుగారు వానినిఁజూచి విసుగుకొని

'మోహనరావుగారూ! జరిగిందేదో జరిగిపోయింది. మూడువందలిచ్చినట్టు మీరే చెప్తుతున్నారు. వడ్డీతోకూడా ఆమూడువందలిచ్చేస్తాను. కోర్టులో వారంటు తీయించేయండి'

'మీరలాఅండం ధర్మంకాదు. ఈయాభైరూపాయిలకూ ఆశపడే ఎంతో ఇబ్బందిలో వున్నప్పటికిన్ని యింట్లో ఆడవాళ్లచే తిట్టుతిని సొమ్మిచ్చాను. వడ్డీతోకూడా 350 రూ॥కి ఒకదమ్మిడీ తక్కువైనా నేను పుచ్చుకోను. క్షమించండి.'

'మోహనరావుగారూ! మనం స్నేహితులం. నామాట కొంచెమన్నించండి. మావాడు తెలివితక్కువపనిచేశాడు. సొమ్ము పుచ్చుకొని యిరవైరోజులుకన్నా యెక్కువ కాలేదు. అన్యాయంగా పుచ్చుకోడం మీక్కూడా జయంకాదు.'

'నే నన్యాయంగా పుచ్చుకోలేదు. ఈ విషయంలో మీరు మళ్లామళ్లా నన్ను మొఖమాటం పెట్టకండి'

'పోనియ్యండి వడ్డీయేనా వదిలేస్తారా'

'ఒక దమ్మిడీయేనా వదల్డానికి వీల్లేదు'

పంతులుగా రెంతప్రార్థించినను మోహనరావుగారొక కాసైన విడువనని పంతముఁ బట్టియుండిరి. అందుచేఁ గడకు విసిగి భీమశంకరముగారు లెక్కగట్టి వడ్డీతోకూడ 350 రూ॥లును మోహనరావుగారికిఁ జెల్లించుటకు నిశ్చయించుకొనిరి. 'వెంకటేశా! చాల్చాలు! మంచిపని చేశావు. ఇంటికివెళ్లి నే నిమ్మన్నానని మీ యత్తనడిగి సొమ్ము పట్రా!' అని పంతులుగారు అల్లుని చెవిలో రహస్యముగఁ జెప్పి పంపివేసిరి. వేంకటేశ మింటికిఁబోయి కొన్ని నిముసములలో సొమ్ముఁగైకొని మరల నచ్చటికి వచ్చెను. పంతులుగారు 350 రు॥ చిల్లరయు మోహనరావుగారికిఁ జెల్లించి రసీదు పుచ్చుకొని యింటికివచ్చిరి. వేంకటేశముమాత్రము మరల నత్తవారింటికి రాక యేకారణముననో మార్గమధ్యముననే మామగారివద్ద సెలవు బుచ్చుకొని దనయింటికిఁ బోయెను. పంతులుగారింటికిరాగానే ఆయన భార్య యెదురుగవచ్చి.

'ఏఁవైంది? సొమ్ము చెల్లించేశారా?'

'ఆహా! తప్పుతుందా? వడ్డీతోకూడా మూడువందల యాభైరూపాయిలకూ ఒకదమ్మిడీయేనా తగ్గించకుండా పుచ్చుకొన్నాఁడు.'

'అయితే నాలుగువందలు రూపాయి లిమ్మని యెందుకు కబురంపించారు?'

'నేను నాలుగువందలిమ్మని చెప్పలేదే? సరిగా లెఖ్ఖపెట్టి మూడువం
దలయాభైయైదు రూపాయిలు తెమ్మనిచెప్పేను. నాచేతికి అంతే యిచ్చాడు'

'అయ్యో! అయ్యో! ఇదేం పాపఁవమ్మా? ఇప్పటికిప్పుడే యబద్ధఁవా?
నలభైయైదురూపాయిలు యేంచేసినట్టు? వాడేడీ?'

'ఏఁవో? యేంచేశాడో? వాళ్లమ్మ రమ్మన్నాదనిచెప్పి యింటికి వెళి
పోయాడు. ఆసొమ్ము పట్టుకు పోయుంటాడు'

'ఇదేఁవిటమ్మా? యిలాటివాఁడైపోయాడు?'

భీమశంకరముగారు వేంకటేశమిచ్చిన కన్యాశుల్కము పంద్రెండు
వందలలో నాలుగువందలీవిధముగా ఖర్చుపెట్టి, ఆసొమ్మున కల్లువద్ద నోటు
వ్రాయించుకొని పుచ్చుకొనిరి. మహానుభావుఁడైన వేంకటేశము సుగుణ
ములు పంతులుగారి కిప్పుడిప్పుడే బోధపడుచున్నవి.

జ్వరాతిశయముచే శరీరముపై లేశమైన స్మృతిలేక పడియున్నందున
నాటిరాత్రి లక్ష్మణ తనకు వివాహమైనట్టులే యెఱుఁగదు. ఆనాటిరాత్రి
తెల్లవారువరకును, పలువరించుటయు, వాంతిఁజేసికొనుటయుఁదక్క లేచికూ
ర్చుండుటకైన నామెకు వీలులేకపోయెను. ఈడువచ్చిన పిల్లయని పంతు
లుగారు పంతముపట్టి అప్పువారి కెనుపోతును బలియిచ్చినట్లు ఆమెను వేంక
టేశమునకుఁగట్టిరి ఆమరునాడు సాయంకాలమువరకును జ్వరము తగ్గకుండి
నందున నంతవరకును లక్ష్మణ ఆహారముఁ గైకొనలేదు. అప్పటికి జ్వరబాధ
కొంచెము తగ్గినందునఁ దెలివివచ్చి, లక్ష్మణ తనమెడలోని మంగళసూత్ర
మును జూచికొని కన్నీరు వరదలైపారునట్లు పాపము తనలోఁదానె కొంత
వరకేడ్చెను; కాని మొదటినుంచియు నామెకుఁ బ్రాణసమానముగ మెలఁగు
చుండినసీత, ఆమెను లేశమైన విచారింపనీయక ధైర్యముఁజెప్పుచు నోదా
ర్చుచుండెను. దైవానుగ్రహముచేత నప్పటినుండియు లక్ష్మణకు మరల జ్వర
మురాలేదు. క్రమక్రమముగ పథ్యము హితవగుచున్నందున నామెకుఁ గొం
తబలము కలిగినదని చెప్పవచ్చును. విశ్వనాథము తగిన యౌషధమునిచ్చి
వారము దినములలో లక్ష్మణను యథాప్రకారముగఁ జేసెను. సీత నిరంతర

మును లక్షణను తనయొద్దనే యుంచుకొని యామెకు ధైర్యముకలుగు కథలు చెప్పుచు మనోగత విచారమును తొలంగించుటకుఁ బ్రయత్నించుచుండెను. మాధవరావు ప్రసంగము వచ్చినప్పుడెల్ల లక్షణ యాసంగతులచేఁదనమనసుఁ గలత పెట్టవలదని బ్రతిమాలుకొనుచుండెను. వివాహమైన తరువాత జరిగిన వేంకటేశము చరిత్రవిని యేకారణముననో మన లక్షణ తనవిచారమంతయు విడిచి చిరునవ్వునవ్వ నారంభించెను పాపమాబాలిక తనహృదయమును గఠిన పాషాణమొనర్చుకొనెను కాఁబోలు? లక్షణ తానొంటరిగఁగూర్చుండవలసి వచ్చినప్పుడు తనమనసు నన్యవిచారములలోఁ బెట్టక, భవానీదేవిని స్తుతించుచుఁ బద్యముల నల్లుకొనుచుండెను. వివాహమైనప్పటినుండియు నామె ప్రవర్తనము పూర్ణముగ మారిపోయినదని యందఱు ననుకొనుచుండిరి భోజనముచేయునప్పుడుకూడఁ దనకు వలసినపదార్థము నడిగి వేయించుకొనక తల్లి వడ్డించిన యెడలఁ దినుటయు, లేనియెడల మానివేయుటయుఁ జేయుచుండెను. ఆమెవదన మెప్పుడుచూచినను దీర్ఘాలోచనమున నున్నట్టులే కనఁబడుచుండెను.

అట్లు మాసముదినములు గడచెను. ఒకనాఁ డుదయమున మామూలు ప్రకారము పంతులుగారు చీకటియుండగానే లేచి, యంగవస్త్రమును గట్టుకొని చేతనొక కంచుచెంబుఁ గైకొని ప్రాతఃకాలస్నానముఁ జేయుటకై రామసాగరమునకు బయలుదేరిరి. పంతులుగారు చెఱువులోస్నానముఁజేసి, రామలింగేశ్వరాలయములోనికిఁబోయి, యచ్చటఁ దమశరీరమును విబూదితో నలంకరించుకొని, లింగేశ్వరున కభిషేకముఁజేసి, మరల నింటికి బయలుదేరి వచ్చుచుండిరి. భీమశంకరముగారి భార్యయు, నాయన రెండవకుమార్తెయు మఱికొందఱమ్మలక్కలును అరుగులమీద నిలుచఁబడి పంతులుగారికొఱకెదురుచూచుచుండిరి. భీమశంకరముగారు దూరమునుండియే వారందరినిఁజూచి కారణమేమో తెలియక, వేంకటేశము మరల నేదైనజట్టీ తెచ్చుకొనియుండునని లోలో ననుకొనుచు, గృహమును సమీపించిరి దూరమునుండియే పంతులుగారిభార్య సంతోషమున నాయనను జూచి 'ఏఁవండో! శుభవార్త విన్నారా! మనలక్షణ పెద్దమనిషయింది' అనిగట్టిగఁజెప్పెను. ఆసంగతివిని పంతులుగారు మహానందముతోఁ గేకవేసి తటాలున గుమ్మముదాటి వారందఱితో లోనికిబోయిరి.

## ప్రకరణము—13.

### వాచీ-లవండరుబుడ్డి-పట్టురుమాలు-మల్లుతాను.

పంతులుగారు వెంటనే రామావధానిగారిని బిలిపించి, నక్షత్రమును చూపించిరి. రామావధాని పంచాంగమును జూచి, ముహూర్తము ప్రశస్తమైనదే కాని కొంచెము గ్రహశాంతి యున్నదని మాత్రము చెప్పెను.

'అవధాన్లుగారూ! ఏపాటిశాంతి వుంటుంది?'

'అబ్బే! బెడద యేఁవీ లేదండీ! అంతా రెండుగంటలుపని. అల్లుడు వూళ్లోనే వున్నాడు. కార్యంకూడా చేసేస్తే బాగుంటుంది'

'మా ఆవిడకూడా అలాగే దెబ్బలాడుతున్నాది. కానిఆషాఢమాసం దాకా వుంచేయాలని అనుకుంటున్నాను'

'ఎందుకండీ! కార్యంలో కార్యం అయిపోతే మంచిది. ఇదికాక ఆషాఢమాసంలో మూర్తాలు పెట్టరు. అదిశూన్యమాసం కూడానున్నూ.'

అని సంభాషించి పంతులుగారు కార్యముఁ జేయుటకేనిశ్చయించుకొనిరి. పంతులుగారు వేంకటేశమును పిలిపించిశుభవార్తఁ జెప్పిరి. ఆయన భార్య తన రెండవ కుమార్తెచే వేంకటేశముపైని వసంతముఁ జల్లించెను. కొంతసేపునకుపంతులుగారి భార్యయుఁ జిన్నకూఁతురును, క్రొత్తబట్టలఁ గట్టుకొని, ముత్తైదువులను పిలుచుటకు బయలుదేరిరి. ముత్తైదువలను పిల్చుటకుఁ దనవెంట సీతనుకూడ రమ్మని పంతులుగారిభార్య పిలిచినదికాని, తన భర్త యింటిలో లేనందున వారిసెలవులేనిదే రాఁ జాలనని చెప్పి సీత తప్పించుకొనెను. ఆనాడుకూడ పంతులుగారు. తమకిష్టమైన 'ఒబ్బట్లును-పరమాన్నమును' చేయించిరి. భోజనములైనతరువాత పంతులుగారి భార్య యొకచోటఁ జిన్న పందిరివేసి యందులోధాన్యముపరచి, దానిపై నొక వస్త్రమునుగప్పి, నాలుగుకొసలఁ గొబ్బరిబొండములును, చిమ్మిలిముద్దలునుంచి

యిచ్చుటలక్షణను గూర్చుండఁబెట్టెను. ఇంతియేకాక వచ్చిన ముత్తైదువలం దఱుఁ గూర్చుండుట కామె తమ యింటిలోనున్న పెద్ద 'తివాసీ' పరిపించి యొక వెండి పళ్లెరములో తమలపాకులుచెక్కలు నుంచి దానిపైఁ బెట్టెను. మధ్యాహ్నము మూడుగంటల కమ్మలక్క లొక్కొక్కరు పంతులుగారి యింటికి రానారంభించిరి. వచ్చినవారినెల్ల గౌరవించుచు వారుతెచ్చినరవికె లగుడ్డలును; పండ్లును మొదలగున వందుకొని పంతులుగారి భార్య తివాసీ మీదఁ గూర్చుండఁబెట్టుచుండెను. కొంతసేపునకుఁ దాను పిలిచిన ముత్తైదువు లందఱును వచ్చిన తరువాత నామె వెంటనే లేచి పెరటిలోనున్న రోలును, రోకళ్లనుదాసిచేఁ దెచ్చుటకిఁ దెప్పించి ఒక చేటలో నువ్వులు, పంచదారపోసి యచ్చటఁ బెట్టెను. అప్పుడు స్త్రీలెల్లరు నొకరినొకరు జూచుకొని ముసి ముసి నవ్వులు నవ్వుకొన నారంభించిరి. అదిచూచి పంతులుగారిభార్య, 'ఏఁవలా మొహమాటం పడుతున్నారు? సుబ్బక్కా లే! రాఁవక్కా! చూచున్నావేఁ?అన్నపూర్ణా! మొహమాటంపడకు. కాఁవాక్షీ! ఆలస్యం ఎందుకూ? సుబ్బీ! నువ్వు బాగా పాడతావట' అని వేర్వేరుగవా రందరినిఁ బిలిచెను. అప్పుడు మెల్లఁగ నొక్కొక్కరు లేచినిలువఁబడుచుండిరి. వచ్చిన వారందరును కడకు లేచి, యొక్కొక్క రొక్కొక రోకలి పట్టుకొని, రోటిచుట్టునునిలువఁబడి చిమ్మిలి దంపుట కారంభించిరి. ఆ దంపునప్పుడుపంతులుగారిభార్య వారందరిచేతను పాటలు పాడించెను. పాటలుపాడుచుఁ జిమ్మిలిముద్ద దంపుట యైన తరువాత మరలవారందఱును తివాసీపైఁ గూర్చుండిరి. పంతులుగారి భార్య తన చిన్నకూతురుతోఁగూడ వారందరికిఁ బసుపును, పారాయణము రాసి,తాంబూలములును, చిమ్మిలిముద్దలునుపంచిపెట్టెను. స్త్రీలెల్లరును లక్షణపై నక్షితలుజల్లి యిండ్లకుబయలుదేరిరి.

మూడవనాటి సాయంకాలమున పంతులుగారు వేంకటేశమునుపిలిపించి రేపటి కార్యమునకు సిద్ధముగ నుండవలయుననియుఁ ఆరాత్రికూడా వాని నచ్చటనే యుండిపొమ్మనియుఁ జెప్పిరి. వేంకటేశ మందుకు సమ్మతించి

ఆరాత్రి కచ్చటనేయుండ నిశ్చయించుకొనెను. మామగారు లోనికిఁబోయి నంతనేవేంకటేశము వీథియరుగుపైఁ గూర్చుండి తనలో నేమోయాలోచించుకొనఁ జొచ్చెను. అప్పుడు దృఢకాయమును, క్రూరదృష్టియు, వికారాకారమును గల యొక పురుషుఁడువానియొద్దకు నవ్వుచు వచ్చి,

'ఏఁవిరా భాయ్! రేపు నీకు మూర్తఁవట?'

'నీలాద్రి! దా! కూచో! ఎక్కడికివెళ్తున్నావు?'

'పోలిశెట్టిదగ్గిరికి వెళ్తున్నాను'

'మంచిమాట చెప్పేవు. నే నొకుత్తరం యిస్తాను. పోలిశెట్టికిచ్చెయ్యాలి!'

'ఎందుకోసం యేఁవిటి?'

'రేపు కార్యఁవా! కట్టుకోడానికి బట్టల్లేవు. చెప్పుకుంటేసిగ్గు. ఆనాటినుండీ నా బట్టలన్నీ చకోరాక్షి యింట్లోవుండిపోయాయి. నా వుత్తరం చూడగానే పోలిశెట్టిపంచలచాపులిస్తాడు. అవితెచ్చి నాకివ్వాలి'

'నువ్వు పోలిశెట్టికి బాకీవున్నావేఁవో? యెలాయిస్తాడు?'

'అందుకే నిష్ఠూరంగా వుత్తరం రాసి యిస్తాను'

అని వేంకటేశము జేబులోని కాగితమును పెన్సలుతీసి యుత్తరము వ్రాయుట కారంభించెను. అందులో నేమిసంగతు లున్నవో కాని వ్రాయుటకుమాత్ర మొక యరగంటకాలము పట్టెను. వ్రాయుట పూర్తియైనతరువాత,

'నీలాద్రీ! ఇదిగో యుత్తరం. ఎవ్వరికీ చూపించకుమీ, కొంప మునుగుతుంది. శెట్టికిచ్చావంటే పంచల్చాపులిస్తాడు'

అని చెప్పి వానికాయుత్తరమును భద్రముగా నిచ్చెను. వాని మాటలను బట్టిచూడ నాయుత్తరములోఁ గొన్ని రహస్యములుండియుండునని మన మూహింపవచ్చును. నీలాద్రియా యుత్తరమును గైకొని వెంటనే బయలుదేరెను.

వేంకటేశమునకుఁగల. దుస్సాంగత్యములో ఈ నీలాద్రి మొదటినుండియూ నుండెను. వారిరువురును ప్రాణస్నేహితులగుటచే నెవరేపని జేసినను ఇరువురునుగలసియే చేయుచుండిరి ఇంతయేల? వేంకటేశము స్థాపించిన దుష్ట సమాజమున కీనీలాద్రియే కార్యదర్శి. సిగ్గు-లజ్జ-భయమనునవి లేశమైనలేక, తనశత్రువులను దారిఁగాచి తన్నుటయంతేకాక, ఇంకనెట్టిసాహసకృత్య మొనర్చుటకైన నీమహానుభావుఁడు వెనుదీయు వాఁడుకాడు.

నీలాద్రి కుత్తరమిచ్చి పోలిశెట్టికిఁ బంపించిన తరువాత వేంకటేశము చాలాసేపువరకు నరుగుమీద నట్టులేకూర్చుండియుండెను. కొంతసేపునకు నీలాద్రి తిరిగివచ్చి వేంకటేశమును జూచి,

‘ఓరేభాయ్! ఇచ్చాడుకాదురా? నువ్వు చాలా సొమ్ము-బాకీవున్నావట నువ్వువస్తే మాటాడి యిప్పిస్తానన్నాడు. అందుచే నువ్వే వెళ్లి తెచ్చుకో! యిస్తాడు’

‘ఘురేఁవేనా ఝగిరేడా? నిమ్మళంగా మాటాడేడా?’

‘ఎగర్లేదు. నీవురాసిన వుత్తరం చూసి పెట్లోపెట్టుకొని నిన్నేరమ్మని చెప్పమన్నాడు’

ఆమాటలు విని వెంటనే వేంకటేశము అరుగుదిగి పోలిశెట్టివద్దకు బయలుదేరి వెళ్లెను. పోలిశెట్టి వానినిఁ జూచినతోడనే

‘ఏం పంతులయ్యా! వొచ్చినావా? కూకో! కూకో!’

‘కూచుంటానుకాని ఏఁవిటోయి పంచలచాపు లియ్యానన్నావటఁ నీబాకీ ఝొగవేసేస్తా ననుకొన్నావా యేఁవిటి?’

‘ఝొగనీ! దిగేనీ! నాకుతెల్దు. పదేపదే అడగడం నాకుబోదలేదు. బేగిచ్చేస్తే పరువుంటాది. లేకపోతే నువ్వు నేను కోర్టెక్కాల.’

‘ అంత మట్టు కెందుకోయి? ఈ కార్యం మూడురోజులూ గడచిపోయింతరవాత అణాపైసలతో వడ్డీతోకూడా నీ సొమ్ము నీకు పారేస్తాను.

ఇంతేనా? డబ్బుకి మొహం చూసుకున్నావుగాని మనస్నేహం ఆలోచిం చావుకావు. ఛే! ఛే! పంచల్చాపు లియ్య.'

'మరినన్నేటీ అడక్కు మెల్లికలిపో! పొమ్మిత్తేనేకాని పూటిక పుడ కేనా యియ్యాను. ఏంపెద్దమనిషినయ్యా? బోల్డుసొమ్ము బాకీపడిపోయి, యియాల-రేపూ యియాలరేపూ యని తిప్పాలెడుతున్నావు?'.

'అయితే యేంచెయ్యమన్నావోయి? నీయింట్లో కార్యాలొస్తే చెయ్యడం మానేస్తావా యేఁవిటి? వీళ్లతల్లి సిగాగొయ్యా! పదిహేనువం దలు సిస్తులురావలసివుంటే రైతు లివ్వాగుండావున్నారు. యిబ్బందొచ్చి నప్పుడేఁవి చేస్తాఁవు? నీకు మాత్రం రాదాయేఁవిటి?'

ఇట్లుమాట్లాడుచుండ నింతలోఁ జీకటిపడి నది. శెట్టి తన పాపులో దీపమువెలిఁగించి ఆగాజుబుడ్డిలో నూనెచాలనందునఁ గొని తెచ్చుటకై పొరుగు దుకాణమునకుఁ బోయెను. ఆపోవుచున్నప్పుడు వేంకటేశము వానినిఁ జూచి "ఏఁవోయి వొచ్చేస్తున్నావు? నామాటేంచెప్పేవు?' అని యడుగ శెట్టి 'కూకో కూకో దుకాణంకాడెవస్లూలేరు. నూనొట్టుకిప్పుడే వస్తాను' అని ప్రత్యుత్తర మిచ్చి వెళ్లిపోయెను. అప్పుడు వేంకటేశము తప్ప పాపులో నెవ్వరులేరు.

ఇంటివద్ద భీమశంకరముగారు రామావధానితో రేపటి కార్యక్రమ ములు గూర్చి మాటాడుచు వేంకటేశ మెచ్చటికిపోయెనో యని వానికొర కెదురు చూచుచుండెను. వంటయైనదని చెప్పి భార్య తొందరపెట్టుచుండి నను, అల్లుఁడు రాకుండ భోజనము చేయుట కిష్టములేక పంతులుగారువాని కొరకు వేచియుండిరి.ఎంతకును భోజనమునకు రానందున విసిగి పంతులుగారి భార్య చావడిలోనికి వచ్చి నిలిచి యుండెను. కాని భర్త పురోహితునితో నేమో రహస్యముగ మాటాడుచుండుటచే నామె యేమియుఁ జెప్పలేదు. కొంతసేపునకు వేంకటేశము భుజముమీదనున్న పంచలో నేమో మూటఁ గట్టి పట్టుకొని యచ్చటికి వచ్చెను. పంతులుగారు వానినిఁ జూచి

'ఎక్కడికి వెళ్లేవురా?'

'పోలిశెట్టిదగ్గిరకండీ! వస్తువులు తెచ్చుకోడానికి వెళ్లేను'

'ఏఁవిటి తెచ్చావో చూపించు'

వేంకటేశము మూటవిప్పి

'ఇదిగో! ఇదివాచీ'

'ఎంతైంది?'

'నాలుగురూపాయి లన్నాడు. ఇదుగో యీ లవండరుబుడ్డిచూశారా?'

'బాగున్నాది. ఇది నీకెందుకు?'

అని యడుగ పంతులు గారి భార్య వేంకటేశమునుజూచి

'ఎందుకేఁవిటి? పెళ్లాంకోసం తెచ్చాడు'

'అత్తా! ఈ మల్లుతాను చూశారండీ?'

'చూశాను. నీ పెళ్లానికి నాలుగు కబ్బారవికలు కుట్టించు'

'అబ్బే! ఇవి నేను కట్టుకోడానికండీ! కబ్బారవికలకు చీనాపట్టు బట్ట యీమాటు తెస్తానులెండి. ఈ పట్టురుమాలుచూశారా?'

'బాగున్నాది. లవండరుజల్లి జేబులోపెట్టుకో'

అప్పుడు రామావధానిగారు పంతులుగారినిఁజూచి

'పంతులుగారూ! మొత్తంమీద మీవాడు తెలివైనవాడేనండీ!'

'బుద్ధి స్థిరంగావుండదు కాని, నాలుగురాళ్లు తెచ్చుకోగలఁడు'

'ఏఁవేనా వుద్యోగం చేస్తున్నాడా?'

'కలక్టరు కచేరిలో పాతికరూపాయిలిస్తారు'

'ప్రశస్తంగావుంది. ఇంకేంకావాలి?'

'ఏఁవిటో చూశారా! పెద్దసంబంధానికి పరుగెత్తలేక మేనరికఁవని చేశాను.'

'అయితేనేఁవండి? మణిపూసలాంటి చిన్న వాడు. ఎప్పుడూకూడా పెద్దసంబంధాలు చెయ్యకూడదనే నా వుద్దేశంకూడానున్నూ!'

'సరే! అవధాన్లుగారూ! మా ఆఁవిడ తొందరపెడుతూంది. కాళ్లు కడుక్కొందునా?'

'లెండి! లెండి! నే నుదయాన్నే వస్తాను. వచ్చేసరి కన్నీసిద్ధంగా వుంచాలి'

'ఆమాట మీరుచెప్పాలా? ఆలస్యంచేస్తే మాపిల్ల వుండలేదు. చీకటితోటే, అన్ని సిద్ధం చేయించేస్తాను. మీరుమాత్రం వేగిరం రండి'

అని చెప్పి పంతులుగారు వేంకటేశముతో భోజనమునకు లోనికిఁ బోయిరి.

# ప్రకరణము—14.

## —ఔపోసన ముహూర్తము.—

'వాహ్వా! ఇన్నాళ్లకి నా కదృష్టదినాలు వచ్చాయి. చక్కదనం అంటే మా లక్షణదే చక్కదనం. ఎంతో అదృష్టం చేసుకుంటేనే కాని యిలాంటి పెళ్లాం దొరకడం కష్టం. కాని లక్షణకు నామీద అంతగా యిష్టంవున్నట్టు కనబడదు. కాబట్టి దాన్నేలాగేనా నావల్లో వేసుకోడానికి ప్రయత్నించాలి. పెళ్లాన్ని వశంచేసుకోడానికి ముందుగా మా అత్తగార్ని మావగార్ని వశంచేసుకోవాలి. అత్తా! ఇది నా పెళ్లాని కివ్వండీ యని చెప్పి యీవాళ, వొక లవండరుబుడ్డి యిచ్చేసరికి ఆవిడ గుమ్మయిపోయింది. నాలుగు రోజులుదాకా యిలాగ యేదైనా తెచ్చి యిస్తూవుంటే మా అత్తగారు నా పెళ్లానికి బోధపర్చి దాని మనస్సేలాగేనా తిప్పేస్తుంది. రేపు నన్నూ నా పెళ్లాన్నీ గదిలోకి పంపించేటప్పుడు, ఏంవిబట్టలు కట్టుకోవడం అని ఆలోచిస్తున్నాను. పట్టురుమాలు వొకటి వున్నాదికదా? అది షోగ్గా మెడకట్టుకుంటాను. అందుమీద తానుముక్క చింపుకొని కట్టుకుంటే చాలు అన్నీ తెచ్చానుకాని వాసననూనె సీసాకూడాఒకటి దొరికుంటే బాగుండిపోను, లవండరుబుడ్డి వొకటి వున్నాదికదా? దాంతో యెలాగోకాలక్షేపం చెయ్యొచ్చు. లేకపోతే జీడినూనెలో ఇంత లవండరు పోసి తలకు రాసుకుంటాను. ఆహా! రేపెంత సంతోషపైనరోజు? ఎప్పుడు తెల్లవారుతుందో అని యెదురుచూస్తున్నాను. యివాళ రాత్తిరి నాకు నిద్రపట్టుతుందో పట్టదో? వెధవగడియారం యింకా తొమ్మిది గంటల్లోనే యేడుస్తూంది. ఇది తప్పు. ఇప్పుడు యించుమించుగా పదకొండు గంటలుకావచ్చు..............................ఇన్నాళ్లిదాకాఅతిలోత్తమముండకోసం వూరికే తాపత్రయాం పడ్డాను కాని లక్షణముందర యది. యెన్నోవంతు?

చక్కదనం వుంటేసరా? ఆపాటి చక్కదనం నాపెళ్లానికి లేకపోలేదు. నిష్కారణంగా దానికోసం ఆశపడి ఆ ముసిలిముండకి దవ్వబిళ్లల్లాగ యాభై రూపాయలు యిచ్చేశాను. అవి మళ్లా తిరిగి వచ్చే సాధనంలేదు. ఆ యాభై రూపాయిలు యిటాంటప్పుడు చేతులో వుంటే అత్తరుబుడ్లు - వాసననూనె సీసాలు మొదలైనవి కొని కొంత మట్టుకు మజాచేసివుందును. కాని గంగలో పోసేశాను. పోనీ ఆ తిలో త్తమ్ముండేఁవేనా స్వాధీనం అయిందీ అంటేఅది కూడా లేదు'..................'

అని వేంకటేశమానాటిరాత్రి భోజనముఁజేసి యొంటరిగ నొకచోఁ గూర్చుండి తనలో ననేకవిధముల ననుకొనుచుండెను. మీదిసంగతులవలన వేంకటేశ మెంత సరసుఁడో చదువరులు గ్రహియించియే యుందురు. వీని ప్రభావమింకను ముందుముందు తెలియఁగలదు. కావున వానిసంగతి విడిచి మనమొకసారి లక్షుణయొద్దకుఁబోవుదము. నాటిరాత్రి లక్షుణయొంటరిగ నొకగదిలోఁ గూర్చుండి మితిలేనివిచారమున నూరక కన్నీరుఁగార్చుచుండెను. కొంతసేపునకుఁ దలిదండ్రులు మొదలగు వారందఱుఁ బరుండి నిద్రించిరి. వారందఱు నిద్రించుట కనిపెట్టి లక్షుణ యెందుకొరకోకాని పెరటితలుపుఁదీసెను. తోడనే గడియ చప్పుడైనందున నచ్చటికి సమీపముననే నిద్రించియున్న వానితల్లి మేల్కొని 'లక్షుణా! పెరటితలుపెందుకు తీస్తున్నావు?' అని రెండు మూడుసారులు గద్దించియడిగెను. కాని లక్షుణయందు కేమియు సమాధానముఁజెప్పలేక తెల్లపోయి మరలఁ దలుపుగడియవేసి పరుండెను. ప్రక్కపైఁబరుండి తనలో దీర్ఘముగ నేమోయాలోచించుచుఁగన్నులుమూసికొని యుండుటచేఁ గొంతసేపునకు లక్షుణకుఁ గొంచెము మైమరపుఁగలిగెను. ఇంకను నిద్ర గాఢముగఁ బట్టలేదు. కాని హాయిగా నిద్రించుదినములింక నామెకు రాకుండుటచే, నానిద్రయెంతోసేపుండలేదు. కన్నులుమూసికొని పరుండియున్న లక్షుణ, యేకారణముననోకాని తటాలునఁద్ర్శుళ్లిపడి లేచి, కూర్చుండి తనలో

'ఏఁడీ? మాధవుఁడేడీ' నామనోహరుఁ డెచ్చటనున్నాఁడు? అయ్యో! మాధవా! ఇప్పుడేవచ్చి నన్నుఁ బలుకరించితివికదా? ఇంతలోనే మాయమైతివా? ఈపాపిష్టి మంగళసూత్రము నీకునాపైని శత్రుభావముఁ గలిగించినదా? అయ్యో! ప్రాణేశ్వరా! నావీనులకు విందుఁగొలిపి నన్ను మహానందమున నోలలాడించిన నీతీయని పలుకులింకొకసారి నన్ను విననీయవా? నాథా! నాతోనిప్పుడేమంటివి? 'లక్షణా తొందరపడకుము. విచారించిన లాభములేదు. మనమిరువురమును కలసి హాయిగ జీవించుదినములు ముందున్న' వనియా పల్కితివి? ప్రాణేశ్వరా! అయ్యో! ఇంకెక్కడిసౌఖ్యము? ఎక్కడి యానందము? ఆఋణమంతయు మనకిదివరకే తీరిపోయినది? రేపటిదినమున నాశరీరమొక నీచున కర్పించుచున్నాను. నాథా! ఇట్టి యాపత్సమయమున నీవూరనుండినచో, నన్నెట్టులైన నీదుఃఖమునుండి తప్పించి రక్షించియుందువేమో? ఎందరి వేల్పులకో చేతులెత్తి మ్రొక్కుకొంటిని? కాని యొక్కనికైన నాయందు దయకలుగలేదు. తల్లీ! భవానీ! లోకమాతా! చిన్ననాటినుండియు నిన్నేనమ్ముకొని భజించుచున్న దీనురాలను. దిక్కులేని బాలికను. పుట్టినతరువాత నెవరికిని నెట్టియపరాధము నొనర్చి యెఱుఁగని యమాయకురాలను. ఇన్నిటికన్న నీభక్తురాలను. నీవైననన్ను దయఁజూడుము. రేపు జరుగనున్న క్రూరకృత్యమున కేదైన నభ్యంతరముఁ గల్గించి నన్నీ దుఃఖసముద్రమునుండి యొడ్డునఁబడవేయుము. ముల్లోకములనేకచ్ఛత్రమునఁ బరిపాలించుచున్న శంభుదేవునకుఁ బట్టపురాణివై యుండి, నన్ను నా నాథునకుఁ గూర్పఁ జాలకపోవుట నీకైనఁ జిన్నతనముకాదా? తల్లీ! పోనిమ్ము నాకంతభాగ్యము లేకున్నమానెఁ గాక. కాని నాహృదయేశ్వరుఁడొక్కరుఁడె తక్కమరెవ్వరు నాశరీరము నంటకుండఁ జేసి నామానమును గాపాడుము. నన్నెందు కూరక యేడ్పించెదవు? ఓతల్లీ! భవానీ! ఈరవంత యుపకారము నాకొనర్చినచోఁ జన్మజన్మములకు నీపద దాసినై నిన్నేఁ భజించుచుందును. అయ్యో! తెల్లవారినచోఁ గఠినచిత్తులగు తలిదండ్రులు నన్ను మరలఁ గొని

పోయి యా మూర్ఛనిప్రక్కఁగూర్చుండఁబెట్టెదరు. ఓతండ్రీ! సూర్యభగవానుఁడా! జగత్సాక్షివగు నీవెఱుంగని సంగతులులేవు. నిర్మలమైన నాయంతరాత్మను పరీక్షించి, కరుణామయుఁడవైనచో నన్నుఁ గాపాడుటకునీవు రేపుదయింపకుండరాదా? కటకటా! నీవు రాకున్నచో జగములెట్లునిలుచును? నీసందర్శనము లేనిదే పిపీలికాది బ్రహ్మపర్యంతము నెవ్వరు జీవింపఁగలరు? నిర్భాగ్యురాలనగు నాయొక్కతె మేలుకొఱకు నీవు జగమునంతటిని క్షోభపెట్టెదవా? దేవా! లోకబాంధవా! దుఃఖాతిశయమున నేనట్లులంటిని. క్షమింపుము. అయ్యో! పెండ్లినాడువచ్చినట్టు నాకిప్పుడేదైన రోగము ముంచుకొని రాఁగూడదా? అట్టులైన నాకీగండము గడచునేమో? ఓ చతురాననా? బమ్మదేవరా! నీవింక నెంతకాలమువరకు నాకాయువు లిఖించి యుంటివి? ఓ పంచభూతములారా! మీలో నెవరైన నన్నుదిగమ్రింగి పుణ్యముఁగట్టుకొనరాదా? ఓతల్లీ! భూదేవీ! ఏపాప మెఱుఁగని నన్ను నీలో నైక్యముఁ జేసికొని, నాకీదుఃఖభారము నింకనేల వారింపవు? హా! హృదయేశ్వరా! అకారణముగ నాహృదయమును దొంగలించి నన్నిట్టులేల బాధపెట్టుచుంటివి? అయ్యో! మాధవా! మాధవా'

అని తనలో దుఃఖించి లక్షణ మూర్ఛపోయెను. తరువాతఁ జాలసేపువరకు నామెకుఁ దెలివి రాలేదు. ఇంతలోఁ దెల్లవారినది. పంతులుగారి భార్య లేచి లక్షణను మేలుకొలిపి యామెను స్నానముఁజేయించెను. భీమశంకరముగారి సెలవుప్రకారము మంగలివాండ్రు వచ్చి వీథియరుగుపై మంగళధ్వనుల నారంభించిరి. రామావధానిగారు 'అంగళములో' నలికించి ముగ్గులు పెట్టించి యచ్చట వధూవరులు కూర్చుండుటకై పీటలువేయించి తమకు వలసిన సామగ్రినిఁ దెప్పించుకొనిరి. పంతులుగారు తమ యల్లునకు మంగలివానిచేఁ దలనంటించి స్నానముఁ జేయించిన తరువాతఁ దనగదిలోనికి దీసికొనిపోయి క్రొత్త పంచలచాపు నుత్తరించి, పసుపు బొట్లుపెట్టి కట్టుకొమ్మని వానికిచ్చిరి. ఆశీర్వాదమునకై వచ్చిన బ్రాహ్మణులందఱు నంగళము

చుట్టు తివాసులపైఁ గూర్చుండిరి. రామావధానిగారు కట్టెపుల్లలు విరిచి యగ్నిహోత్రమును సిద్ధముఁజేయుచుండిరి. పంతులుగారిభార్య లక్షణను గదిలోనికిఁదీసికొనిపోయి యారపెకొక క్రొత్తచీరఁ గట్టించి కాటుకయుబొట్టును పెట్టి ఆభరణము లన్నింటితో లక్ష్మీదేవి వలె నలంకరించి యంగళము లోనికిఁ దీసుకొనివచ్చి యచ్చటఁబీటపైఁగూర్చుండఁబెట్టెను. వేంకటేశము తిలకము దిద్దుకొనుచు గోడకుఁ దగిలించిన యద్దమువద్ద నిలువఁబడి యుండెను. అప్పుడు పంతులుగారి రెండవకూతురు వానియొద్దకువచ్చి 'బావా ఏవళ్లో వచ్చి నిన్ను పిలుస్తున్నారు. తొందరగా మాటాడవాలట' అని చెప్పెను. తోడనే వేంకటేశము వచ్చినవారెవరో కనుఁగొనుటకై వీధి గుమ్మములోనికిఁ బోయెను. అచ్చట నలువురు కనిస్టేబులు నిలువఁబడియుండి వేంకటేశమును జూచినతోడనే 'పంతులూ! రండిరండి! స్టేషనికి నడవండి! యిన్స్పెక్టరు గారి సెలవైంది, అని చేయిఁ బట్టుకొని లాగఁజొచ్చిరి.

'ఇవాళ మాయింట్లో కార్యం. ఎలావస్తాను?'

'మేఁవేంచేస్తాం రాకతప్పదు. గవర్నమెంటు ఆర్డరికి మనయింట్లో కార్యాలడ్డుపడతాయా? వేగిరరండి.'

ఈయల్లరి విని పంతులుగారింటిలోనుండి పరుగెత్తుకొనివచ్చి యచ్చటనున్న రాజభటులనుజూచి,

'ఏఁవిటోయి అల్లర?'

'ఏఁవీలేదండీ? మీ యల్లుడుగారు చేసిన ప్రతాపం బయలుపడ్డాది. అందుచే స్టేషనికిహాజరు కమ్మంటున్నాం'

'ఏఁవిటిచేశాడు. చెప్పండి! చెప్పండి!'

'మీరె అడగండి. నిన్నరాత్రి పోలిశెట్టి షాపులో యేంటిచేశాడో'

పంతులుగారు వేంకటేశమును జూచి

'ఏఁవిటిచేశావురా?'

'నేనేఁవి యెరగనండీ'

అప్పుడు కనిస్టేబులు నవ్వుచు పంతులుగారితో

'చూశారా! ఈ మహాత్ముఁడు నిన్న సాయంత్రం పోలిశెట్టి షాపు కెళ్ళి యతను లేనప్పుడు, ఒక వాచీ-లవండరుబుడ్డి-పట్టురుమాలు-మల్లుతాను దొంగతనంగా పట్టుకొని వెళ్ళిపోవచ్చాడు. రామారావుగారును, ఇనస్పెక్టరు గారును, ఇతన్ని తక్షణం తీసుకురమ్మని మాకు సెలవిచ్చారు. పంతులూ! నడు! నడు! తప్పదు'

అని చెప్పి వేంకటేశమును ముందరికిఁ ద్రోయసాగిరి పంతులుగారు మాటయును మతియును లేక కొయ్యబొమ్మవలె నట్టులే నిలిచి పోయిరి. ముఖ్యమైన సంగతి కార్యము నిలిచిపోయి, మన లక్షణ కోరిక నెరవేరినదికదా? తక్కిన సంగతులు ముందు ప్రకరణములో వివరించెదము.



# ప్రకరణము—15.

## జామీనుపై విడుదల.

ఔపాసన ముహూర్త ప్రయత్నము లన్నియు నాగిపోయినవి. ఈసంగతి తెలిసినతోడనే భక్షణ యొకరితోడు అక్కఱలేకుండఁ దనంతటఁ దానే పీటపైనుండి లేచి సంతోషముతోఁ దన గదిలోనికిఁబోయెను. పంతులుగారు, పోలీసు ఇనస్పెక్టరుగారితో మాటాడి కార్యము జరిగినదాక వేంకటేశము కేసు నిలుపుచేయించవలెనని వెంటనే యుచిత వస్త్రములను దాల్చి స్టేషనునకు బయలుదేరిరి. వాని వెంటఁ గనిస్టేబులు వేంకటేశమును తోడ్కొని వచ్చుచుండిరి. భీమశంకరముగారు స్టేషనులోనికిఁ బోవుసరికి, అచ్చట ఇన్స్పెక్టరుగారును, రామారావుగారును చెరి యొక కుర్చీపైఁ గూర్చుండి యేమో మాటాడుకొనుచుండిరి. పోలిశెట్టికూడ నచ్చటనేయుండెను. పంతులుగారు లోనఁ బ్రవేశించి రామారావుగారినిఁ జూచి,

'రామారావుపంతులుగారా?'

'అయ్యా! అయ్యా! చిత్తం. చిత్తం. దయచేయండి'

కూర్చుంటాను కాని మీ రింతాగ్రహం వహించడం ధర్మమేనా? ఇవాళ మా కార్యం భంగంచేశారు'

'ఔను. నేనుఁగూడ నందుకే విచారించుచున్నాను. కానిగవర్నమెంటురూలునకు వ్యతిరేకముగా నడువఁగలమా? అయ్యా! వెంకటేశంగారూ! ఇలాగునరండి'

అని పిలువ వేంకటేశము ముందునకు వచ్చి నిలువఁబడెను. రామారావు వానినిఁజూచి,

'అయ్యా! మీరు తగుమనష్యులైన భీమశంకరముగారితో సంబంధముఁజేసికొని ఇట్టి నీచకృత్యములుచేయుట మర్యాదగానున్నదా?'

'నే నేంచేశానండి?

'ఏమిచేసినారా ? నిన్న నెన్నిగంటలకు మీరు పోలిశెట్టిదుకాణము నకు వెళ్లినారు?'

'సుమారు ఆరుగంటలకి వెళ్లివుంటాను'

'పోలిశెట్టిని మీా రేమి యడిగినారు?'

'నే నేఁవీ అడగలేదు.'

'అట్లయిన మీారచ్చటికి వెళ్ళుటకేమి కారణము?'

'స్నేహధర్మాన్ని చూడ్డానికని వెళ్లేను'

'పోలిశెట్టి బట్టలకొరకు మీరు తనవద్దకు వచ్చినట్లు చెప్పుచున్నాడే? దానికేమందురు?'

'అది వట్టిఅబద్ధం' తన బాకీ యివ్వలేదన్న దుఃఖంచేత యిలాంటి పన్నాగం పన్నేడు '

ఆమాటలువిని పోలిశెట్టి ముందునకువచ్చి

'ప్రభువోరు సిత్తగించండి. యీాయయ్య బట్టలిమ్మనినాకుసీటీకూడా రాశాడు. అది నాసిట్టాపుస్తకంలోయెట్టుంచాను. యేల్నోరు పంపించి పరిచ్చ సెయ్యండి'

అని పలుక వెంటనే రామారావు ఆయుత్తరమునుతక్షణము గొనిరమ్మని, ఒక కనిస్టేబును వెంటనిచ్చి పోలిశెట్టి యింటికిఁ బోయి యుత్తరమును దెచ్చి యొసంగినంతనే రామారావు దానినిఁ జదివి, నవ్వుచు శిరము నాడిం చెను.

మీాదిసంభాషణము విని సంగతులు కనిపెట్టి, పంతులుగారూరక విచారించుచు వేంకటేశము తెలివితక్కువకునొచ్చుకొని రామారావు గారినిఁ జూచి

'అయ్యా! రామారావుగారూ! తెలిసో తెలియకో చేశాడు. క్షమిం చండి. నేనావస్తువులు పోలిశెట్టి కిచ్చివేసిరాజీనామా చేయించేస్తాను'

పంతులుగారూ ! ఇది చోరీకేసు. ఇందులో రాజీనామా చూపనికిరాదు. ఇదేకాక, మీయల్లుడు చేసిన అద్భుతకార్యములింకనున్నవి. మీరేమియు మాటాడక వినుచుండు(డు ఒకొక్కటి తెలియ( గలదు.'

అని చెప్పి వేంకటేశమును జూచి తనచేతిలోనున్నయుత్తరము వానికి(జూపి

'అయ్యా! వేంకటేశముగారూ ! ఈచోరీకేసులో నేనంతపట్టుదల వహింపలేదు. కాని ముందీసంగతికి సమాధానముచెప్పండి. ఈయుత్తరములోని దస్తూరీ మీదేనా?'

'నాదే

'సంతకము కూడ మీదేకా(బోలు?'

'చిత్తం'

'ఈయుత్తర మెందునిమిత్త మెవరికి వ్రాసినారో జ్ఞాపకమున్నదా?'

'పంచల్చాపులియ్యమని నిన్న సాయంకాలము పోలిశెట్టికిరాసి పంపించాను'

'ఎవరిచే(బంపించినారు?'

'నీలాద్రి యనే నాస్నేహితుడు కిచ్చి పంపేను'

'ఈయుత్తరంలో మీరేయేసంగతులు వ్రాసినారో జ్ఞాపకమున్నవా?

'అన్నీ జ్ఞాపకంలేవు'

'సరే మీరొకసారి చదివి మాకు వినిపించెదరా?

'చిత్తం'

అని యుత్తరమును పుచ్చుకొని గద్గద స్వరముతో వేంకటేశమిట్లు చదువ నారంభించెను.

'మిత్రుడైన పోలిశెట్టికి—

రేపటి దినం మాయింట్లో శ్రీ పోసనమూర్తం జరుగవలసివుంది. కాబట్టి యీయుత్తర(మిచ్చిన నీలాద్రిద్వారా ప్రశస్తమైన జల్తారుపంచల చాపులు

రెండు పంపించవలెను. వాటిఖరీదులు నాతాలూకు ఖాతాలో రొక్కస్తే సాయంత్రంవచ్చి నేను సంతకంచేస్తాను. ఆనాటిరాత్రి చకోరాక్షివిషయంలో నీదగ్గిర పుచ్చుకొన్న పదిహేనురూపాయిలు ఇంకా యివ్వలేదని మనస్సులో కోపం వుంచుకోవద్దు. మనంచేసిన పని బయలు పడకుండా రహస్యంగా వుండడమేకాక మనశత్రువు బుఱ్ఱమీద, ఆభారమంతా పడేసినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. ఒక పని చేసినప్పుడు జయంచూచుకోవాలికాని పైసాను మొఖంచూచుకోగూడదు. ఇంకా మీకివ్వవలసిన పద్దులన్నీ లెక్క చూచి అణాపైసల్తో చెల్లించేస్తాను. కాబట్టి మఱొక అనుమానంపడక పంచల్చాపులు పంపడం మానవద్దు. ఈయుత్తరము చూచినతోడనే చించిపారవేయవలెను.

వేంకటేశము”

ఆయుత్తరముఁ జదువుచున్నప్పుడు వేంకటేశము మొగమున నెత్తుకడఁజూచిన నెత్తురు లేదు. రామారావుగారాయుత్తరమును విని వేంకటేశమును జూచి,

‘వేంకటేశముగారూ! చకోరాక్షివిషయములో పదునైదు రూపాయిలు పుచ్చుకొన్నట్లు వ్రాసినారు? అనఁగా వానిభావము సెలవిచ్చెదరా?’

‘చిత్తం. ఒకనాడు రాత్రి చకోరాక్షి మేళం పెట్టించాలని మాకు బుద్ధిపుట్టింది. అప్పుడు చేతిలో సొమ్ము లేకపోవడంచేత శెట్టినడిగి పదిహేను రూపాయిలు పుచ్చుకొన్నాను’

‘మనం చేసినపని బయలుపడకుండా రహస్యంగావుందని వ్రాసినారే, దానియర్థమేమి?’

ఆమేళం పెట్టించడమే పైవాళ్ల కెవళ్లకీ తెలియకుండా రహస్యంగా వుంచాలని రాశాను’

‘సరె! శత్రువు బుఱ్ఱమీద భారమంతా పడేడం యేమి?’

‘ఆమేళం మేమే పెట్టించామని తెలిస్తే మావాళ్లు కోప్పడతారని మాకు కిట్టనివాడిమీద పెట్టేశాం’

'శబాస్! అబద్ధమాడినచో నతికినట్టు లుండవలయును. వెంకటేశము గారూ! మీయుక్తులకు చాల సంతోషించినాను. సరే యిప్పుడు మీతో వాద మెందుకు? రేపు విచారణలో నన్నియు బైటపడగలవు. చకోరాక్షిని సత్యానందమే కూనీ చేసినాఁడని మీదే మొదటిసాక్ష్యముకదా? ఆమాటయే రేపు కోర్టులో చెప్పవచ్చును. అంతవరకును మీరు లాకప్‌లో కూర్చుండవలసి యుండును.'

'అయ్యా! అయ్యా! ధర్మంకాదు. క్షమించండి నేనేపాపం యెరగను. దైవంతోడు'

అని వేంకటేశ మేడ్చుచు రామారావుగారి పాదములపైఁబడి ప్రార్థింపసాగెను. పంతులుగారిదంతయుఁ జూచుచు దీనముగా

'రామారావుగారూ! చకోరాక్షి కూనీకేసులో మావాడుకూడా వున్నాడంటారాయేవిఁటి?'

'నే నామాటఁ జెప్పఁగలనా? కోర్టులో విచారణ జరిగినప్పుడు మీకే తెలియఁగలదు. తొందర యెందుకు?'

'అయితే మావాణ్ణి యిప్పుడు లాకప్‌లో వుంచడాని కేఁవిటి కారణం అంటారు?'

'అనుమానం'

'ఈవుత్తరం వల్లనే మీకనుమానం కల్గింది కాఁబోలు?'

'ఇంకను పెక్కుకారణము లున్నవి. కాని వానిని మీకెఱింగించుట ప్రస్తుత మనవసరము; కాని భీమశంకరముగారూ! మనలోమాట. ఇట్టివానికి మన లక్షణ నెట్లు లిచ్చి పెండ్లిఁజేసిరి? పాపము నిష్కారణముగ గొంతుకఁ గోసినారుకదా? మీ తెలివి తేటలన్నియు నప్పు డేమై పోయినవి? ఇంక నింతలో మీయల్లుఁడు మీయింటికి వచ్చు నన్నధైర్యము నాకు లేదు. మీరింక దయచేయుండి. పాపము భోజనమునకు వేళయైనది కాఁబోలు?'

'రామారావుగారూ! పెద్దవాణ్ణి. చంద్రుడికో నూలిపోగులాగ యేఁవేనా సమర్పించుకొంటాను. తమరు కటాక్షించి.........'

'ఛీ! ఛీ! నన్ను లంచముఁ బుచ్చుకొనుమనెదరా? ఇఁకముం దెన్నఁడు నిట్టిమాటలాడవద్దు. మీరింక దయచేయుండి.'

అని పలికి రామారావు, ఇన్స్పెక్టరుగారినిఁ జూచి,

'అయ్యా! ఇన్స్పెక్టరుగారూ! మనము జామీనుపైని సత్యానందమును విడిచిపెట్టుట కేమైన నభ్యంతరముండునా?'

'మీరే ఆలోచించండి. ఏఁవేనా చిక్కు వస్తుందేఁవో అని ఆలోచిస్తున్నాను. తరువాత మీయిష్టం'

'ఔను నే నింతకు ముందు చెప్పినసంగతులలో మీకేమైన ననుమానమున్నదా?'

'అబ్బే! లేదు లేదు. మీరు చెప్పిందంతా యదార్థం, మీరు డిటెక్టివ్ ఆఫీసర్లుకదా! పొరపాటు పడతారా?'

'అయితే సత్యానందమును జామీనుమీద విడిచిపెట్టవచ్చును'

అని పలికి రామారావుగారు వెంటనే మాధవరావుతండ్రి కుత్తరమును వ్రాసి పిలిపించి, సత్యానందమునకు జామీనుగా వానిచే సంతకముఁ జేయించెను. తన కుమారుఁడగు మాధవరావునకు సత్యానందరావు ప్రాణమిత్రుఁడగుటచే నతఁడు వెంటనే యందు కంగీకరించెను రామారావు తోడనే తన మిత్రుని విడుదలఁ జేయించెను. సత్యానందుఁడు మహానందమున రామారావుగారినిఁ గౌఁగిలించుకొని తనకుఁజేసిన యుపకారము నెంతయో శ్లాఘించెను. తరువాత రామారావుగారు వేంకటేశమునుజూచి 'అయ్యా! ఆలస్యమెందుకు? లోపలికిదయచేయండి. పసుపు బట్టలు కట్టుకొని ఔపోసన ముహూర్తమునకుసిద్ధపడిరి కాని పాపము మీకు కారాగృహప్రవేశము కలిగినది' అని పలికి వెంటనే వానిని లాకప్‌గదిలోఁ బెట్టించెను. పంతులుగారు కన్నీరు గార్చి దుఃఖించుచుఁ గొంతసేపున కింటికి బయలుదేరిరి. 'పోలిశెట్టిగారూ! మీరు వెనక్కు తీస్తున్నారేఁ? మీదంతా వొకటేజట్టు. మీరుగూడా లోనికి దయచేయండి' అని ఇన్స్పెక్టరుగారు పలికి నీలాద్రినిఁగూడ రప్పించి వానిని శెట్టిని చీకటిగదిలో నుంపించిరి

---

## ప్రకరణము—16.

---

### విచారణ.

సత్యానందమునకు విడుదలైననాడు, సీతయు, లక్ష్మణయు, రామారావుగారును కూర్చుండి మహానందమున సంభాషించుకొనిరి. సత్యానందము వారందఱిచే మన్నింపఁబడి తనపై వారికిఁగల ప్రేమమున కెంతయో సంతసించెను. సత్యానందము విడుదలైన శుభవార్త, చెన్నపట్టణములో బి. ఏ. పరీక్షకుఁ జదువుకొనుచున్న మాధవరావునకు, రామారావు తంతిమూలముగాఁ దెలియఁజేసెను.

వేంకటేశమునకు సంభవించిన యాపదకు భీమశంకరముగారికుటుంబ మెంతయో విచారించుచుండిరి. పంతులుగారు నిద్రాహారములులేక యల్లునిఁ జెరలోనుండి విడిపించుటకు శక్తివంచన లేకుండ పాటుపడుచుండిరి. అన్న వస్త్రములకు లోపము లేకపోవుటయేకాక, తగినంత గౌరవము నార్జించి, ఏవిషయమునందును, ఒకరి నాశ్రయింప వలసిన యవసరము కలనైనలేక, హాయిగ జీవించుచుండిన పంతులుగారిప్పుడు పాపము తమ యల్లుని విడిపించుటకుఁ బట్టరానివారిపాదములఁబట్టి నిరంతరమును దీర్ఘవిచారమున శుష్కింపవలసివచ్చినదికదా? ఈవిషయమున పంతులుగారి తాపత్రయముఁజూచి విచారింపవలసినదే! అయినను విచారమెందుకు? యుక్తాయుక్తములఁ గలవైన నాలోచింపక, యెందఱెన్నివిధముల బోధించినను వినక, తమపాటి తెలివితేటలితరులకు లేవని యహంభావమును వహించి మితిలేని ధనాశచేఁ మతిచెడి; జ్వరాతిశయంబున నోడలెఱుంగక పడియున్నను విడువక, శవమును మోసికొని పోయినట్లు తీసికొనిపోయి, దీనురాలగు లక్ష్మణ నట్టి దుర్మార్గునకుఁ గట్టిపెట్టినందులకు భీమశంకరముగారికిఁ బ్రాయశ్చిత్తము కావలసినదే!

వేంకటేశము, పోలిశెట్టియు, నీలాద్రియు రిమేండులో నుంచఁబడిన మరునాడే మేజస్ట్రీటుగారు సాక్షులనందఱినిఁ బిలిపించి, కేసు విచారించిరి. ఆవిచారణలోఁగూడ సత్యానందము నిరపరాధియనియు, కూనీచేసినవాఁడు వేంకటేశము, నీలాద్రియనియు సారాంశము తేలినందున, మేజస్ట్రీటుగారా కేసునువెంటనే రికార్డుతోఁ గూడ జడ్జీకోర్టునకుఁ బంపివేసిరి భీమశంకరము గారు నాలుగు వందలు ఫీజునిచ్చి యొకవకీలుని నియమించిరి. వేంకటేశము వద్దఁ బుచ్చుకొనిన కన్యాశుల్కము పండ్రెండు వందలలో నింక మిగిలినవి నాలుగువందలే కదా? కేసు వాయిదానాటికి ఆసొమ్ముగూడ, కోర్టుఖర్చుల క్రిందను లంచముల క్రిందను పంతులుగారు వెచ్చింపవలసి వచ్చెను. కన్యావిక్రయ విత్తమున నాయన పాపమొక కాసైన నిలుఁగడు వాయిదానాటికి వేంకటేశమును, పోలిశెట్టిని, నీలాద్రిని పోలీసువారు కోర్టువద్ద హాజరుగా నుంచిరి. ఇంతియేకాక కోర్టువారి శెలవుప్రకారముగ, సత్యానందము, రామారావుగారును, చకోరాక్షితల్లియు మొదలగువారుగూడ నానాఁడు విచారణకు హాజరైరి. ఆనాఁడు విచారణ వినుట కెందఱో పురవాసులు కోర్టు వద్దకు వచ్చిరి.

ఆనాఁడు మధ్యాహ్నము పదునొకండుగంట లగుసరికి జడ్జీగారు కోర్టుకు దయచేసి న్యాయపీఠముపై నధివసించిరి. తోడనే కేసు విచారణ యారంభమయ్యెను. సాక్షులును, ముద్దాయిలును జడ్జీగారియెదుట హాజరైరి. గవర్నమెంటువకీలైన యుమాకాంతారావుగారు ప్రథమసాక్షియగు చకోరాక్షితల్లి నచ్చట నుండనియోగించి, తక్కటివారి నావలకుఁ బంపివేసిరి. బోనులో నిలుచఁబెట్టి కోర్టుపద్ధతిప్రకారము ప్రమాణముఁ జేయించిన తరువాత నుమాకాంతారావుగారు చకోరాక్షితల్లిని నిట్లు ప్రశ్నింపనారంభించిరి.

'నీపేరు'

'చంద్రరేఖ'

'వృత్తి?'

'బోగంపృత్తి'

'నీవయస్సెంత?'

'అరవై యేళ్లు బాబు'

'బలవంతముగా చంపబడ్డ చకోరాక్షి నీకేమవుతుంది?'

'నా పెద్దకూతురు'

'ఆమె వయస్సెంత?'

'చచ్చిపోయేసరికి కిరవై నాలుగేళ్లు ఎలిపోయాయి'

'చకోరాక్షి యెవరి ప్రాపకంలో వుండేది?'

'సిన్నప్పుడొక జమీందారయ్య ప్రాపకంలో వుండేది. కాని ఆయన పొగ్గసేడు బాబయ్యా'

'అప్పటినుండీ చకోరాక్షి నెవళ్లూ ప్రాపకం వుంచుకోలేదా?'

'లేదు'

'సరే! పోనీ! తరుచుగా నీయింటికి కెవళ్లు వస్తుంటారు.

'ఒకళ్లా! యిద్దరా! అంతా వస్తావుంటారు!

'అలాకాదు. అందరికన్నా చకోరాక్షితో యెక్కువసంబంధం కలవా డెవడు?'

'యెంకటేశంపంతులు'

'వెంకటేశం నీయింటికి రావడం ఆరంభించి యెంతకాలం అవుతుంది?'

'రెండు చంవచ్చరాలవుతాయి'

'ఈరెండు సంవత్సరాల్లో నీకు నెలకెంత యిస్తావుండేవాఁడు'

'నెలకి పది రూపాయిలు'

'సరే! సత్యానందరావుని నువ్వెఱుఁగుదువా?'

'ఎరుగుదును బాబూ!

'ఏలాగెరుగుదువు? అత డెప్పుడేనా నీయింటికి వచ్చాడా?'

'రాలేదు కాని నాసిన్న కూతుర్ని కులంలోంచి తీసేసి పెళ్లి సేసికోవా లని సూస్తుండోడు.'

'అతన్ని పెళ్లాడ్డానికి నీచిన్నకూతు రొప్పుకున్నాదాలేదా?'

'ఒప్పుకోన్నాది బాబూ!'

'నీచిన్నకూతురు సత్యానందాన్ని పెళ్లాడడం నీకిష్టవేఁనా?'

'లేదుబాబూ! అందుకే యేడుస్తుండేదాన్ని.'

'చకోరాక్షికికూడా యిష్టంలేదు కాబోలు?'

'ఎందుకుంతాది బాబూ! పెళ్లి చేసేసి మాకూట్లో మాఁవేలుగ్గోసు కొంతాఁవా?'

'పోనీ! వెంకటేశం నీయింటికి తరుచుగా వస్తూవుండేవాఁడు కదా? నీచిన్నకూతురు పెళ్లి చేసుకోవడం వానికిష్టవేఁనా?'

'లేదు బాబూ'

'నీచిన్నకూతురికి కన్నెరికం చెయ్యడానికి వెంకటేశానికి వుద్దేశం వుండీదా?'

'సిత్తం. వుండేదిబాబూ!'

'అయితే కన్నెరికం చేశావా?'

'లేదు'

'ఎందుచేత?'

'నాసిన్నకూతురొప్పుకోలేదు. పెద్దకూతురొప్పుకోలేదు'

'సత్యానందాన్ని పెళ్లాడ్డంకోసం చిన్నకూతురు వొప్పుకోలేదు కాని, చకోరాక్షికిష్టం లేకపోవడానికి కారణంయేవిఁటి?'

'యెంకటేశం సామ్మియ్యక తిప్పి లెడతాడని సెప్పివొప్పుకుందికాదు'

'చకోరాక్షి వొప్పుకోకపోతే, వెంకటేశం దాంతో దెబ్బలాడకుండా వూరుకోన్నాడా?'

'వూరుకోలేదుబాబూ! యెప్పుడొచ్చిన దెబ్బలాడుతూనేవుండోడు'

'దెబ్బలాటనగా:—ఎప్పుడేనా తన్నేడా?'

'నాను సూపులేదుకాని తన్నేడని ఒకపాలి మాయమ్మి సెప్పింది'

'నీ చిన్నకూతురు సత్యానందాన్ని వరించిందని వెంకటేశం యెప్పుడేనా హాస్యం ఆడుతూవుండేవాడా?'

'సిత్తం?'

'ఏఁవని?'

'తలుపుతోసుకోని యింట్లో కొచ్చేటప్పుడు ఔరు బాబూ అని యడిగితే నవ్వుతూ నేను సత్తేనందాన్నని సెప్పుతూవుంటాడు'

'చకోరాక్షి చంపబడ్డ తొలినాటిరాత్రి నీయింటి కెవళ్లువచ్చారు?'

'సత్తానందం'

'ఆవచ్చినప్పుడు నువ్వు సత్యానందాన్ని చూశావా?'

'లేదుబాబూ'

'చూడకపోతే సత్యానందంవచ్చాడని నీకెలా తెలిసింది?'

'తలుపు తోసినప్పుడు నవ్వుదైతే ఔరని అడిగాను. నేనూ సత్తానందాన్నని సెప్పినాడు'

'అప్పుడు నిజంగా సత్యానందఁవే వచ్చాడని నీవనుకొన్నావా?'

'సిత్తం'

'అయితే! నువ్వావచ్చి సత్యానందం నీయింటికి రావడానికి కారణం యేఁవిటో ఎందుకు కనుక్కోలేదు?'

'వల్లమందునిసాణో తొంగోని లేవలేక గదిలో మా చకోరాచ్చి వున్నాదికదా అని వల్లకున్నాను బాబూ!'

ఉమాకాంతారావుగారు ఆ ముసిలిదాని నంతతోఁ బ్రశ్నించుట చాలించి యామె నావలకుఁ బంపివేసి తరువాత తమలపాకులదుకాణదారుని, నీళ్లకావడిబ్రాహ్మణుని ఒకరితరువాత నొకరినిఁ బిలిపించి విచారించిరి. కాని వారిరువురునుగూడ ఆనాడు చెఱువుగట్టుమీద రామారావుగారికిఁ జెప్పిన

ట్టులే అక్కడకూడఁ జెప్పిరి. తరువాత సుమాకాంతారావుగారు రామారావు గారినిఁ బిలిపించి వాని కులనామవయోవృత్తులనడిగి, ప్రమాణముచేయించి యిట్లు విచారించిరి.

'రామారావుగారూ! ఈ ఖూనీ చేసినట్లు మీ కెప్పుడు తెలిసినది?'

'17 వ తేదీనాటి ఉదయమున నేను స్టేషనుకు వెళ్లుచుండగా ఖూనీ జరిగినదనిన్నీ వెంటనే రమ్మనిన్నీ యిన్స్పెక్టరుగారు నబురంపించినందున వెళ్లినాను.

'మీరు శవమును జూచినారా?'

'చూచినాను'

'ఎక్కడ?'

'చెఱువులోనుండగా చూచినాను'

'ఒంటిమీద కత్తిదెబ్బ లేమైనా వున్నాయా?'

'మెడమీద పెద్ద గాయమున్నది కాని శరీరముపై నొకటిరెండు నఖ ములుతప్ప నంతకన్న నెక్కుడు లేవు '

'ఆ స్త్రీ యెక్కడ నరకబడ్డదో కనిపెట్టారా?'

'నేను జూచుసరికి మెట్లమీద దట్టముగ రక్తపుమచ్చలున్నవి'

'ఈ కేసులో పనిచేసినప్పుడు మీకు దొరికిన భోగట్టా అంతా మాకు వినిపిస్తారా?'

'చిత్తము. ఇదిగో వినుఁడు'

ఆనాడు చెఱువునద్ద, నేను పోవుసరికి జనసమూహములో పోలీసు ఇన్స్పెక్టరుగారును, కొందఱుజవానులు నుండిరి. అచ్చట శవమును పరీక్షించుచుండ మొదట వేంకటేశము నాయొద్దకు వచ్చి అతోలినాటిరాతిరి పంద్రెండుగంటలకు చెఱువుగట్టుమీదఁ దాను సత్యానందముగారు జూచినట్లు చెప్పెను. తరువాత తమలపాకుల దుకాణదారుఁడును న్నీళ్లకావడి బ్రాహ్మణుఁడును గూడ నా యర్ధరాత్రమునవే సత్యానందమును జూచినట్లు చెప్పిరి.

తోడనే సత్యానందముపై మాకనుమానము జనించినందున నేను ఇన్స్పెక్టరు గారును గలసి వాని బసకుఁ బోయితిమి. మేము పోవుసరికి సత్యానందము గదిలో నిద్రించుచుండెను. తలుపులు తట్టి నేను సత్యానందమును రెండు మూడు సారులు పిల్చితిని. వెంటనేయతఁడు తలుపు తీసెను. అప్పుడాతఁడు తొడిగికొని యున్నషర్టుమీదను పంచమీదను చిన్నచిన్న రక్తపుఁ జిహ్నలుండుటయే కాక, గోడకుఁ దగిలింపఁబడిన తెల్లని కోటునిండ విశేషరక్తముండుటచేత వానిని నేరస్థునిగా భావించి మేము స్టేషనుకుఁ దీసికొనివచ్చి ఎరస్టుచేసితిమి. మొదటినుండియు సత్యానందము తా నానాటి రాత్రి పోలిశెట్టిసద్దకుఁ జందాకొఱకుఁ బోయె ననియే చెప్పుచుండెను గాని, మఱియొక మాట చెప్పలేదు. రాజమార్గము నడుచుటకు వీలులేకుండ మ్యునిసిపాలిటీ వారిచేత మరమ్మత్తు చేయింపఁబడుచుండుటచేత తా నాతోవను విచ్చుటకుఁ గారణ మైనదని సత్యానందరావు చెప్పినమాట యథార్థము.

సత్యానందరావు ఎరస్టులోనున్న దినములలో మాకుఁదెలిసిన క్రొత్త సంగతులవలనఁ గూనీ చేసినవాఁడు అప్పటికి ప్రథమసాక్ష్యముఁ జెప్పిన వేంకటేశమేకాని, సత్యానందరావుకాడని స్పష్టమగుచున్నది. అందు దృష్టాంతరములు చిత్తగింతురు గాక—చకోరాక్షి చెల్లెలెచ్చటికో పారిపోయినదని దాని తల్లిపేర నొక రిపోర్టువ్రాసి వేంకటేశము స్టేషనులో దాఖలు చేసెను. అప్పుడు మా ప్రశ్నలకు వేంకటేశముచెప్పిన ప్రత్యుత్తరములవలన చకోరాక్షికి వేంకటేశముముఖ్యమైన విటుఁడని మాకు స్పష్టమైనది. కోర్టువారియెడుటఁ జకోరాక్షితో దనకు సంబంధ మున్నట్లు వెంకటేశమొప్పుకొనునో లేదో యని అప్పుడే యాతఁడు చెప్పిన ప్రత్యుత్తరముల రికార్డుచేసి వెంకటేశముచే సంతకముఁ జేయించినాము. ఆరికార్డు కోర్టువారియెదుటనే యున్నది. ఈసంగతివలన వెంకటేశము చకోరాక్షికి ముఖ్యమైన విటుఁడనుటకు సందేహము లేదు.'

'రామారావుగారూ! వెంకటేశము చకోరాక్షికి విటుఁడైనమాత్రము చేత అతఁడే ఖూనీచేసినట్లు మీకనుమానం యెలాకలిగింది?'

'చిత్తము. మనవిఁ జేసుకుంటాను. అంతకుఁ బూర్వము చకోరాక్షి చెల్లెలైన తిలోత్తమను రప్పించి చకోరాక్షికి విటులు వ్రాసిన యుత్తరముల కట్ట తెప్పించితిని'

ఆయుత్తరములలో వెంకటేశము చకోరాక్షికి వ్రాసినయుత్తరములు రెండున్నవి. ఆ యుత్తరములు చిత్తగించినచోఁ ఖూనీచేసినవాఁడు వెంకటేశమే కావలయునని గ్రహింపవచ్చును. ఇదిగో మొతటి యుత్తరము కోర్టు వారికి వినిపించుచున్నాను.

''మై డియర్ చకోరాక్షికి.—

నువ్వు పంపించిన వుత్తరం నాకందింది. నిన్నా మొన్నా నీయింటికి రాకపోడానికి కారణం యేఁవిటని రాశావు. నీతో స్నేహం చెయ్యడంవల్ల నామాట యేఁవీ సాగలేదు. నీచెల్లెలికి కన్నెరికం చెయ్యడానికినాకు ముఖ్యంగా వుద్దేశంవుందని నీకుతెలిసినప్పటికి నువ్వు పైసంబంధాలు వెదకడం ఆశ్చర్యంగావుంది. నీకంటికి నేనంత నీచంగా కనబడుతున్నానుకాబోలు! ఇకనయినా బుద్ధితెచ్చుకొని నేను చెప్పినమాట విను. నిష్కారణంగా నాకు కోపం తెప్పించవద్దు. నిండా కోపం వస్తే నేనెంత సాహసఁవేనాచేసేస్తానని నువ్వెరుగుదువు. మంచిచెడ్డా నువ్వేఆలోచించు. ఎప్పటికేనా నీచెల్లెలే నాకు పనికొస్తుందని యింతకాలం నీయింటికివచ్చానుకాని, నీమీదమోహంచేత కాదు. ఇందుకు జవాబు పంపితే చూసి యిష్టంవుంటే మీయింటికి వస్తాను.

గ్రహించవలెను

వేంకటేశము''

ఇది రెండవయుత్తరము. దీనినిఁగూడఁ జిత్తగింపుఁడు.

"మై డియర్ చకోరాక్షికి—

తిలోత్తమ కన్నెరికం విషయంలో నీకింకా బుద్ధికుదరకుండావున్నాది తిలోత్తమ సత్యానందాన్ని వరించడంచేతకన్నెరికానికిష్టపడకుండావుందని యొకశంకపెట్టేవు. ఆలాగైతే సత్యానందాన్ని మూడు నిముషాల్లో మహమ్మాయం చేసేగలను. అప్పుడు తిలోత్తమకు నేనే దిక్కవుతానుకదా! అప్పుడేనా నువ్వు కన్నెరికం చేయిస్తానని నాకునమ్మకంలేదు నువ్వెంతదాచినా నీస్వభావం నే నెరక్కపోలేదు. ముఖ్యఁమైనసంగతి ఇందుకు నువ్వే అభ్యంతరం పెడుతున్నావు నువ్వు బతికున్నంతకాలం తిలోత్తమ నాకుదక్కదని నాకుతెలుసును. నిష్కారణంగా యింతస్నేహం విడిచిపెట్టి నిన్నేమీఁచెయ్యలేకుండా వున్నాను. నీయాటంకం లేక కొలది రోజుల్లోనే తిలోత్తమ నాకు దక్కడానికి యేర్పాటు చేసుకుంటూవున్నాను. ఇంక పదేపదే నిన్నడగడం కార్యంలేదు. నువ్వు నాకేవుత్తరాలు రాయవద్దు.

గ్రహించవలెను.

వేంకటేశము."

ఈరెండుత్తరములవలన వెంకటేశము తిలోత్తమకొఱకుఁ జకోరాక్షినిఁ గూనీ చేసినట్లు మాకుఁదెలిసినది. ఇంతేకాక ఈవిషయములో మఱియొక నిదర్శనము కోర్టువారు చిత్తగింపవలయును. వెంకటేశము తన కాపోసనముహూర్తమునాడు పంచలచాపు లిమ్మని పోలిశెట్టికి నుత్తరము వ్రాసి నీలాద్రిచే పంపించెను. శెట్టి తన బాకీసొమ్ము వెంకటేశ మీయనందున బట్ట లీయలేదు. అందుచే వేంకటేశము తాను స్వయముగా సెట్టిపద్దకుఁబోయి మాటాడి పంచలచాపు లీయనందున నాతఁడు షాపులో లేనప్పుడు ఒకవాచీ, ఒక లవండరుబుడ్డి, పట్టురుమాలు, 'మల్లుతాను' దొంగతనముగఁ దీసికొని యింటికిఁ బారిపోయెను. వెంటనే సెట్టి యీసంగతి పోలీసుస్టేషనునకు రిపోర్టుచేసెను. ఆ మరునాఁ డుదయమున వేంకటేశమును స్టేషనునకుఁ బిలిపించి విచారించినాము. వెంకటేశము పంచలచాపుకొరకు సెట్టిపద్దకుఁ దాను బోలేదని చెప్పె

టవల్ల పోలిశెట్టి, వెంకటేశము తనకు బట్టలిమ్మని వ్రాసినయుత్తరము మాకుఁ జూపించెను. ఆ యుత్తరముకూడ వెంకటేశమే ఖూని చేయుటకుఁ గారణమని చెప్పుచున్నది. కోర్టువా రీయుత్తరమును చిత్తగింతురుగాక.'

అని చెప్పి రామారావుగారు, పంచలచాపులకై వెంకటేశము నాడు పోలిశెట్టికి వ్రాసిన యుత్తరమును వినిపించి,

'ఈ యుత్తరము మేము చూచిన వెంటనే పోలిశెట్టివద్ద సొమ్ము పుచ్చుకొనుటకుఁ గారణమేమని వెంకటేశము నడిగితిమి; కాని యతఁడు సరియైన సమాధానముఁ జెప్పలేదు. మే మంతతో విడువక పోలిశెట్టితాలూకు చిట్టాపుస్తకమును తెప్పించి వెంకటేశ మే తారీకున పోలిశెట్టివద్ద సొమ్ముఁ బుచ్చుకొనెనో పరీక్షించితిమి. క్రిందటినెల 16 వ తేదీ శుక్రవారమునాడు వెంకటేశము శెట్టివద్ద పదునైదు రూపాయిలు పుచ్చుకొనెను. 17 వ తేదీ వుదయముననే శవము బైలుపడినది. అందుచే మీద నుత్తరము నాధారముగఁ జేసికొని చకోరాక్షినిఁ గూర్చియే యీ విషయమునందే వెంకటేశము శెట్టివద్ద సొమ్ము బుచ్చుకొనినట్లు స్పష్టమైనందునను, తిలో తను దాఖలుచేసిన యుత్తరముల వలనను, వెంటనే వెంకటేశమును, పోలిశెట్టిని, సేలాంద్రిని ఎరష్టుచేసి సత్యానందమును జామీనుపై విడుదల చేయడమైనది'

'రామారావుగారూ! ఆనాటిరాత్రి సత్యానందం, చంద్రాకొలను తన యింటికి వచ్చినట్లు సెట్టి వొప్పుకొన్నాడా?'

'మొదట వెంకటేశాదుల దుర్మంత్రమువల్ల నొప్పుకొనలేదు కాని, క్రిందికోర్టువిచారణలో, ఆ రాత్రి తనయింటికి సత్యానందము వచ్చినట్లును, తా నింట లేనందునఁ బండ్రెండుగంటలవఱకుఁ దనకై వేచియుండినట్లును, తరువాతఁ దాను వచ్చి సత్యానందముతో మాటాడి పంపివేసినట్లును, మేజస్ట్రేటుగారివద్ద నొప్పుకొనెను.'

రామారావుగా రిచ్చిన స్టేటుమెంటుప్రకారము ఖూనీచేసినవాఁడు వెంకటేశమే యని యన్నివిధముల స్పష్టమగుచున్నది. అందుకుఁ దోడుగ

మొదటఁ జకోరాక్షితల్లి చెప్పినసాక్ష్యముఁగూడ వేంకటేశముపై నేరమును బలపరచినదికదా? గవర్నమెంటు ప్లీడరగు ఉమాకాంతారావుగారు, తమకుఁ గావలసిన యంశములను సాక్షుల నడిగి విచారణజేసినంతనే తిరువెంగళ స్వామిగారు లేచి, సాక్షులు చెప్పినయంశములను ఖండించి, వేంకటేశము నేరస్థుఁడు కాడనివాదించుట కుపక్రమించిరి. భీమశంకరముగారు తమ యల్లు నిపక్షమున వాదించుటకు నియమించిన వకీలు ఈ తిరువెంగళస్వామిగారే! మొదటఁ జకోరాక్షి తల్లిని బోనులోని కెక్కించి తిరువెంగళస్వామిగా రిట్లు ప్రశ్నింపఁజొచ్చిరి.

'ఆరాత్రి నీయింటికి వచ్చినవాఁడు ఎన్నిగంటలుదాకా చకోరాక్షి వద్ద వున్నాడో నువ్వెరుగుదువా?'

'బాబూ! పదకొండో పదకొండున్నరో అవుతా దనుకుంటాను.'

'వెళ్లిపోయేటప్పుడు నీతో చెప్పేడా?'

'అతడాగో నాకు తెల్దుకాని మా యమ్మిమాత్రం నన్నులేపి, వుచ్చ వంలో కెళ్లొస్తాను. యీ తలుపేసుకోయేయని సెప్పి యెలిపోయింది బాబూ'

'నువ్వులేచి తలుపు వేసుకున్నప్పుడు నీ కూతు రెవరివెంటేనా వెలుతూ వున్నట్లు నువ్వు చూశావా?'

'సూసినానుకాని యెవళ్లో ముందు ముసుగేసుకోని యెలిపోతున్నారు. ఆత డెంట నా కూతు రెల్తున్నాది. సీకట్లో ముందెల్తున్నా యన్ని పోల్చుకో లేకపోయాను.'

'నీ కూతురు నరకబడ్డట్లు నీ కెలా తెలిసింది?'

'బాబూ! తెల్లవారిం తరవాత మా యమ్మి యింటికిరాకపోతే యిక్క డా అక్కడా యెతుక్కుంతూ యెలిపోతున్నాను. అప్పుడు తోవలో యీళ్లూ ఆళ్లూ అనుకొన్న మాట విని సెరువుకి పరుగెత్తి సూసేసరికి అక్కడ యెంకటేశంబాబూ, పోలీసోళ్లూ, ఇంకా పదయోళ్లూవున్నారు'

'నీ కూతురు వొంటిమీద సరుకు లేవేనా పోయాయా?'

'తొలోజు నీళ్లోసుకోడానికి సరుకులన్నీ తీసేసింది బాబూ! మురగులు-తమ్మెట్లు-అందెలు-కడియాలు మాత్రం తియ్యలేదు. నేను సూసేసరికి శవాని కవన్నీ వున్నాయి బాబయ్యా!''

అప్పుడుమాకాంతారావుగారు అంతవరకు మీదిసంగతులు విని చక్రాక్షి తల్లినిఁ జూచి

'సత్యానందానికీ, నీ కూతురికీ పడదని చెప్పేవుకదా! ఆనాటి రాత్రి నీ యింటికి వచ్చినవాడు సత్యానందఁవే అయితే అతడివెంట నీ కూతు రలాగ వెల్తుందని నువ్వునమ్ముతావా?

'ఎలా నమ్మకుంతాను బాబూ? అతడికీ మాకూ పడదు. అతగాడి యెంట మాయమ్మి యెందుకెల్తాది?'

ఉమాకాంతారావుగారు ముసిలిదాని నిట్లు ప్రశ్నించినంతనే తిరువెంగళస్వామిగారు తమలో నేమో యాలోచించి వెంటనే యామె నావలకుఁ బంపివేసి తమలపాకుల దుకాణదారుని, నీళ్లకావడి బ్రాహ్మణుని వరుసగ రప్పించి విచారించిరి; కాని మొదటినుండియుఁ జెప్పచుండిన సంగతులే అప్పుడుకూడ వారు చెప్పినందున తిరువెంగళస్వామిగారు రామారావుగారిని బోనులోని కెక్కించి యిట్లు విచారించిరి.

'రామారావుగారూ! 17వ తేదీ వుదయాన్ని చెఱువుగట్టుమీఁద మీరు వెంకటేశాన్ని యీ భోగట్టా యేఁవేనా తెలుసునాయని యడిగారుకదూ?'

'నే నడగలేదు. వెంకటేశము తనంతఁ దానే వచ్చి చెప్పెను'

'సరే! సత్యానందం ఆదారి వొచ్చినంతమాత్రాన్నే వాని బట్టలకు రక్తపట్టడానికి కారణంయేఁవిటి?'

'ఆదారిని వచ్చుచున్నప్పుడు, తాను బహిర్భూమికిఁ బోవలసి వచ్చుటచేఁ దనకోటు విప్పి మెట్లమీద నుంచి, చెఱువుగట్టు క్రిందకుఁ బోయెను. ఆ యొడ్డునకెల్ల ఆయొక్కరేవే యుండుటచేత, అక్కడనే యదివఱకుఁ గూనీ

జరిగి యుండ వచ్చును గాన మెట్లమీద నున్నరక్తము తన కోటున కంటి యుండునని సత్యానందము క్రిందికోర్టులోఁ జెప్పెను'

'అయితే కోటు కంత రక్తం తగిలివున్నప్పుడు సత్యానంద చూసుకొని వుండడా?'

'తడిగా నున్నందున మెట్లమీద నున్న నీటిచేఁ దనకోటు తడసిన దనుకొనెను గాని, ఆ చీకటిలో నది రక్తమని తాను పోల్చుకొన లేదని సత్యానందము చెప్పినాడు.'

'తిలోత్తమ యిచ్చిన రెండుత్తరాల్లో యేసంగతులను బట్టి మీరు వెంకటేశం ఖూనీచేసినట్లు గ్రహించారు?'

'మొదటి యుత్తరమువలన, వెంకటేశము తిలోత్తముకొరకుఁ జాల ప్రయత్నించుచున్నట్లును, అందుకుఁ జకోరాక్షి యొప్పుకొనకుండినట్లును, వెంకటేశ మెంత సాహసమైనఁ జేయఁజాలునంతటి కోపముఁ గలవాఁడ నియుఁ దెలియుచున్నది. రెండవయుత్తరము, తాను, చకోరాక్షినిఁ బదే పదే ప్రార్థింప నక్కరలేకుండ నేర్పాటుఁ జేసికొనుచున్నట్లును, స్నేహబల ముచేత వెనుదీయుచున్నట్లును, వెంకటేశము వ్రాసినంగన, బ్రతికియున్నచోఁ జకోరాక్షి తనకుఁ దిలోత్తమను దక్కనీయదని వెంకటేశ మామెను ఖూనీ చేసినట్లు స్పష్టమగుచున్నది'

'తిలోత్తమ కనపడలేదని, చకోరాక్షి తల్లితరఫున వెంకటేశం రిపోర్టిచ్చాడుకదా? అందుమీద మీరేమిఁ చర్య జరిగించారు?'

'అప్పటి నుండియు నా ప్రయత్నముఁ జేయుచున్నాము కాని నేటి వరకుఁ దిలోత్తమజాడ మాకుఁదెలికున్నది'

తిరువెంగళస్వామిగా రంతతో రామారావును విచారించుట చాలించిరి. తరువాత సుమాకాంతారావుగారు, ఇదివరకువచ్చిన ఋజువులన్నియుఁ గ్రోడీకరించిచెప్పి, వేంకటేశమే ఖూనీ చేసినట్లు కోర్టువారియెదుట నిర్ధారణఁ

జేసెను. తరువాత తిరువేంగళస్వామిగారులేచి వేంకటేశము నిరపరాధుండుగా డని ఆ యారోపణల నీక్రిందివిధముగ ఖండింపనారంభించిరి.

'కోర్టువారింతవరకూ జరిగినవిచారణ వింటూనేయున్నారు. ఇందులో నీళ్లకావడి బ్రాహ్మణుండున్నూ, తమలపాకుల దుకాణదారుడున్నూ, తప్ప తక్కినవారి సాక్ష్యము లంతగా నమ్మతగినవికావు. ఆనాడురాత్రి తనయింటికివచ్చిన పురుషుడు సత్యానందవేయని స్పష్టంగా తెలిసిననూ, చకోరాక్షితల్లి ఆసంగతి సందేహాస్పదంగా చెప్పినది. అందుకు కారణమేమంటే! తనరెండోకూతురెక్కడికి పారిపోయిందని విచారిస్తూవున్నందున, ఆమెను వెతకించి తెప్పించడంలో రామారావుగారి సాహాయ్యం అపేక్షించి, వారి ప్రోద్బలంచేత ఆమె అట్టిసాక్ష్యం చెప్పిందికాని బుద్ధిపూర్వకంగా కాదు. తరువాత పోలిశెట్టి సాక్ష్యంకూడా అట్టిదే! ఆనాడురాత్రి సత్యానందం తనయింటికి రాలేదని మొదట యథార్థమే చెప్పినను, కోమటియగుటచేత, నిటీవల సహజమైన భయంచేతనో, పోలీసువారి నిర్బంధంచేతనో, తనయింటికి సత్యానందం వచ్చినట్లే చెప్పినాడు. అందుచే వాని వాఙ్మూలములకూడ లేశమునూ పనికిరాదు. ఇంక రామారావుగారు సత్యానందానికి ప్రాణస్నేహితులగుటచేత, ఆయన వానిపక్షం వాదించుటవింతగాదు. తిలోత్తమవద్ద వారుసంపాదించిన రెండువుత్తరాలు, వెంకటేశము కూనీచేశాడనుటకు లేశమైనా ఆధారములు కానేరవు. అందులో మొదటియుత్తరమున వెంకటేశానికి తిలోత్తమపై మోహమున్నట్లుతప్ప, ఒకయక్షరమైనా వెంకటేశానికి దురుద్దేశమున్నట్లు కనపడదు. 2-వ యుత్తరం. చకోరాక్షిని భయపెట్టి, తిలోత్తమను దక్కించుకొనుటకుతప్ప మరొకవుద్దేశంతో వెంకటేశంవ్రాయలేదు. 'ఇంక నీయాటంకం లేకుండా కొద్దిరోజుల్లోనే తిలోత్తమ నాకు దక్కడానికి యేర్పాటుచేసుకుంటున్నాను.' అను వాక్యము వెంకటేశం దురుద్దేశంతోనే వ్రాసినట్లు రామారావుగారు భావించడం ఆశ్చర్యంగావున్నది. ఆయేర్పాటు చకోరాక్షిని కూనీచేయుటకేయని కోర్టువారు తలంు

చుట ధర్మముకాదు. ఇంతకూ అట్టేయనుకోనవలసిన యవసరమేమి? ఎవరికిని తెలియకుండ తనకు మోహంవున్న తిలోత్తమను, పట్టుకొని యెచ్చటికైనా తీసికొని పోవుటే వెంకటేశం చేసిన యేర్పాటని యేలభావించరాదు? కావున నేవిధంగా చూసినను చకోరాక్షిని కూనీచేసే వుద్దేశం మొదటినుండి వెంకటేశానికిలేదు. ఈయుత్తరములలోనూ, సాక్షులు చెప్పిన సంగతులలోనూ, అందుకు తగిన నిదర్శనములు కనపడలేదు. తనకోటుకు కంత రక్తం అంటుకున్నప్పటికిని సత్యానందం తాను పోల్చుకోలేకపోయెనని చెప్పిన మాట నమ్మతగినదికాదు. తమలపాకుల దుకాణమువాడును, నీళ్లకావడి బ్రాహ్మణుడును చెప్పినమాటలు యథార్థం. అందుచే కూనీచేసినవాడు సత్యానందవేఁ కాని వెంకటేశంకాదు.'

అని చెప్పి తిరువెంగళస్వామిగారు కూర్చుండిరి. పాప మీ వకీలుగారు వేంకటేశము నేరస్థుఁడుకాడని సమర్థింపఁ బ్రయత్నించిరికాని, వారు ఖండించిన యంశములు తగినంత బలముగాలేవు. భీమశంకరముగారి వద్దఁ దామునాలుగు వందలు రూపాయిలు ఫీజాపుచ్చుకొనినందున, కోర్టులో వేంకటేశము పక్షమున ఆనాలుగు మాటలైనఁ జెప్పకుండుట భావ్యముకాదని తలంచి, వారు మీదిసంగతులను జెప్పినట్లు కనఁబడుచున్నది. తిరువెంగళస్వామిగారు చెప్పిన సంగతులను వినిన తరువాత సుమాకాంతారావుగారు లేచి

'కోర్టువారింకొక మనవి వినవలసియుంటుంది. ప్రస్తుతం తిలోత్తమ యెక్కడ కనబడకుండ పారిపోయిందను సంగతి ఆధారంగా జేసుకొని మొదటినుండీ వెంకటేశము యేర్పాటు బలవంతముగ తిలోత్తమను పట్టుకొని యెచ్చటికేనా పారిపోవుటకేకాని, చకోరాక్షిని కూనీచేయుటకుకాదని తిరువెంగళస్వామిగారు తమచెప్పిన సంగతులలో సారాంశమును తేల్చినారు. కావ్న తిలోత్తమ యెచ్చటికి పారిపోయిందో కోర్టువారు వెతికించి ఆమెవచ్చుదాకా విచారణ ఆపుచేయించవలసియుండును.'

అనిచెప్పఁ గోర్టువారందుకు సమ్మతించి ఆనాటికి విచారణఁ జాలించి, తిలోత్తమను సకును పంపించిరి.

# ప్రకరణము—17.

---

## జడ్జిమెంటు.

తిలోత్తమ పేరఁ గోర్టువా రిచ్చిన సమను గైకొని యొక కనిస్టేబు లామెకొఱకుఁ బట్టణమంతయుఁ దిరుగఁజొచ్చెను. కాని తిలోత్తమ వాని కెచ్చటను గానరాలేదు. నాటినుండియుఁ దన కూతు రింటికి రాలేదనియు నేమైపోయినదో తెలియదనియుఁ దిలోత్తమతల్లి చెప్పి ఆ కనిస్టేబు ఎదుట రోదన మారంభించెను. ఎవరైన నామెను దాచియుంచి రేమో యని యతఁడు సానివీధియందు ప్రతియింట వెదకెను. కాని కార్యము లేకపోయినది. తిలోత్తమ యెచ్చటికిఁ బాఱిపోయినదో రామారావునకుఁగాని, సత్యానందరావునకుఁగాని లేశముఁ దెలియదు. వా రిరువురు నామెను గూర్చియే నిరంతరము విచారించుచుండిరి. తిలోత్తమ తన తల్లిపోరు భరింపలేక బలవంతముగఁ బ్రాణత్యాగ మొనర్చుకొనియుండునని యెంచి, సత్యానందరావు నిద్రాహారములు లేక పాప మామెకొఱకు శుష్కించుచుండెను. కాని, తనతోఁ జెప్పకుండఁ దిలోత్తమ యెన్నఁడు నట్టి సాహసకృత్య మొనర్చియుండదనియు, ఆ యూరిలోనే యెచ్చటనో దాగి యుండునని యెంచి, రామారావుగారు విచారింప వలదని సత్యానందమునకు ధైర్యముఁ జెప్పుచు వచ్చిరి. తిలోత్తమసాక్ష్యము కోర్టులో నత్యవసరమైనందున నట్టి సమయమున నామె కనబడిన బాగుండి యుండునని మాత్రము రామారావుగారు తలంచుకొనుచుండిరి.

ఆ నాఁడా కనిస్టేబు సమను గైకొని తిలోత్తమకొఱకుఁ బట్టణమంతయుఁ దిరుగుచు రామసాగరము గట్టుపైనుండి వచ్చుచుండెను. అప్పుడు కోవెలపూజారి సమీపముననున్న రేవులో స్నానముఁ జేయుచుండుటఁ జూచి, ఆతఁ డచ్చటికిఁబోయి వానితో నిట్లు ప్రసంగించెను.

'ఏఁవండీ పూజారయ్యా! సిన్న వుపకారం సెయ్యాల. ఏఁవంతారు?'

'ఏఁవిటోయి? చెరువులో స్నానం చేస్తున్నానని నా పేరు రాసుకోడానికా వచ్చావు? అయితే రాసుకో! నేను చేరుమేనుగారింట్లో దేవతార్చన చేస్తూవుండడంచేత' ఆయన నా కార్డ రిప్పించారు తెలుసునా?'

'అదికాదయ్యా! బాపనయ్యా! ఎంగు కనుమానంపడతావు?'

'అయితే సరే! చెప్పు! నాకు చేతనైన సాయం చేస్తాను'

'ఆపొద్దు రాత్తిరి యీ సెర్లో సెకోరాచ్చి సెల్లెలు పడిపోడానికొచ్చిందంట. కాని యెవళ్లో తప్పించేశారంట. ఆపొద్దుటికాణ్ణుంచి మరి యెక్కడికెళ్లిపోయిందో కాని తెల్దు. వూరంతా యెతికేశాను. ఆబోగట్టా నీకేం తెలుసునా?'

'మీరు పోలీసువాళ్లు కదా? మీకే తెలియనప్పుడు నాకెలా తెలుస్తుందోయి నీ పిచ్చిగాని'

'అలాకాదు. శుకో్రరం శుకో్రరం అది యీ కోవిలకొస్తూ వుంటాదట. యీపొద్దు శుకో్రరం వస్తేమాత్రం కసింత కనిపెట్టాలి'

'యెలా కనిపెట్టడం. రెండు వారాల్నుంచి అది కోవిలకి రావడం లేదు. ఈవాళ వస్తుందని నమ్మకం యేఁవిటికాని దా నవసరం యిప్పు డెందుకొచ్చింది'

అని పూజారి యడుగుచుండ నింతలో నొక పురుషుఁడు వారిరువురి వద్దకు వచ్చి ఆ సంభాషణము వినుచు నిలిచియుండెను. కనిస్టేబు వానినిఁ జూచి

'కేశవరావుబాబూ! తిలోత్తఁవ సంగతి నీకేంతెల్సునా?'

'నాకేమీ తెలియదుకాని దాని యవసర మిప్పుడేలవచ్చినది?'

'రేప్రొ కూనీకేసు వాయిదా. అది కోర్టులో సాచ్చ్యంచెప్పాల. దా న్నెలాగేనా యెతికి తీసుకురావాలని రామారావుబాబు మరీ మరీ సెప్పేడు. ఎంత యెతికినా, కనబడదు. సత్తేనందం యెరష్టులో వున్నప్పుడు నువ్వేకదయ్యా వణ్ణం తెస్తూ వుండేవాడివి?'

'ఔను. నేనే. తిలోత్తమకోరకు సమనుకూడఁ దెచ్చితివాయేమి?'

'ఔనయ్యా! ఇదిగో సఁవను'

అని కనిస్టేబు కేశవరావునకుఁ జూపించెను. కేశవరావాసమను చదివి మరల వాని కిచ్చివేసెను. అప్పుడు పూజారి కనిస్టేబునుజూచి

'పూజవే శయింది. నే నింక పోతాను నువ్వు సమను నాచేతికియ్యి. మామూలుప్రకారం యీవాళ సాయింత్రం తిలోత్తమ స్వామి దర్శనానికి వస్తే దానికిదిచూపించి చెప్తాను. లేకపోతే లేదు.'

'పూజారయ్యా! నీమేలు వుండిపోను. రేప్పదిగంటలకి యెలాగేనా ఆ మనిషిని కోర్టుకు హాజరు చేయించాలి. సమనుచ్చుకో'

అని కనిస్టేబు వానికి సమనిచ్చి యచ్చటనుండి వెడలిపోయెను. ఆ మరునాఁడే మధ్యాహ్నమునఁ బదునొకండు గంటలకుఁ గోర్టువారు కూనీకేసు తాలూకు శేషభాగమును విచారించుటకు నిశ్చయించినందున నానాఁడు పది గంటలకే రామారావుగారును, చకోరాక్షితల్లియు, తమలపాకుల దుకాణదారుఁడు, నీళ్లకావడి బ్రాహ్మణుడు, ఉమాకాంతారావుగారు, తిరువెంగళస్వామిగారు, వేంకటేశము, నీలాద్రి, పోలిశెట్టిమొదలగువారందఱుఁ గోర్టు వద్ద హాజరైరి. కాని తిలోత్తమ మాత్ర మచ్చటనున్న వారిలో నెవ్వరికినిఁ గానరాలేదు. ఆమె దొరుకునో లేదో యని యుమాకాంతారావుగారును, రామారావుగారును, దీర్ఘముగ నాలోచించుచుఁ దమలో నేమియో గుసగుసలాడుకొనుచు నుండిరి. కొంతసేపునకు విచారణ సమయము సమీపించినది. జడ్జీగారువచ్చి న్యాయపీఠము నలంకరించినంతనే వారి సెలవుప్రకారము రామారావుగారు, ఉమాకాంతారావుగారు, తిరువెంగళస్వామిగారు, వేంకటేశము, నీలాద్రి, పోలిశెట్టియు లోనికిఁ బోయిరి. కోర్టుబంట్రోతు గుమ్మమువద్దకు వచ్చి 'తిలోత్తమా' 'తిలోత్తమా' అని బిగ్గరగ రెండుసారులు పిలిచెను. తోడనే కోర్టునకు సమీపమున నున్న మఱ్ఱిచెట్టుక్రిందఁ గల బండిలోనుండి యొక కన్యక తటాలునఁ గ్రిందికిదిగి చక చక కోర్టువారి యెదు-

టకు వచ్చెను. ఆమెనుజూచి రామారావుగారు, వెఱ్ఱివానివలె నిటు నటుఁ జూచుచు నత్యాశ్చర్య మొందుచుండిరి. ఏకారణముననో కాని వేంకటేశ మామె మొగముఁ జూడలేక తలవంచుకొని కన్నీరుఁ గార్చుచు, బైటకుఁ దోపకుండఁ దుడిచివేసికొనుచుండెను. కులనామవయోవృత్తులఁ గనుఁగొని ప్రమాణముఁ జేయించిన తరువాత నావా డామెను కోర్టువారే స్వయముగ విచారించుటకు నిశ్చయించిరి. కాని కోర్టులో జడ్జిగారిప్రక్క నుండవలసిన ఏసిసర్లు ఇరువురిలో నొకరు వేళకు రానందున వారు వచ్చువరకు విచారణ మాగిపోయెను. ఆ యిరువురి యేసిసర్లలో నొకఁడు వర్తకుఁడు, రెండవయతఁడానాడు వేంకటేశమునకు ఋణమిచ్చిన మోహనరావుగారు. ఆయనయే నాడింకను కోర్టునకు దయచేయలేదు. క్రమముగా పదునొకండు గంటలు కొట్టి యరగంటకాలమైనది. మోహనరావుగారు కోర్టున కింకను రానందున జడ్జిగారు తమలో నూరక నొచ్చుకొనుచుండిరి. కొంతసేపునకు గిరిజాలను జక్కఁగ దువ్వుకొని తల కొక గులాబిరంగుగల చెమ్లా చుట్టి, నీలిరంగుగల షేరాయియుఁ గోటును, మేజోడును జోడును దొడిగికొని రెండుచక్రముల త్రొక్కుడుబండిపైఁ గూర్చుండి తాము వచ్చుచున్నట్టు లందరికిఁ దెలియవలెనని గణ గణ మని గంట వాయించుచు, మోహనరావుగారు కోర్టువద్దకు వచ్చి తటాలునఁ ద్రొక్కుడుబండిపై నుండిదిగిసగముసగముఁ గాల్చుచున్న చుట్టను కడసారి రెండుసారులు తృప్తిదీరఁ గట్టిగఁబీల్చిపారవైచి, బైసికిలు నొక స్తంభమునకుఁ జేరవైచి, కోర్టులోనికిఁ బోయి జడ్జిగారికి సలాముచేసినంతనే యాయనమండిపడుచు, మారు మాటాడక ఆలస్యముగవచ్చినందుకుఁ గోర్టుపద్ధతి ప్రకారము మోహనరావుగారికి ఏబది రూపాయిలు జరిమానా విధించిరి. మోహనరావుగారు తమ యాలస్యమునకుఁ గారణములు చెప్పి క్షమింపుఁడని కోర్టువారినిఁ బ్రార్థించిరి కాని కార్యము లేకపోయినది. తరువాత జడ్జిగారు బోనులో నిలువఁబడియున్న తిలోత్తమనుజూచి యిట్లు విచారింప నారంభించిరి.

'బలవంతముగాఁ జంపఁబడిన చకోరాక్షి నీకేమగును?'

'ఆమె నాకు అక్క'

'నీయక్క చంపఁబడిన తొలినాటిరాత్రి మీయింటి కెవరువచ్చిరి?'

'వేంకటేశమును నీలాద్రియుఁ గలిసి వచ్చిరి'

'వారువచ్చుసరికి మీవీధి తలుపు తీసియుండెనా ? మూయఁబడియుండెనా?'

'మూయఁబడియే యుండెనుగాని గడియ మాత్రము వేయలేదు'

'వేంకటేశము తలుపుఁ ద్రోసుకొని లోపలికి వచ్చుసరికి నీవేమిచేయుచున్నావు?'

'మాయక్క గదికిఁ బ్రక్కనే యొక చీడీపైఁగలమంచముమీదఁ బరుండియుంటిని'

'అప్పుడు నీవు నిద్రించుచుంటివా ? మేల్కొనియుంటివా?'

'మేల్కొనియే యుంటినిగాని, నిద్రించుచున్నట్టులే కన్నులుమూసి పరుండియుంటిని'

'వెంకటేశములోనికిఁ దలుపుఁదీసికొని వచ్చినప్పుడు 'ఎవరది?' అని నీవు కాని మీతల్లిగాని అడిగినారా?'

'నేను నిద్రించుచున్నట్లు భావించి మాయమ్మయే యడిగినది'

'అప్పుడు వెంకటేశ మేమని చెప్పెను?'

'నేను సత్యానందాన్ని అని బదులుచెప్పెను'

'అట్లుచెప్పుట కేమికారణము?'

'నేను సత్యానందమును బెండ్లియాడవలయునని మొదటినుండియు నిశ్చయించుకొని యున్నందున నది మాతల్లికిష్టములేదని యెరిగినవాఁడగుటచే వెంకటేశ మామె నట్లుపరిహాసమాడుచుండుట మొదటినుండియు వాడుక'

'ఆనాటిరాత్రి వెంకటేశమును నీలాద్రియు వెన్నిగంటలవరకు మీయింటిలో నుండిరి?'

'వచ్చిన పావుగంటలోనే నీలాద్రి యెచ్చటికో బయలుదేరిపోయెను. కాని వెంకటేశము మాత్రము పదునొకండుగంటలవరకును మాయింటిలోనే యుండెను.

'ఆనాటిరాత్రి నీవుమీయక్కగదికి సమీపముననే పరుండియున్నట్లు చెప్పితివికదా? అప్పుడు వెంకటేశమునకును మీయక్కకును ఏమి సంభాషణము జరిగినదో నీకు వినఁబడెనా?'

'స్పష్టముగా వినఁబడలేదుకాని, కొన్నిసంగతులనుమాత్రము వింటిని'

'నీకు వినఁబడిన సంగతులేవియో చెప్పు'

'ఏదోయుత్సవము జరుగుననియుఁ జూచుటకు రావలయుననియు వెంకటేశము మాయక్కను బలవంతపెట్టుచుండెను. రాత్రివేళ నేనెచ్చటికి రాఁజాలనని మాయక్క చెప్పుచుండెను అందుమీద వెంకటేశము తనతో వచ్చినయెడల నేమిభయమున్నదనియు, రాకతీరదనియుఁ జెప్పి బలవంతముగ నామెను దీసికొనిపోయెను.'

'ఆమాటలన్నియు వినినప్పుడు నీకు వెంకటేశముపై నెట్టియనుమానమైన జనించినదా?'

'వెంకటేశము దురుద్దేశముతోనున్నట్లు నేనప్పు డనుకోలేదు. కాని, ఇదివరకెన్నఁడు నిట్లు నిర్బంధింపనివాఁడు నేఁడు తనవెంటరమ్మని మాయక్కను బలవంతపెట్టుట కేమికారణమోయని మాత్రమనుకొంటిని.'

'ఈమధ్యను నీ వీయూరిలో లేవని తెలిసినదికదా; యెచ్చటికిఁ బారిపోతివి?'

'ఎచ్చటికినిఁ బారిపోలేదు. ఈ యూరిలోనే ప్రచ్ఛన్నముగ నొకరహస్య ప్రదేశమున దాగుండి యున్నాను.

'అట్లుండుట కేమి కారణము?'

'మాయక్క బ్రతికియున్నంతకాలమును నన్నుఁ దనకప్పఁ జెప్పవలయునని వెంకటేశ మామె నూరక పీడించుచుండెను. కాని మాయక్కకు

నాకును గూడ వెంకటేశమన్న నిష్టములేదు. మాయక్క గతించిన తరువాత వెంకటేశము మాతల్లి యొద్దకువచ్చి ఆమెకేబదిరూపాయిలిచ్చి నన్నుఁ దనవశముఁ జేయవలయునని ప్రార్థించెను. ధనార్జనమునకు నేనొక్కతెనే యింటిలో నుండుటచేత నిరంతరమును మాతల్లి నన్ను శిక్షించుచు నెట్టులైన నన్ను వెంకటేశము స్వాధీనముఁ జేయుటకుఁ బెట్టరాని కష్టములు నాకుఁబెట్టుచుండెను. నే నాకష్టములకు భరింపలేక సత్యానందమునుదప్ప తదితరులను గన్నెత్తిచూడనని వ్రతముఁ గలదాన నగుటచే, దుఃఖాతిశయమున నే నొకనాటి యర్ధరాత్రమున రామసాగరమునఁ బడి ప్రాణత్యాగ మొనర్చుకొనుట కుద్యమించితిని. అప్పుడు రామారావుగారు నన్నడ్డగించుకొని నాసాహసకృత్యమునకు నన్నుఁజీవాట్లుపెట్టి. మాతల్లి నన్నేమియుఁ జేయకుండ నేర్పాటుచేసెదనని నాకు ధైర్యముఁజెప్పి నన్నింటికిఁ బొమ్మనిరి. కాని నేనుమాత్ర మప్పటి కట్టులేయని యింటికిఁబోక పురుషవేషమునుదాల్చి కేశవరావను పేరుతో రామలింగేశ్వరాలయమున బసఁజేసికొని యందు నివసించుచుంటిని. ఆపూజారికిదక్క నాప్రచ్ఛన్న వేష మితరు లెఱుఁగరు. ఆతఁడు నాకన్నముఁ బెట్టుచుఁ గొల్లలువలె నాదరించుచుండెను. నేటికిఁ గోర్టువారి సెలవైనదని విని తమయాజ్ఞయనుల్లంఘనీయము కావునఁ జేతులుజోడించుకొని నిజస్వరూపములో దర్శనమునకు వచ్చితిని.'

'రామారావుగారికి నీవు త్తరము లిచ్చినమాట నిజమేనా?'

చి త్తము. వెంకటేశము మాయక్కకు వ్రాసిన యుత్తరములు రెండిచ్చితిని'

జడ్జిగా రంతతోఁ దిలోత్తమను విచారించుటఁ జాలించి, తమలో నేమియో కొంతవర కాలోచించి, వేంకటేశమునుజూచి 'అయ్యా! వేంకటేశముగారూ! తగినరుజువులతో మీపై మోపఁబడిన యీ నేరమునకు మీ రేమి సమాధానముఁ జెప్పుకొనఁగలరు?' అని యడిగిరి కాని పాపము వేంకటేశము నోరు చప్పరించుచుఁ దడపడుచు 'చిత్తంచిత్తం' నేనేఁవీ చెయ్యాలే

దండి. ఇదంతా పోలీసువాళ్లు పన్నినకుట్రండి.' అని వినయపూర్వకముగ బదులు చెప్పెను. తరువాత జడ్జీగారు నీలాద్రినిఁగూడ నాప్రశ్నయే యడిగిరి. అతఁడుగూడ వేంకటేశ మప్పగించిన పాఠమే తానును కోర్టువారికప్పగించెను. అంత జడ్జీగారు పోలిశెట్టినిఁజూచి

'సెట్టీ! తగిన రుజువులతో నీపైని మోపఁబడిన నేరమునకు నీవేమి సమాధానముఁ జెప్పుకొనెదవు?'

'బాబయ్యా! రచ్చించాలి. యెంకటేశం దుర్మార్గుడు. ఆడితోకూడి సెడిపోయాను. ఆపొద్దు సెకోరాచ్చిని సంపేడానికి నా యాఁచ్చన యడిగాడు బాబూ! నేనొద్దనిసెప్పితే యిన్నాడుకాడు. నాకాడ పదేను రూపాయలుచ్చుకొని నీలాద్రికి లంచం ఇచ్చి ఆడూనూ తానుకల్చి ఆ రేత్రి శకోరాచ్చిని సంపేశారుబాబూ! అంతేకాని నాకందులో మరేటి సంబందం లేదు బాబయ్యా! మీపాదాలుసాచ్చి. దైవసాచ్చి. నిబ్బగ సెప్పతున్నాను తండ్రీ! పిల్లలోణ్ణి. అబద్ధం ఆణ్ణు.'

'సరే! నీ వింతకమును పీసంగతి రహస్యముగఁ బోలీసువారి కెలరిపోర్టు చేయ లేదు?'

'ఎవళ్లతోనేనా యీసంగతి నాను సెప్పినట్లు తెలిస్తే యెంకటేశం నాబుర్ర పగలకొట్టేస్తా నన్నాడుబాబూ! పాణభయంచేత సెప్పలేదుకాని మరొక వుద్దేశంచేతకాదు. యెలాగా యేల్నోరికి తెలుస్తాది. అప్పుడు సెప్పేదాం అని పల్లకున్నానుగాని యిలాగొస్తాదని యెరగను బాబయ్యా! పిల్లలోణ్ణి రచ్చించండి'

కేసు విచారణమంతయు నింతతో ముగించినది. జడ్జీగారు తగిన నిదర్శనము లన్నియుఁ జూపుచు జడ్జిమెంటు వ్రాసి అందరియెదుటఁ జదివిరి. అందులో వేంకటేశమునకును నీలాద్రికిని ద్వీపాంతరవాసయును, పోలిశెట్టి కైదు సంవత్సరములు కఠినశిక్షయు విధింపఁబడెను.

---

# ప్ర క ర ణ ము — 18.

---

### మూఁడుమాసములు తరువాత.

వేంకటేశమునకు ద్వీపాంతరవాస శిక్ష విధింపఁబడినదను సంగతి తెలిసినంతనే భీమశంకరముగారును, ఆయనభార్యయు నెంతగా దుఃఖించిరో వివరించుట కష్టము. ఇప్పుడిప్పుడే పంతులుగారు రజ్ఞానాంధకారమునుండి తొలంగి తెలివిఁదెచ్చుకొనుచున్నట్లు తెలియుచున్నది. ఆ నాటినుండియు లక్ష్మణవివాహమును దలంచుకొనునప్పుడెల్ల పంతులుగారు పశ్చాత్తాపమొందుచు వచ్చిరి. దుర్గుణ ధురీణుఁడనియు, నట్టి యవివేకియనియుఁ దెలియక చేతులారఁ దమ కుమార్తె నట్టి వేంకటేశమునకుఁ గట్టిపెట్టినందుకుఁ దల్లిదండ్రు లిరువురు నిరంతరము నొచ్చుకొనుచుండిరి. వేంకటేశ మిచ్చిన పండ్రెండు వందలు కన్యాశుల్కముఁ దమకు దక్కియుండినయెడలఁ బంతులుగారి విచారము కొంతవరకైనఁ దగ్గియుండును. గాని యాధనమంతయు నిష్కారణముగ వెచ్చింపవలసి వచ్చినది. లక్ష్మణను బరామర్శించుట కెవరైన నింటికి వచ్చినప్పుడు పంతులుగారి భార్య వారియెడల నల్లునిఁ దలపోసి కన్నీరు గార్చుచుండెను; కాని తనతోఁబాటు లక్ష్మణకూడ దుఃఖింపనందున నామె రహస్యముగఁ గూతునిఁ దిట్టుచు, బలవంతముగనైన నేడ్వవలయునని చీవాట్లుపెట్టుచుండెను. కాని దుఃఖములేనిదే దుఃఖించుచున్నట్లు నటించుట యెంతో నేర్పుగలవారికిఁ గాని, యేమియు నెఱుఁగని యమాయకురాలగు మన లక్ష్మణ కశక్యముగదా! ఇరుగుపొరుగుల యమ్మలక్కలతో పంతులుగారి భార్య ప్రసంగింపవలసివచ్చినప్పుడు, లక్ష్మణ వేంకటేశముకొఱకు బెంగపెట్టుకొనినదనియు, నిరంతరము నిద్రాహారములులేక శుష్కించుచున్నదనియు, భర్తకు జనించిన యాపద వినినతోడనే లక్ష్మణకు ఏడుబండ్లతో చలిజ్వరము

వచ్చినదనియుఁ జెప్పుచుండెను. కాని ఆయూరిలో లక్షణ నెఱుఁగనివారెవ్వరు? ఆమాటల నెవరు నమ్మెదరు?

ఒకనాడు మధ్యాహ్నము భోజనముఁజేసినతరువాత మామూలుప్రకారము పంతులుగారు పదునొకండు గంటలుకొట్టినతోడనే ఆఫీసునకు బయలుదేరిరి. తోడనేయింటిలోనివారు వీధితలుపు గడియవేసికొనుట వాడుక. మంగలివాడువెనుక రికార్డుపెట్టె నెత్తిపైఁబెట్టుకొని వచ్చుచుండఁ బంతులుగారు గుబ్బగొడుగువిప్పి నడుచుచుండిరి. అట్లు బయలుదేరిపోవుచుఁ గొంత దూరమేగుసరికి మార్గమధ్యమున రామారావుగారును, ఇన్స్పెక్టరుగారును పంతులుగారి కెదురైరి. పంతులుగారికి వారిరువురితో పలసినంత పరిచయముండినను, వేంకటేశమునకు విరోధముగఁ బనిచేయుటచే వారితో మాటాడుట మానివేసి, ఆయన పలుకరింపక నడిచిపోవుచుండిరి. కాని యేకారణముననో కాని ఇన్స్పెక్టరుగారును, రామారావుగారును తమ్ముఁబలుకరింపకయే నడిచిపోవుచున్న పంతులుగారినిఁ బిలిచి నిలువరించి, ఆయనతో నేమో కొన్నిసంగతులు సంభాషించిరి. తోడనే పంతులుగారు గుండెబాదుకొనుచుఁ ఆఫీసునకుఁబోక పరుగుపరుగున నింటికివచ్చి వీధితలుపుఁదట్టుచు గద్గదస్వరముతో భార్యనుపిలిచిరి. పెరటిలోఁ బని చేసికొనుచుండిన భార్య, ఆచప్పుడువిని పంతులుగారు మరల నింటికి వచ్చుటకుఁగారణమేమోయని యాలోచించుచు, ఆఫీసుసంబంధమైన కాగితములేమైన మరచిపోయిరేమోయని మొదట ననుకొనెనుకాని, అట్లు మరచిపోయినచో మంగలివాని నింటికిఁ బంపి తెప్పించుకొనెదరుకాని, ఆయనయేస్వయముగా వచ్చెదరా? వీధితలుపుతీసిన తోడనే పంతులుగారు భార్యతో నేమిచెప్పిరో కాని, పాపమామె కెవ్వున నార్చి నేలఁజతికిలఁబడి పెద్దపెట్టున రోదనమారంభించెను. ఆమెతోఁబంతులుగారుకూడ దుఃఖించుచుండిరి. క్రమముగా నింటిలోనివారందఱు ఘొల్లున యేడ్చుచుండ పొరుగింటనున్న లక్షణ యాతురతనో వచ్చుటకిఁ బరుగెత్తుకొనివచ్చి యేసంగతియుఁదెలియనందునఁ దెల్లపోయి నిలుచుండెను.

లక్ష్మణను జూచినతోడనే వారందరు నామెపైఁబడి యామెను కౌఁగిలించుకొని మరింత బిగ్గరగ నేడ్వఁదొడఁగిరి. లక్ష్మణ బలవంతముగ వారినుండి తప్పించుకొని దూరముగఁబోయెను. ఇరుగుపొరుగులయమ్మలక్కలందఱు నచ్చటఁ గుమిగూడి పంతులుగారిని, ఆయనభార్యను ఓదార్చుచుండిరి. కాని యెంత సేపునకును వారిరోదనములు తగ్గలేదు. ఆడువానికన్న నెక్కుడుగ దుఃఖించుచుఁ గన్నీరుఁగార్చుచున్న పంతులుగారినిఁ జూచి కొందఱవ్వలు 'ఊరుకో బాబూ! ఊరుకో! ఆడవాళ్లకి ధైర్యంచెప్పాలికాని యేడుస్తే యెలాగ? యెలాగా వెంకటేశం మనవాఁడు కాడనుకున్నావాఁ లేదా? బ్రతికున్నా మాత్రం వాణ్ణి మరిచూడగలవాఁ? అన్నివిధాల వాడిబ్రతుకురవ్వాయిపోయింది. ఆఖరికి ఖైదులో వాడికి దేఁవుడు చావురాశాడు,' అనిదుఃఖోపశమనముఁ జేయుచుండిరి.

ద్వీపాంతరవాస శిక్ష విధింపబడిన సంగతిఁ దెలిసినప్పుడే వేంకటేశమునకు గుండెలు దడదడఁ గొట్టుకొని కొంచెముజ్వరము తగిలినది. కారాగృహమునఁ జేరిన తరువాతఁ గ్రమక్రమముగా నాజ్వరమధికమై నాలుగు దినములవరకు వేంకటేశమునకు శరీరముపై స్మృతిలేకుండఁ జేసి యైదవనాఁడు వాని నీలోకమునుండి విముక్తునిఁ జేసెను. వేంకటేశముచావు వినినతోడనే సదయహృదయమగు మన లక్ష్మణ యొక్కసారి కన్నీరు విడిచి,

'హా! వెంకటేశా! నీబ్రదుకెంత నీచమైపోయినది? బ్రతికియున్నంతకాలము నీవెందరిని దుఃఖపెట్టితివి? ఆదినుండియు దురాచారపరుఁడవై తల్లిని లక్షింపక దుస్సాంగత్యమున నన్నివ్యసనములు నభ్యసించి, వారకాంతా ప్రియుఁడవై యపఖ్యాతిపడి, మా తల్లిదండ్రులను మోసపుచ్చి, నాహృదయేశ్వరునకు నన్ను దక్కనీయకుండ నాగొంతుకఁగోసి, నూటికొక్కరిచేనైన మేలనిపించుకొనలేక నీవేమి సౌఖ్య మనుభవించితివి? తల్లికడుపునఁ బుట్టి యాస్వల్పకాలపు జీవనమునకేనా యింత రవ్వపడితివి? నీకు ద్వీపాంతరవాసశిక్ష విధింపఁబడిన సంగతి వినినప్పుడుగూడ నాహృద

యము కరుగలేదు కాని, చెరసాలలో నీకు దిక్కులేని చావు గల్గినందుకుమాత్రము విచారించుచున్నాను.'

అని లక్షణ తనలో ననుకొనఁ జొచ్చెను. అప్పటినుండియు లక్షణ పూర్వముకన్నఁ దఱుచుగ సీతయొద్దనే కాలముఁ గడుపుచుండెను. కేసు విచారణ ముగించిన తరువాతఁ దిలోత్తమను, సత్యానందరావును, రామారావుగారు తమయింటిలోనే యుంచుకొనిరి. తిలోత్తమతల్లిని బిలిపించి రామారావుగారు ఆమెకు చాలమూరము బోధించి తిలోత్తమ సత్యానందమును పెండ్లాడుట కొప్పించిరి ఆదినములలో వారి కిరువురకును పెండ్లి సేయుట కాయన నిశ్చయించిరి కాని, పరీక్షలైన తరువాత మాధవరావు చెన్నపట్టణమునుండి వచ్చు వరకు వివాహముఁ జేసికొనననని సత్యానందము చెప్పెను. ఆదినుండి యంతమువరకు జరిగినసంగతు లన్నియు రామారావుగా రుత్తరము వ్రాసి మాధవరావునకుఁ దెలియఁజేసిరి. లక్షణ వారందరితో వినోదముగఁ గాలముఁ బుచ్చుచుండెను. ఇట్లు మూడుమాసములు గడచెను............

ఈమూడు మాసములలోను మన కథాభాగమునుగూర్చి చెప్పవలసిన విశేషము లంతగాలేవు. కాని యేవిషయమును గూర్చియో అప్పుడప్పుడు వారందఱును గలసి యతి రహస్యముగ సంభాషించుకొనుచుండిరి. అప్పుడప్పుడు మాధవరావు తండ్రియైన అనంతరావు పంతులుగారు రామారావుగారి యింటికి వచ్చి ఆయనతో నతిగోప్యముగ నేమేమోమాటాడి పోవుచుండిరి. ఆసంభాషణలో నొక్కొక్కప్పుడు లక్షణకూడ వారియొద్దనే యుండుచుండెను. ఆ రహస్యములన్నియు వారికేకాని యితరులకుఁ దెలియవు. ఒకనాఁడు లక్షణయు సీతయు సాయంకాలమునఁ జల్లగాలిలో డాబాపైఁ గూర్చుండినప్పుడు వారి కీక్రిందిసంభాషణము జరిగెను.

'లక్షణా! గడువు దగ్గరకు వచ్చినది. నీవే మాలోచించితివి?'

'మరేమి యాలోచన? నాయుద్దేశము నీవెఱుఁగవా?'

'ఎఱుఁగుదునుకాని, నీకు తగినంత ధైర్యమున్నదో లేదో యని మాత్రము భయపడుచున్నదానను'

'సీతా! ధైర్యము లేకేమి? నేను స్వతంత్రురాలను. నాయిష్టము వచ్చినట్లు చేసెదను. నన్నెవ్వరడ్డగించెదరు?'

'ఔను. మీయన్నయ్యగారు కూడ నామాటయే చెప్పిరి'

'అన్నయ్యగారంటె నాకేమి భయము? కాని యీసంగతిమాత్రము మనసు తుదపరకు రహస్యముగ నుంచుటమేలని తలంచెదను.'

'ఆహా! అట్లులే యుంచవలయును. అందుకుఁ దగినయేర్పాటు మీయన్నయ్యగారును, అనంతరావుపంతులుగారును ఆలోచించుచున్నారు. కాని యుత్తరముసంగతి యేమనెదవు?'

'నీవెప్పుడు చెప్పిన నప్పుడే'

'కలమును కాగితమును దెప్పింతునా?'

'తెప్పించు'

సీత తన గదిలోనికిఁ బోయి కాగితముఁ గలము సిరాబుడ్డియు తీసుకొని యచ్చటికిఁ బోయి,

'లక్ష్మణా! చక్కని పద్యములు వ్రాయవలయునుసుమా!'

'నీవు కొంచము సాహాయ్యముఁ జేసినచో'

'ఇందుకు వచ్చిన ప్రత్యుత్తరము నాకుఁ జూపించెదవా?'

'అబ్బా! ఏమి గడుసుఁదనము?'

'ఏమో? అప్పుడు సీత నీకు జ్ఞప్తికి వచ్చునో లేదో?'

'చాలు. నీయుక్తులింకఁ గట్టిపెట్టి ఉత్తర మెట్లులారంభింపవలయునో చెప్పు'

'ఉత్పలమాల మొదట నుంచు, 'చిన్నతనమ్మునుండి'—'

'ఓహో! తరువాత విక్రమస్థానము కాఁబోలు? అందుచేతనే నీ కవిత్వధార యాగిపోయినది—'కదుఁ జెల్మివహించినవారమాట' అని చెప్ప లేక పోయితివా?'

ఇట్లు పరిహాస మాడుకొనుచుఁ గొంత సేపునకు వారిరువురు నాయుత్తరమును వ్రాయుట ముగించిరి.

---

# ప్రకరణము—19.

---

## విచిత్రవివాహము.

చిన్ననాడు నేర్చిన సుమతిశతకములోని పద్యములు జ్ఞాపకమువచ్చి నందున వానినిఁ జదువుచు నొకనాటి సాయంకాలమున భీమశంకరముగారు వీధి యరుగుపై నొంటరిగఁ గూర్చుండి యుండిరి. లక్షణకు ద్వితీయ వివాహ మొనర్చుట భావ్యమని యప్పుడప్పుడు కొందరు మిత్రులు పంతులుగారికి బోధించుచుండిరి గాని, అట్టి యమంగళవాక్యములు తమచెవిని వేయవల దని ఆయన వారిని మందలించుచుండెను. శుద్ధఛాందసులును, పూర్వాచార పరాయణులును, యుక్తాయుక్తవిహీనులు నగు పంతులుగారు ద్వితీయ వివాహ మొనర్తురని యెవరు నమ్మఁగలరు? రామారావుగారిపైఁ దమకాగ్రహము జనించినందున వారి యింటికిఁ దగుచుగఁ బోవుచుండవలదని పంతులుగారు లక్షణను వారించుచుండిరి. అందుచే లక్షణ, తండ్రి యింటలేనప్పుడు రహస్యముగ సీతయొద్దకుఁ బోవుచుండవలసి వచ్చెను. కాని వీధిలోని యుత్సవ మేదైనఁ జూడవలసివచ్చినప్పుడు మాత్రము రామారావుగారి మేడపైనుండి చూచుటకు పంతులుగారు లక్షణ కనుజ్ఞ నిచ్చుచుండిరి.

ఆనా డట్లు పంతులుగారు వీధియరుగుపైఁ గూర్చుండియుండఁ గొంత సేపునకు లక్షణ లోపలినుండి వచ్చి తలుపువద్ద నిలిచి,

'నాన్నగారూ! అమ్మ నన్నుఁ జెరువునకుఁ బోయి నీరుఁ దెమ్మను చున్నది.'

'అయితే ఏఁవంటావు? బిందె పట్టుకొనివెళ్లు'

'అబ్బా! నేనంత బిందె మోయలేనండీ!'

'మొయ్యలేకపోతే యెలాగవుతుంది. మీతల్లి వట్టికసుమష్టు. చేటపె య్యలాగ తింటూ యింట్లో కూర్చుండావంటే జరగదు'

అని మాటాడుచుండ నింతలో నొకసిద్ధాంతిగారు రచ్చటికివచ్చి పంతులుగారి కెదురుగ నిలిచిరి. భీమశంకరముగారు వారినిఁజూచి

"ఓహో! సోఁవయాజులుగారా? నమో న్నమః! ఏఁవటాశుభ లేఖలు?"

'అనంతరావు పంతులుగారి కుమారుడికి రేపువివాహం. ఇదిగో శుభలేఖ!'

'ఓహో! చెన్నపట్టంనుంచి వచ్చాడా యేఁవిటి?"

'ఆఁ వచ్చాడు'

'ఎవరిపిల్ల నిస్తారు.

'మేనరికఁవట'

'పిల్ల బావుంటుందా?'

'బంగారబ్బొమ్మ. మూడుమూర్తులూ మీ లక్షణే! మళ్లాదర్శనం చేస్తాను'

అని శుభలేఖనిచ్చి యా బ్రాహ్మణుఁ డచ్చటనుండిపోయెను. పంతులుగారా శుభలేఖ నందుకొని 'లక్షణా! నా చందుగుపెట్లో కళ్లజోడున్నాది పట్రా' అని పంపిరి. లక్షణ తోడనే సులోచనములు గొనివచ్చి తండ్రికిచ్చి యచ్చటనే నిలిచియుండెను. పంతులుగారు సులోచనములఁ దాల్చిశుభలేఖనిట్లు చదువ నారంభించిరి.

"శ్రీసర్వేశ్వరసహాయోస్తు.

శుభమస్తు.

ఆర్యా!

స్వస్తిశ్రీ మార్గశిర బ॥గురువారం సాయంకాలము మఘానక్షత్రయుక్త తులాలగ్నమున నాకుమారుఁడగు చి॥ మాధవరావునకు లక్షణయగు నొక కన్యకనిచ్చి విచిత్రవివాహముఁజేయుటకుఁ బెద్దలు నిశ్చయించిరి కావునఁ బురమందిరములో జరగబోవుపాణిగ్రహణోత్సవ

ములకుఁ దామసకుటుంబ బంధుమిత్ర పరివారసహితముగా దయచేసి వధూవరుల నాశీర్వదించి నన్నానందింపఁజేయ బ్రార్థించుచున్నాను.

చిత్తగించవలెను.

ఇట్లు విధేయుఁడు,

అనంతరావు"

అని చదివి 'ఏఁవిటీ శుభరేఖ ? వీళ్ల మొహం లాగేవుంది' అని యనుకొనుచుఁ బంతులుగారు తమలోనవ్వుకొనుచుండిరి. అప్పుడు లక్షణనవ్వుచుఁ దండ్రినిఁజూచి,

'నాన్నగారూ ! విచిత్రవివాహ మనగా నర్థమేమండీ?'

'అర్థఁవేఁవిటి ? వల్లకాడు. వాళ్లంతా దొరగార్లు. అందుచేత టవును హాల్లో దొరల్లాగ పెళ్లిచేస్తారు'

'అయితే పెళ్లికూతురి పేరు శుభరేఖలో లేదేమి?'

'ఏఁవో వాళ్ళబుర్ర. ఎప్పుడేనా శుభరేఖలు రాశివుంటేనా?'

'పెండ్లిఁ జూచుటకు మీరు వెళ్లెదరా?'

'ఏఁవో వెళ్తే వెళ్తాను లేకపోతే లేదు.'

'నాన్నగారూ! సీత వెళ్లినచో, ఆమెతో నేనుగూడ వెళ్ళవచ్చునా? చూడవలయునని ముచ్చటగా నున్నది.'

'మీయమ్మ వెళ్ళమంటే వెళ్లు.'

అని సంభాషించి పంతులుగారు లోనికిఁ బోయిరి. అప్పటినుండియు మన లక్షణ ముఖలక్షణము లన్నియుఁ గ్రొత్తగాఁగన్పించుచుండెను. భీమశంకరముగారి వద్దనుండిబయలుదేరి టవునుహాలులో నేమేమి యత్నములు జరుగుచుండెనో మన మొకసారి చూడవలసి యున్నది. ఆ పురమందిరము పట్టణమునకు సమీపముననే యుండెను. మిక్కిలి వైశాల్యముగలిగి దివ్యభవనము వలెఁ జూచుట కెంతయో యాళ్ళంగారముగ నుండినందున సాధారణముగ సభ లన్నియునందులోనే జరుగుచుండును. పెద్ద వసారాయును, పందిళ్లతోఁ లఁడి

కుర్చీలును, బల్లలును, చక్కని రంగస్థలము వచ్చుటనుండుటచేఁ బురవాసు లప్పు డప్పు డా పురమందిరమున నాటకములుగూడఁ బ్రదర్శించుచుండుట వాడుక. గచ్చుచేసిన గోడలును, నున్నని చీడ్డీలును గాక, మందిరముచుట్టు నలంకరింపఁబడినఁ బలువిధములగు పూవులమొక్కలుగూడ నా ప్రదేశమున కెంతయో వన్నె దెచ్చుచుండెను. ఆ పురమందిరము రమారమి అయిదారు వందలు జనులు కూర్చుండుటకుఁ దగినంత వైశాల్యముఁ గల్గియుండుటచే ననంతరావుపంతులుగారు తమ కుమారుని వివాహ మందులోనే చేయనిశ్చ యించిరి. ఆ మరునాడు పురమందిరమునకు మామిడాకులతోరణములు గట్టిం చుటతప్ప అనంతరావుగారు వే రేమియునలంకరింపలేదు. ఆనాడు సాయం కాలము నాలుగుగంటలకుఁ బురవాసు లొక్కరొక్కరు పురమందిరమునకు వచ్చి యచ్చటనున్న యాసనములపైఁ గూర్చుండఁ జొచ్చిరి. క్రమక్రమ ముగ నైదుగంటలగుసరికిఁ బురవాసులందరు వందలకొలఁది నామందిరము నలంకరించిరి. ప్లీడర్లను వెంటనిడికొని ఆనాడుజడ్జీగారుకూడ దయచేసిరి. వచ్చినవారి నందరి నాదరించి, యుచితాసనములఁ గూర్చుండఁబెట్టు టకు రామారావుగారునియోగింపఁబడిరి. అనంతరావు పంతులుగారు చెన్నప ట్టణమునుండి తెప్పించిన బ్యాండు ఒకప్రక్కఁ గడుమనోహరముగ మ్రో యింపఁబడుచుండెను మరికొంతసేపున కతివిచిత్రముగఁ బాడుచుండిన గ్రామ ఫోను చూపరుల నమందానందమునఁ దేల్చుచుండెను. సభ్యుల కెదురుగనున్న యున్నతమైన రంగస్థలమునకు మధ్య నొక పెండ్లిపీటవేసి సామగ్రితో దాని చుట్టును బ్రాహ్మణోత్తములు కూర్చుండియుండిరి. ఒకప్రక్కనగ్నిహోత్రము వెలుగుచుండెను. పెండ్లిచూచుటకు వచ్చిన స్త్రీలెల్లరు నందొకప్రక్కనున్న మిద్దెపైఁ గూర్చుండియుండిరి. ఇంతలో నారుగంటలయ్యెను. చీకటిపడు చున్నందున నందందు వ్రేలాడఁగట్టబడిన విచిత్రములగు గ్లోబులును, లష్ట ర్లును కొందరుభటులు వెలిగించిరి. ఆకాంతిలో బురమందిరమంతయు నింద్ర భువనమువలెఁ గాన్పించుచుండెను. కొంతసేపునకు మాధవరావు షుమారు

బట్టలు గట్టుకొనివచ్చి పెండ్లిపీటపైఁ గూర్చుండియుండెను. వానివెనుక నే కొందఱుస్త్రీలొకకన్యకను గొనివచ్చి మాధవుని ప్రక్కఁగూర్చుండఁబెట్టిరి. వంగపండుఁ చాయఁగలిగి జలతారు మొగ్గలతో నలంకరింపఁబడిన బనారసు చీరయు, యెఱ్ఱని పట్టురెకయు, దగధగలాడు కంఠాభరణములును, చెవులకుఁగలవజ్రంపుఁబొళ్ళ తమ్మెట్లును, మొలకు ధరించిన బంగారపు టొడ్డాణ్ణమును జూచి అబాలిక ధనికులబిడ్డయే యని యెంచి, ఆమె యనన్య సామాన్యరూపలావణ్యాతిశయముల కచ్చెరువొందుచు, అట్టి బంగారుబొమ్మను భార్యగాఁ బడయఁగల్గిన మాధవుని యదృష్టము నెల్లవారుఁ గొనియాడుచుండిరి.ఆపాదమస్తకము సన్నని మేలిముసుంగుఁదాల్చియుండుటచేత నా సుందరి సుందరవదనారవిందము నందరును కరువుఁదీర స్పష్టముగఁ జూచుటకు వీలులేకపోయినది.

వధూవరు లిరువురు బెండ్లిపీటపైఁ గూర్చుండిన తరువాత బ్రాహ్మణులు వివాహ మారంభించిరి. అందేమి రహస్య మున్నదోకాని వివాహమంతయు రెండుగంటలకాలములో ముగించిరి. మాధవుఁడు మంత్రపూర్వకముగ నాఁడాసుందరిగళమున మంగళసూత్రమును గట్టెను. పౌరోహితులు పంచి యిచ్చిన అక్షతలను పురవాసు లావధూవరులపైఁ జల్లి యాశీర్వదించిరి. వివాహానంతరమున ననంతరావుగారు రంగస్థలముపై నిలిచి చేతులు జోడించి 'మహామహులగునో యార్యులారా !

ప్రస్తుతము మన యాంధ్రదేశమునఁ జరుగుచుండినవివాహములలోని దురాచారములు మీరెల్లరు నెఱిఁగినవియే! వివాహమన నేమియో యెఱుంగని మూఢులు తమకుమార్తెలకు వరాన్వేషణమున స్వాతంత్ర్యమీయక బలవంతముగ నెవ్వనికో యొకనికిఁ గట్టిపెట్టుచుండుటచే, వధూవరులకుఁ బరస్పరానురాగములేనందున వారి కనేక కష్టములు గలుగుచున్నవి స్వయంవరాచారము పూర్వమొకప్పుడు మనదేశమునఁ బ్రబలియుండినదియే కాని యిప్పుడు క్రొత్తగావచ్చినదికాదు. నేఁడుజరిగిన వివాహోత్సవము నిందులోఁ

గొందరాక్షేపించియుందురని నేతలంచెదను. ఈవధూవరు లిరువురునుజిననాట నుండియుఁ బరస్పరానురాగము వహించియుండిరి. కానియీనడుమనెన్నియో కష్టములు గలుగుటచేత నింతకాలమువరకు వీరికి వివాహముకాలేదు. తనప్రియుఁడు మదరాసులో నున్నప్పుడీబాలికామణి వానికి వ్రాసినయుత్తరమును, అందుకాతఁ డొసంగిన ప్రత్యుత్తరమును మీ రెల్లరువినినచో నీవధూమణి చెందిన కష్టములును, ఈయిరువురిఁ బరస్పరాను రాగములును విశదమగును. కావున సావధానముగఁ జిత్తగింపుఁడు ''

అనిపలికి అనంతరావుగారు తమచేతిలోని కాగితమునువిప్పి:—

'మనోహరుఁడైన మాధవుని పాదారవిందముల సన్నిధికి.'

ప్రాణేశ్వరా!

ఉ. చిన్నతనమ్మునుండి కడుఁ ♦ జెల్మివహించిన వారమాట నా
వెన్నునియాన నిర్వరముఁ ♦ బెండిలీ యాడఁదలంచినాము వి
ద్వన్నుత! కానియీనడుమ ♦ దైవవశమ్మునఁ గల్గెనెన్నియో
బన్నము, లిప్పుడన్నియును ♦ వ్రాసిన భారతమంత గ్రంధమౌ.

చ. కటకట! నేను పూర్వభవ ♦ కర్మవశమ్మున జ్ఞానహీనుఁడౌ
కుటిలుఁడు భీమశంకరము ♦ కూతురునై జనియించినాను, హా!
కటికకునైనఁ గొంత దయ ♦ గల్గిన గల్గఁగవచ్చుఁ గాని యే
ప్పటికి నతండు జాలియను ♦ పల్కు నెఱుంగఁడు సుమ్ము మాధవా.

ఉ. ద్వాదశవర్షముల్ గడుచు ♦ దాక వివాహము లేకయుండుటన్
మీదయువల్ల నేర్చితి న ♦ మేయగుణాకర! నాలుగచ్చరాల్
కాదనువారులేక ధన ♦ కాంక్షను గన్గొని విక్రయించి నా
డాదయలేనితండ్రి యధ ♦ మాధముఁడౌ నొకదుష్టబుద్ధికిన్.

ఉ. ఇంతయునంతయంచు వచి ♦ యింపఁగరాని జ్వరమ్ముచేత కా
కంతయుఁదెల్విలేనినను ♦ నమ్మయు నయ్యయు జాలిలేక బ
ల్వంతముతోడ మోసికొని ♦ వచ్చి దురాత్మునకంటగట్టినా
రింతటితల్లిదండ్రుల మ ♦ రెచ్చటఁ గాంచితిమయ్య మాధవా!.

శా. న్యాయాన్యాయవిచక్షణమ్ము గల ♦ నైనన్ లేనిమాతండ్రి యు
న్యాయోద్వాహ మొనర్చినందులకుఁ ♦ బ్రాయశ్చిత్తమింతేనియున్
జేయండేవిధి? స్త్రీవధన్ సలుపుటన్ ♦ ద్వీపాంతరావాస శి
క్షాయుక్తుండయి వెంకటేశవరిగన్ ♦ కట్టా గతప్రాణుఁడై.

ఉ. మాధవ! భర్తృహీనవని ♦ మాత్రము సంశయమొందఁబోకుమా
'మాధవ! మాధవా!' యనెడి ♦ మాటయె కాని తదన్యచింతన
మ్మాధవు నాననే నెఱుఁగ ♦ మామకచిత్తము చిన్ననాటనే
నీధనమయ్యె నేకరణి ♦ నేఁ బతిహీనవొ నీవె తెల్పుమా.

సీ. బలవంతముగ నన్నుఁ ♦ బట్టి మాజనయిత్రి
నను బెండ్లికూఁతుజే ♦ సినదినమున
పిండివంటలముందుఁ ♦ బెట్టి బంధువులెల్ల
ననుఁ దినుమంచుబ ♦ ల్కినదినమున
గళమున నురిత్రాడు ♦ కరణి మంగళసూత్ర
మును జూచుకొని వగ ♦ చినదినమున
ఔపోసనపుఁ బీట ♦ యందున న్జేర్పంగ
ననుఁ దల్లి బల్మి నీ ♦ డ్చినదినమున
గీ. నమ్మెదవొ నమ్మవో కాని ♦ నామనమున
'మాధవా! మాధవా!' యను ♦ మాటదక్క
మరియొకవిచారమెఱుఁగనీ ♦ చరణమాన
గడచెనాగండములు నీదు ♦ కరుణకతన.

ఉ. మావక పెండ్లిఁ జేసిరని ♦ మాటయెగాని వివాహవేళ యం
దే నెటులుంటినో యచట ♦ నేమియొనర్చిరో నే నెఱుంగ! నెం
దైన నను నిట్టి పెండ్లి మును ♦ నారసితే యిది పెండ్లియెట్లగున్?
గావయ బాల్యకన్యక నె ♦ కానివివాహితఁ గాను మాధవా.

మ. కలలోఁ గాంచినసంగతుల్ నిజములై ♦ కన్పట్టుచందంబు బో
ము పెండ్లిండ్లు నిజమ్ములైనయడలన్ ♦ మారాడకే నాటి పెం
డిలినిక్కంబని యొప్పుకొందును; భవా ♦ నీదేవియేసాక్షిగా
వలపుంగల్గినవాఁడు లేనియధమో ♦ ద్వాహంబు నుద్వాహమే?.

సీ. మనసారనినెవరిం ♦ చినదాననోకానొ
రమ్యమానీ యంత ♦ రాత్మసాక్షి
గోరంతయును బెండ్లి ♦ ఘోషయే నెఱుఁగనన్
మాటకప్పటిజ్వర ♦ మహిమసాక్షి
తలచినీకొరకెంత ♦ విలపించితినొ నేను
పూతచారిత్రమా ♦ సీతసాక్షి
నను నేలుటకె నీవు ♦ జనియించితనుటకు
వెంకటేశముచావు ♦ వింతసాక్షి

గీ. మానవతిని నిష్కల్మష ♦ మానస నని
సద్గుణాకర! యీజగ ♦ త్సాక్షిసాక్షి
మాధవుఁడుగాక లక్షణ ♦ నేఁ వుండు
సాహసమ్మునఁ జేపట్టఁ ♦ జాలువాఁడు ?.

ఉ. ఎంచఁగరానిప్రేమమున ♦ నెల్లపుడున్ నినుమానసానఁ జిం
తించుచునున్నదానఁ గడు ♦ దీనచరిత్రను గాన నన్ను మ
న్నించి, కటాక్షముంచి, కరు ♦ ణించి, శ్రితావనదీక్ష నేల వాం
ఛించెదః........................... ఇట్లు

నీచరణ సేవకురాలను నేను

లక్షణన్"

అని మొదటియుత్తరముఁ జదివినతోడనే సభ్యులెల్లరు మహానంద మునఁ గరతాళములు వైచిరి. తరువాత వసంతరావు పంతులుగారు మరి

రొక యుత్తరమునుదీసి 'ఆర్యులారా ! అందుకు వరుఁడొసంగిన ప్రత్యుత్తరమునుగూడఁ జిత్తగింపుఁడు' అని పలికి యిట్లువినిపించిరి.

'నా ప్రాణ సమానయగు లక్షణకు—

ప్రేయసీ !

ఉ. కంటిమహానురాగమునఁ ♦ గమ్మను, కన్నులకద్దుకొంటి వా
ల్గంటిరో ! దానినింజదువఁ ♦ గంటి, భవచ్చరితమ్ము వింటి, నా
కంటెనదృష్టహీనుఁడికఁ ♦ గల్గడటంచుఁ దలంచుకొంటి, నే
కంటికి నేలకుఁ బగచి ♦ కట్టు! జవాబు లిఖింపఁబూనితిన్.

ఉ. నిర్మలమైనవర్తనము ♦ నీదనుమాటనిజమ్మెకాని, యే
కర్మమునీవెఱుంగని య ♦ కల్మషవౌట ధ్రువమ్మెకాని, నే
ధర్మవిధిప్రకారమునఁ ♦ దప్పకనిన్ గ్రహియింతుఁగాని, యా
దుర్మతియైన నీజనక ♦ ధూర్తునిఁగూర్చియె సంశయించెదన్.

శా. స్వాతంత్ర్యమ్మునులేనిదానవుకదా ? ♦ సంకల్పసంసిద్ధి యే
రీతిన్ గాఁగలదంగనా ? మనవృథా ♦ ప్రేమంబులింకేల? ఆ
వీతం డ్రిన్ గణియింపకెప్పుడైనన్ ♦ నీవేమియున్ జేయలే
వోతన్వీ ! తగినంతధైర్యమెద నీ ♦ కున్నంగదా! కార్యమా.

శా. బంగారంపుజవాహరీలు మొహిరీల్ ♦ వజ్రాలుఁగట్నాలొసం
గంగావచ్చినవారికన్నియల నే ♦ కన్నెత్తివీక్షింప కి
బ్భంగిన్ జిన్నతనమ్మునుండియును ను ♦ ద్వాహమ్ముగాకుంట నీ
సాంగత్యమ్మునకాసఁజెందియెకదా ? ♦ సత్యమ్ముగాలక్షణా !.

సీ. ఆనాటినుండి ని ♦ ద్రాహారములులేవు
లక్షణా ! నీపైఁ ద ♦ లంపుచేత
పాతశాలకుఁబోపఁ ♦ బాదమ్ములాడవు
లక్షణా! నీపైఁద ♦ లంపుచేత

పాఠముల్ జదువంగ ♦ భాషమీఁకొనదయ్యె
లక్షణా! నీపైఁద ♦ లంపుచేత
తోడివారలఁగూడి ♦ యాడు వేడుకలేదు
లక్షణా ! నీపైఁద ♦ లంపుచేత
కటకటా ! నీవివాహ సం ♦ గతినిఁ దెలిసి
నేత్రములఁ గారునీరు ము ♦ న్నీరుగాఁగ
నెంత విలపించితినొ. దైవ ♦ మే యెఱుంగు
వినుత లక్షణ ! లక్షణా ! ♦ విమలసుగుణ !
కొలఁది దినములలోఁ బరీ ♦ క్షలు ముగించు,
నింటికరుదెంచు చుంటి వా ♦ ల్గంటి! మనము
కలసి మాటాడుకొనవచ్చుఁ ; ♦ గలుగుఁగాక
మనకు శుభము..................ఇట్లు

చెలికాఁడు

మాధవుండు."

మీదియుత్తరములవలన నవ్వధూవరుల పరస్పరానురాగము గ్రహించి యచ్చటి సభ్యులలో నానందింపని వారెవ్వరు ! ఓహో ! చదువరులారా ! చితిమి. మనభీమశంకరముగారుకూడ నచ్చటనేయున్నారు. మొదటియు రముచదువుచుండినప్పుడే వారిశరీరము కంపమెత్తుట కారంభించెను. 'అ ర్యా! భడవాముండా! నాకొంపతీశావే! ఇంతమందిలో నాకు చిన్నతనం లిగించావే? మొగుడుచచ్చిన వెధవ్వి వొకమూలకూచోక నీ కీపోయీకాలం పుట్టిందేవేఁ ? సీతతో పెళ్లిజూడ్డానికి వెళ్తానంటే వద్దనక యెందుకొప్పుకున్నానే? ఇంకనాకేందారి? యీవెధవముండని మళ్ళాకులంలో యెలాకలుపుకోడం? రామారావిల్లువల్లకాడుకానూ యెంతతంత్రంచేశాడు? భడవముండా! నాతో చెప్పక నువ్వు వాళ్ల వలలోపడిపోయావే? నీకవిత్తం ముండిపోనూ! కెక్కడి చదువొచ్చిందే? ఈచీర్లు-ఈరవికలు-ఈనగలు నీకెవళ్లిచ్చారే?

అయ్యయ్యో! ఎంత-పోగాయిత్తం. ఎంత-సాహసం. మొగుడుసచ్చిపో గానే వెధవని బుర్ర గొరిగించేశానుకాను. చిన్నపిల్లవుకదా అని వూరుకొంటే సరికి నాకొంప తీసేశావు? వెధవముండా! యింటికిరా! కొండచీపురుకట్టతో వీపు చక్కాల్చేసి, వెంటనే మంగలివాణ్ణి పిలిపించి బుర్ర గొరిగించేస్తాను. తరువాత మాధవరావు నిన్నేలా యేలుకుంటాడో యేలుకోనీ.'

అని పంతులుగారు తమలో గొణుకు కొనుచుం బండ్లుకొరుకుచు, నెవ్వరివంకం చూడక మొగము పేల్చుకొనియూరకుండిరి. ఇంటికి వచ్చిన తోడనే లక్షణకుం దగిన శిక్షసేయవలయునని పంతులుగారనుకొనుచుండిరి. కాని, తమయెదుట నింత సాహసముం జేసిన లక్షణ మరలం దమయింటికి వచ్చునాయను సందేహము దూరాలోచనములేనిపంతులుగారికిం గలుగలేదు. లక్షణ చరిత్రమునువిని సభ్యులలోం బలువురు జాలిపడి నిర్దయుండని పంతులుగారి నెంతయోదూషించిరి. కాని మేముమాత్రమతనిని లేశమును నిందింపము. పంతులుగారు దేశోపకార పరాయణులగుటచే, వివాహవిషయములలో నాంధ్రదేశమునకొక నీతిపాఠమును బోధించుటకే మొదట లక్షణ కట్టి వివాహముం జేసిరి. ఇదియుంగాక భీమశంకరముగారు భాషాభిమానులు. వారట్టి యసందర్భపువివాహముం జేయకుండినచో నీనవల వ్రాయుభాగ్యముమాకు గలుగకపోవునుగదా?



## ప్రకరణము—20.

---

### సమాప్తి.

వివాహమైన తత్క్షణముననే లక్ష్మణ యత్తవారింటికిఁ బోయెను.
ాడు మధ్యాహ్నముననే లక్ష్మణ పెండ్లిఁజూచుటకు సీతతో నేనును
రెదనని తనతల్లియొద్ద సెలవుఁగైకొని, సీతయొద్దకువచ్చెను. సీత యతి
స్యముగ నామె నలంకరించి సవారిబండిలోఁ గూర్చుండఁబెట్టుకొని పుర
దిరమునకుఁ దీసికొనిపోవుటచే నాసంగతి యెవ్వరు నెఱుఁగరు. మొదటి
డియు నీయేర్పాటులన్నియు నతి గూఢముగ రామారావుగారేచేసిరి. ఆమ
వాడే రామారావుగారు తిలోత్తమకును, సత్యానందరావునకును మహో
హమున వివాహముఁ జేయించిరి. ఆసంవత్సరము మాధవరావు బి.ఏ.,
క్ష ప్యాసయినందున లక్ష్మణతోఁగూడ మదరాసునకుఁబోయి 'లా' చదు
ు కారంభించెను. సత్యానందరావు ప్రవేశపరీక్ష ప్యాసయినందున, రామా
వుగారు వానిని వెల్లూరు ట్రెయినింగునకుఁ బంపించిరి.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1924.

# చంద్రగుప్త.

గ్రంథకర్త:—భోగరాజు నారాయణమూర్తి.

ఇదివరకెన్నఁడును మనయాంధ్రభాషలో నెవ్వరును
యెఱుఁగని యద్భుతమైన యీచరిత్రవిషయికనవల మనయాం
ధ్రభాషా యోషామణికి నూతనాలంకారమని చెప్పఁ
యున్నది. మగధేశ్వరుఁడగు ధననందునిచేఁ జాణక్యుఁ
బ్రాహ్మణుఁడు పరాభవమొంది నందవంశము విధ్వంసనొ
ర్చెదనని ప్రతిజ్ఞఁబూనుటయు, మగనిచే నవమానింపఁ
మురాదేవి దుఃఖమును, చంద్రగుప్తుని సుగుణపరాక్రమ
ములును, చండశాసనుండగు చాణక్యుఁడు చంద్రగుప్తునిఁ
వర్తినిఁ జేయుటకై పాటలీపుత్రమునకు వచ్చిచేసినమాయ
మంత్రములు, తంత్రములు, కుట్రలును, మురాదేవిసవతుల
రాజునకీర్ష్యఁబుట్టించు విధములును, ఆమెయెడ రాజునకుఁ
మోహమును, చంద్రగుప్తుఁడు చక్రవర్తియగుటకంగీకరిఁ
రాక్షసామాత్యుని పట్టుదలయు, సత్యవిష్టయు, చాణక్యు
వానికిఁ బెట్టిన కష్టములును, చంద్రగుప్తుని రాజుగాఁజే
విధమును ఈ నవలయందు మిక్కిలి చక్కఁగ వర్ణింపఁ
గ్రంథమంతయుఁ గొనవరకుఁ జూచినదనుక విడువబుద్ధిపుట్ట

ప్రతి 1-కి రూ. 1-

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
**292**, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.